జూలై
1990

# చతుర

రూ 4/-




The largest circulated Telugu Monthly

# గుర్తుపెట్టుకోండి, పోషణనిచ్చే సమపాళ్లుగల ఆహారాన్నివకపోతే ఏమి జరుగుతుందో? చురుకుదనాన్నివ్వడానికి అవసరమయ్యే, 'సరియైన' తీరులోని కేలరీలు మీ పాపకి అందవు.



## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

అసలు 'సరియైన' కేలరీలు అంటే ఏమిటి?
డాక్టర్లు అనేదిది ఆహారంలోని ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, ఖచ్చితమైన సమపాళ్లు యీ కేలరీలలో వుంటాయని నిజానికి ఇవి పాప బాగా పెరగటానికి, చురుకుగా వుండటానికి, అవసరమైన కీలకమైన ఆహార పదార్థాలు.
మీ పాపకు 'సరియైన' కేలరీలు లభించేటట్లు ఖచ్చితంగా చూడాలి ఇవి ప్రతిసారి యిచ్చే ఆహారంలో వుండాలి రోజూ మామూలుగా వారం పర్యంతంగా యిచ్చే ఆహారంతో అలా యివ్వగలగటం చాలా మంది తల్లులకి సాధ్యంకాదు.
దానికి పరిష్కారం?
సెరిలాక్. పోషణ నిచ్చే సమపాళ్లుగల సంపూర్ణ ఆహారం. పాపకు 4 నెలలు వచ్చినప్పటి నుండి అంటే, కేవలం పాలు యిస్తే చాలని వయస్సు నుంచి, యిచ్చే ఆహారం.
సెరిలాక్‌లో ప్రొటీన్లూ, కార్బోహైడ్రేట్లూ, కొవ్వు పదార్థాలూ విటమిన్లూ, ఐరన్, కాల్షియం, వున్నాయి దాంతో మీ పాప చురుకుగా వుండటానికి అవసరమైన 'సరియైన' కేలరీలు లభిస్తాయి రుచికరంగానూ వుంటుంది
అందుకే యివ్వండి వెంటనే మీ పాపకు, పోషణనిచ్చే సమ పాళ్లలోగల సెరిలాక్.
మీ పాపకు 6 నెలలు వచ్చినప్పటి నుంచి వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, మరియు వీట్-వెజిటబుల్ అదనపు లాభం అందించండి.
దయచేసి ప్యాక్‌పైన యివ్వబడిన సూచనలను పాటించండి

---

ఉచితం: సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి: సెరిలాక్, పోస్ట్ బాక్స్ నెం. 21, న్యూ ఢిల్లీ 110029

---




## మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు వంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు వంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే వంపుతున్నాం. అడ్రనుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------------------------ కూపన్ ------------------------------

## జూలై చతుర నవల డబ్బు

సమీక్షకుని పేరు : ..................................................

చిరునామా : ..................................................

..................................................

..................................................

..................................................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# 'తూర్పు-పడమర'పై చతుర సమీక్షలు

మే 'చతుర'లో ప్రచురితమైన కవనశర్మ నవల 'తూర్పు- పడమర'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## హెచ్చరిక

**(ప్రథమ బహుమతి రూ. 100/-లు పొందిన సమీక్ష)**

మేనెల 'చతుర'లో కవనశర్మగారి నవల 'తూర్పు-పడమర' విభిన్న జాతులలోని లోటుపాట్లతోబాటు ఔన్నత్యాన్ని కూడా చెప్పింది.

భారతీయుల ఔన్నత్యం వారి సంస్కృతి-సాంప్రదాయం- ఆచార వ్యవహారాలలోనే వుంది. అభివృద్ధి చెందిన దేశాలలోని వారిని ఆకర్షించడానికి కారణం- భారతీయ సంస్కృతిలో వారు చూపిన పవిత్రతయే! ప్రాతివ్రత్యం అనేది కేవలం పాపభీతితో పాటించేదే కాదు, సూక్ష్మంగా తరచి చూస్తే అది వ్యక్తికి- సంఘానికి ఎంత శ్రేయోదాయకమో తెలుస్తుంది.

ప్రేమ శాశ్వతం- ఆకర్షణ క్షణికం. పాశ్చాత్యులు- మాసిన బట్టలు మార్చినట్లు జీవిత భాగస్వాములను మార్చివేస్తారు. అది వారి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలకి చిహ్నంగా భ్రమిస్తారు. కానీ పరస్పర విశ్వాసం లేని భార్యాభర్తలు జీవితకాలమంతా ఇలా మార్పిడులతో అశాంతిగానే గడుపుతారు. భారతీయ వివాహవ్యవస్థలో "మాంగల్యం- తంతునానే న- మమజీవనహేతునాం" అంటూ అగ్నిసాక్షిగా జరిగిన వివాహానికి- ఏడడుగులు- ఏడేడు జన్మలబంధమై- ఆలుమగల అనురాగం బలమైనబంధంగా బిగుసుకొంటుంది- కారణం దానిలోని స్థిరత్వం- ధర్మసూత్రాలు మాత్రమే. అది ఒకరిపై ఒకరికి సంపూర్ణ విశ్వాసాన్ని కలిగిస్తుంది. నవలలో కృష్ణ-శ్యామలని అనుమానించకపోవడానికి కారణం ఇదే- జరిగిన తప్పులకు ఇద్దరూ ఎవరికి వారే మానసిక క్షోభ- ఆవేదన పొందటం వలన శిక్ష వేసుకొని, అనుభవించి, ప్రాయశ్చిత్తంతో పునీతులైనారు. క్షణికావేశాలతో తొందరపడితే- కేవలం శారీరకమైన తృప్తి తప్ప ప్రేమ- అనురాగం కరువై అశాంతికి గురిచేస్తుంది. మనశ్శాంతి లేనినాడు లక్షలు సంపాదించి సుఖం ఏమిటి? ఈ ఫ్రీసెక్స్ వలన తండ్రి లేని, తండ్రి పేరూ చెప్పుకోలేని పిల్లలు పుట్టుకొస్తారు. అన్‌మారీడ్ మదర్‌గా వార్ని పెంచినా- వారిలో ప్రేమరాహిత్యం- ఇతరులను చూసి ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ పెరిగి సంఘంపై కసితో దొంగలుగా- హంతకులుగా- రేపిస్టులుగా మారి సంఘంలో చీడపురుగులై చరిత్రహీనులుగా రాలిపోతాయా మొగ్గలు. కృష్ణ తన ఆవేశం- అణుచుకొని- మనోనిగ్రహం అలవరుచుకొని చేసిన తప్పు దిద్దుకోవాలని ప్రయత్నించడం ఆనందకరమైన మలుపు. భారతీయ అధ్యాత్మికత- వేదాంతాలు- ధర్మాలు చెప్పేది ఈ నిగ్రహమే! "ప్రివెంషన్ ఈజ్ బెటర్ దేన్‌క్యూర్" అని హెచ్చరిస్తాయి అవి.

రచయిత శ్యామల పాత్రని అసమగ్రంగా చిత్రీకించారు అనిపించింది. తొలిరోజుల్లో బ్లూ ఫిలిమ్ చూడ్డానికే ఏహ్యత ప్రదర్శించి- అక్కడి ఆడవారి విశృంఖలత్వాన్ని విమర్శించి కూడా- తానూ ప్రతీకారం పేరిట వ్యభిచరించడం తొందరపాటే!

బ్రూక్‌తో కృష్ణ తల్లితండ్రులను వృద్ధాప్యంలో ఆదుకోవడం ఇండియన్స్ దేశాచారంగా- ధర్మంగా గర్వంగా వెల్లడిస్తాడు. తన తల్లితండ్రులు ఇంకా వయసులోనే వున్నా

ముఖచిత్రం: వాసు

రంటూ వారిరువురి వయసూ అరవై వసంతాలు దాటిందని చెప్పడం చూస్తే- వారికి వృద్ధాప్యపు వయసు అంటే చాలా ఎక్కువ అనిపించి ఆశ్చర్యం కలిగింది.

— ఎం.పి.శకుంతలా కళ్యాణీ,
విశాఖపట్నం.

## మరోఅద్దం

(ద్వితీయ బహుమతి రూ. 75/-లు పొందిన సమీక్ష)

**మ**న విలువలకు, పాశ్చాత్య విలువలకు మౌలికమైన భేదాలున్నాయనే సత్యానికి "మరో అద్దం" పట్టారు రచయిత ఈ నవలలో. రచయిత పేర్కొన్నట్లుగానే ఈ కథలో పాత్రలు, అర్థం, కామం చుట్టూ తిరిగాయి. శృతిమించిన శృంగారానికి తావివ్వకుండా సుతి మెత్తగానే గిలిగింతలు పెట్టారు రచయిత.

అయితే నవలలో కృష్ణ, శ్యామల, వెంకట్రావు, సీత మినహా వెస్టిండీస్ దీవుల్లోని పాత్రలేవీ రక్తమాంసాలుగల మనుషుల్లా అనిపించరు. యాంత్రికమైన సంభాషణలు మినహా వ్యక్తుల గురించి మనకేమీ తెలియదు. బహుశా రచయిత చెప్పినట్లుగా తక్కువ శృతిలోనేగాక తక్కువకాలంలో పూర్తిచేయడం, కథాగమన వేగాన్ని పెంచడంవల్ల ఈ లోపం ఏర్పడి వుండవచ్చు.

శీలం, స్త్రీ పురుషుల మధ్య లైంగిక సంబంధాల పట్ల మన అభిప్రాయాలు, వెస్టిండీస్‌ల అభిప్రాయాలు విరుద్ధమైనవని సహజంగా చెప్పారు రచయిత.

అయితే శ్యామలకు పుట్టబోయే బిడ్డ ఎవరి పోలికలతో వుంటాడు? అసలు నిజం కృష్ణకి తెలుస్తుందా? తెలిస్తే ఆ నిజాన్ని తట్టుకుంటాడా? డబుల్ స్టాండర్డ్స్ అంటే గిట్టని కృష్ణ తన తప్పుని సమర్థించుకున్నాడుగాని, తన భార్య అదే తప్పు చేస్తే, చేసినట్లు తెలిస్తే క్షమిస్తాడా? ఇవన్నీ శేషప్రశ్నలుగానే మిగిలిపోయాయి.

చివర్లో మాత్రం కృష్ణ తన లక్ష్యం అయిన అర్థాన్ని సంపాదించడం ద్వారా తృప్తిగానే వెనుదిరిగినట్లు అనిపిస్తాడు. ఏదిఏమైనా వెస్టిండీస్ ప్రజల సామాన్య దైనందిన జీవన సరళిని కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించి, వారి జీవన పరిస్థితులను జీవన శైలిని తెలిపేందుకు రచయిత చేసిన ప్రయత్నం ప్రశంసనీయం. పేరుకు తగ్గట్టు వారి సంస్కృతి, మన సంస్కృతి తూర్పు-పడమరే.

–టి.అంజనేయులు,
గజ్వేల్.

## సజీవ చిత్రణ

(తృతీయ బహుమతి రూ. 50/-లు పొందిన సమీక్ష)

**ఏ**మంచి నవలైనాసరే, సజీవమైన జీవితాన్ని ప్రతిబింబించాలి. అలాంటి జీవిత చిత్రణతో పాటు దాని మంచిచెడ్డల్ని విశ్లేషించటంలో నిజాయితీ వుండాలి. తూర్పు-పడమర నవలా రచనలో యీ రెండు వున్నాయి.

బాధ, సుఖ, ద్వేషానురాగాలతో కూడిన వ్యక్తి తన సంబంధాల్ని సమాజస్థాయికి తీసుకువెళ్ళ వీలున్నంతగా జన సామాన్య పరిధిలోకి చొప్పించి, వొప్పించేలా చదివించటం ఏ రచనకైనా పరీక్షే.

ప్రత్యక్ష పరోక్ష సంబంధాలతో కొన్ని పోలికలున్నా భారత- వెస్టిండీస్ జీవన విధానాలు తూర్పు-పడమరల్లాంటివే అయినా పరస్పరం సంబంధం లేనివి మాత్రం కావు. ఇతర దేశాల వారి దృష్టిలో యీరెండు దేశాల ప్రజలు ఆఫ్రికావాసుల్లా కాకపోయినా నల్లవారికిందే లెక్క. ఆర్థికంగా వారి దృష్టిలో వీరు సాంఘికంగా వెనుకబడినవారే అయినా వీరిలో కూడా అభిప్రాయబేధాలుండటాన్నీ ఆచార వ్యవహారాలలో తేడాలుండటాన్నీ రచయిత చక్కగా పట్టుకుని తమ రచనలో ఇమిడ్చారు.

ఈ నవలలో పాత్రలు కాస్త ఎక్కువే అనిపించినా, ఆ దేశపు అలవాట్లని, ఆచారవ్యవహారాల్ని వివరంగా చిత్రించటానికి తోడ్పడ్డాయి. నవల చివరలో శ్యామల గర్భవతి అవటం అంత అవసరమా అనిపిస్తుంది. జీవన క్రమంలో అలాంటివి జరుగుతున్నా శ్యామల గర్భం తాలూకు సంఘటనని మినహాయించి



కూడా రచయిత తాను చెప్పాలనుకున్న విషయాన్నంతా చెప్పగలడు అనిపిస్తుంది. కలుషితంకాకుండా మనకి మిగిలివున్న అమృత బంధం, తల్లీపిల్లలదే. శ్యామల మాతృత్వ విషయంలో ఇది బాధగానేవుందంటే రచన యొక్క బలీయత అంత మంచిస్థాయిలో వుందన్నమాట.

లోపాలు లేని రచనలు చాలా అరుదు. ఎత్తి చూపించాలని ప్రయత్నిస్తే యీ నవలలోను లోపాలు చూపించవచ్చు. కాని ఆలోచనని అటు పోనివ్వక సంయమనంతో చూస్తే అన్నిరకాలుగా యిది చక్కటి నవల.

— వి.లక్ష్మీకుమారి,
హైదరాబాద్.

## ప్రశంసనీయం

*(రూ. 25/-లు పొందిన సమీక్ష)*

**త**రతరాలుగా వస్తున్న అనేక ఆచారాలకు, నైతిక కట్టుబాట్లకు చెందిన భారతీయ యువ జంటను- విశృంఖల పాశ్చాత్య నాగరికత స్వంతం చేసుకున్న ప్రపంచంలో ప్రవేశపెట్టిన ఈ ఇతివృత్తం రచయితకు సవాలు వంటిది. పరస్పర విరుద్ధ ప్రవృత్తులకు చెందిన పరిసరాలు, పాత్రల మధ్య 'ఇంటరాక్షన్' చిత్రీకరించడంలో రచయిత కృతకృత్యులయ్యారు.

విభిన్న తత్వాలతో, వ్యక్తిత్వాలతో ప్రతి పాత్రా వ్యవహరించడం ఈ నవలలోని విశిష్టత. భారతీయ తత్వశాస్త్రం పట్ల ఆసక్తిగల విశృంఖల వేదాంతి జాన్; అనురాగాన్ని వ్యాపారాన్ని వేరుచేసే వ్యవహారదక్షురాలు శారద; పరస్త్రీల కోసం వెంపర్లాడే చౌదరి; ఖండాంతరాలలో వున్నా తమ ఆచారపరాయణత గురించి గొప్పలు చెప్పుకునే రాజన్; ... ఇలా అన్నిపాత్రలు తమ ప్రత్యేకతను నిలబెట్టుకొన్నాయి.

ఆధునిక మానవుడు అష్టయిశ్వర్యాలు సాధించినా, ఒంటరితనంతో అలమటించడాన్ని సూచిస్తూ, మనిషి ''సొంతవూరికి, అయినవారికి'' దగ్గరగా వుండాల్సిన అవసరాన్ని తెల్పుతూ ముగించడంవలన నవలకి సందేశాత్మకత చేకూర్చింది. విదేశయానంతో మొదలై, స్వదేశాగమనంతో అంతం చేయడంవల్ల, నవల ఆద్యంతాల మధ్య సమన్వయం కుదిరింది.

వృద్ధ తల్లిదండ్రుల పోషణ, బాధ్యత, శుభ కార్యాలకు కానుకలివ్వడం వంటి విషయాలలో పాశ్చాత్యుల పద్ధతిలోని ఆచరణయోగ్యతను చక్కగా వివరించారు.

సబ్జెక్ట్ స్పెసిఫిక్ నవలపేరిట వెస్టిండీస్ వీధుల క్లబ్బుల వివరాలు, అక్కడి స్థల పురాణాలు, ధరవరలు వంటి సాహిత్యేతర విషయాలకు ప్రాధాన్యత ఇవ్వకుండా, నవలను టూరిస్ట్ గైడ్‌గా చెయ్యకుండా, విభిన్న సంస్కృతి, సంప్రదాయాల మధ్య ''మానవ సంబంధాలలో, మనస్తత్వాలలో'' వచ్చే పరిణామాలను, సంఘర్షణలను ప్రధానాంశంగా నడపడం ప్రశంసనీయం.

— మునిరాజా,
నర్సారావుపేట.

## సంప్రదాయ విరుద్ధం

*(రూ. 25/-లు పొందిన సమీక్ష)*

**'తూ**ర్పు - పడమర' ఓ విలక్షణమైన నవల. 1990కి తగిన 'సరుకు' కథలో ఉంది. కథనంలో కల్పన తక్కువ. వాస్తవికత ఎక్కువ. వెస్టిండీస్ దీవుల్లోని ప్రజల నిజజీవన స్థితిని, కల్చర్‌ని యథాతథంగా చూపుతూ రచయిత పాఠకుల ముందుంచిన యదార్థ చిత్రీకరణ ఇది. సెక్స్ కేంద్ర బిందువుగా గీయబడిన రంగుల వృత్తం పరిధిలో మలచబడ్డ ఈ చిత్రానికి కవన శర్మగారు 'మంచి దర్శకుడు' కాగలిగారనే చెప్పవచ్చు. నిజానికి నవలలో 'కథ' అంటూ పెద్దగా ఏంలేదు. కృష్ణ, శ్యామల 'మడిగట్టుకున్న' దంపతులుగా తెలుగుదేశం నించి వెస్టిండీస్‌వెళ్ళి, మళ్ళీ ఈ దేశానికి 'మైలపడిన దంపతులు'గా తిరిగి రావడమే ఇందులోని కథ. కథ చెప్పిన విధానం బాగున్నా ఇతివృత్తం సరిగాలేదనిపిస్తుంది. తప్పనిసరి పరిస్థితులుగాని, ఆ అవసరంగాని లేకుండానే కృష్ణ, శ్యామల ఎలా, ఎందుకు గాడితప్పిన వ్యక్తులయ్యారో ఒకంతట అర్థంకాదు. యూనివర్సిటీ లెక్చరర్, సంస్కారవంతు




డు అయిన కృష్ణ, శ్యామలలాంటి వయసుకత్తెను భార్యగా పొందికూడా లతతో వ్యభిచరించడం ఎబ్బెట్టుగా ఉంది. ఆదేశపు పద్ధతులు, నాగరికత ప్రకారం అది 'తప్పు' అనిపించుకోదని సరిపెట్టుకోడానికైనా అతని చర్య సమర్ధనీయంగా లేదు. భర్త అనుచిత ప్రవర్తన చూసిన శ్యామల, సంప్రదాయాలకి కట్టుబడినదై ఉండి కూడా నారాయణతో వ్యభిచరించడం మరీ జుగుప్సాకరంగా ఉంది. చపలత్వంతో కృష్ణ, కోపంతో శ్యామల "తప్పి చరించారు" అని రచయిత చెప్పడం ప్రధాన పాత్రల ఔచిత్యానికి దెబ్బ! 'నారీ నారీ మధ్య మురారి'గా కృష్ణ తన, మన సంస్కృతికి మచ్చతెస్తే, 'ఓ హరికీ, గిరికీ మధ్య వయారి'గా శ్యామల తెలుగింటి ఆపడుచుకి అవమానం తెచ్చిపెట్టింది. నాయకీ నాయకుల ఉదాత్తతకి భంగం వాటిల్లిన చోట సామాజిక ప్రయోజనం నైతికంగా ప్రశ్నార్థకమౌతుంది. అదే జరిగింది ఈ నవలలో.

అయినా నవలలో కొన్ని ప్లస్ పాయింట్లు లేకపోలేదు. చక్కని విషయ పరిజ్ఞానానికి ఈ నవల దోహదం చేస్తుంది. శర్మగారి శైలి రచనకి అందం తెచ్చింది. ఆద్యంతం చదివించే చతురత రచయిత కలంలో ఉంది. దీవులలోని జన జీవనం, సిఫిలిస్ పేరెంట్స్‌కి పుట్టిన శామి, క్రిష్టీ జీవన సరళి, తెలుగుజాతికి చెందిన డాక్టర్ల ఉనికి, ట్రినిడాడ్‌లో దీపావళి, కార్నివాల్ పుణ్యమా అని శీలం కోల్పోయే పదహారేళ్లలోపు బాలికల చరిత్ర వగైరా విశేషాలు మంచి ఇన్‌ఫర్‌మేషన్‌ని అందించగలవు.

— డి. రాజ్యలక్ష్మి,
రామచంద్రపురం.

## అనవగాహనతో...

*(రు.25/- బహుమతి పొందిన కథ)*

**క**వన శర్మగారి నవల 'తూర్పు - పడమర' చదివేక పాఠకుడికి ఈరకమైన అభిప్రాయాలు కలిగే అవకాశం వుంది. "వెస్టిండీస్‌లో సాంఘిక సంబంధాలన్నీ వ్యాపార సంబంధాలే. విశృంఖల సెక్స్ జీవితం, మద్యపానం అక్కడి వ్యవస్థలో ఒక భాగం. పైగా సెక్స్ సంబంధాలు కూడా వ్యాపార సంబంధాలే. వెస్టిండీస్‌లో వున్న నల్లజాతీయులు సోమరులు. దీన్ని అవకాశంగా తీసుకొని అక్కడికి ప్రవాసం వెళ్ళిన భారతీయ సంతతి వారు బాగా సంపన్నులయారు."

ఇదే కవనశర్మగారి అవగాహనయితే, అది నిశ్చయంగా దుందుడుకుగా సాగిన ఆలోచనా సరళి. వెస్టిండీస్ గురించి యిది ఎంతమాత్రం సరియైన అవగాహనకాదు. ప్రపంచంలో ప్రతిదేశం తనదైన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని దేన్నో ఒకదాన్ని కలిగి వుంటుంది. అదే ఆజాతి జీవనాడి. దానిని వెతికి పట్టుకోగలడమే గొప్పరచయిత సాధించగలిగే విజయం. జోసెఫ్ కొనార్డ్‌లాంటి మహా రచయిత బాగా వెనుకబడిన ఖండాలయిన ఆఫ్రికా, ఆసియాల్లో కూడా ఏదో గొప్ప ఔన్నత్యాన్ని దర్శించగలిగేడు. అందువల్లనే ఈ ఖండాలను బేక్‌గ్రౌండ్‌గా చేసుకుని ఆయన రచించిన "ది హార్ట్ ఆఫ్ డార్క్‌నెస్" "లార్డ్ జిమ్" నవలలు క్లాసిక్స్ అయేయి. ఒక దేశపు అంతరాంతరాల్లో దాగివున్న ఔన్నత్యాన్ని దర్శించి, ఆవిష్కరించ గలగడం రచయిత ప్రజ్ఞా విశేషాలకు తార్కాణం.

శర్మగారు భావించినట్టు నిజంగానే వెస్టిండీస్ జీవనం నీతిబాహ్యమైనదని భావించవలసి వస్తే, ప్రపంచ ప్రఖ్యాత వెస్టిండీస్ రచయిత వి.యస్.నైపాల్ "ది ఏరియా ఆఫ్ డార్క్‌నెస్" అనే పుస్తకం రాసి భారత ప్రజల మనస్సుని తీవ్రంగా గాయపర్చేడుకదా. అలా చెయ్యడానికి ఆయన నైతికమయిన హక్కుని కలిగి వుండేవాడా?

అంచేత స్పష్టంగా తెలుస్తున్న విషయమేమంటే, శర్మగారు అవగాహనలోపంతో చేసిన రచనయిది. నిజానికి యీ నవలని 'ట్రావెలోగ్' అనడం సబవుగా వుంటుంది. పైపై అనుభవాలతో అభిప్రాయ వ్యక్తీకరణ ట్రావెలోగ్‌లోనే జరుగుతుంది. నవలకి కావలసిన హంగులు - మంచికథ, పాత్ర పోషణ, సంఘటనల్లో సంక్షిప్తత, నాటకీయత - ఏవీలేవు ఈ 'తూర్పు - పడమర'లో. ఇటువంటి నవలలు ప్రచురించడంవల్ల వచ్చే లాభంకన్నా జరిగే నష్టం ఎక్కువ.

— ఎ.వి.రెడ్డి శాస్త్రి,
చోడవరం.



# చతుర ప్రపంచం

## అద్భుత నగరం

అధునాతన సాంకేతిక పరిజ్ఞానం వుపయోగించి ప్రపంచంలోకెల్లా ఆదర్శనగరంగా 1995కల్లా కావసాకి తయారవబోతోంది. రాష్ మీమయూర్, ప్రముఖ వాతావరణ శాస్త్రజ్ఞుడు నుసాన్‌గిల్ అనే అమెరికన్ మహిళా వాస్తుశిల్పి, ఫ్రాంక్ గిట్టాన్‌జారో అనే కంప్యూటర్ నిపుణుడు కలిసి ఆ నగరపు నమూనా తయారుచేశారు.

ఆ నగరంలో ఎన్నో అద్భుతాలుంటాయట. కారుదిగి కాలుమోపగానే ముందుగా ప్రోగ్రాం చెయ్యబడ్డ ఎలివేటర్ ఎదురుచూస్తుంటుంది. మైక్రో కంప్యూటర్లే అక్కడి పనులన్నీ నిర్వహిస్తాయి. ఆ నగరం పూర్తిగా అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానం ఆధారంతోనే పనిచేస్తుంది. పొద్దున్నే వీడియోతెరపై దినపత్రికని చదివెయ్యడం, కంప్యూటర్లద్వారా జరిగే వుత్తరాల బట్వాడా, ఫాక్సిమిలి పద్ధతిద్వారా ఫొటోలని ఓ చోటినుండి మరోచోటికి పంపడంనుంచి మనిషి ఆలోచన, పనులు కంప్యూటర్లే నిర్వహిస్తాయి.

ఫైబర్ ఆప్టిక్స్, కంప్యూటర్స్ ఆధునికమైన టెలిఫోన్లు, అచ్చుయంత్రాలు, టెలివిజన్ మానిటర్లు - మొదలైనవాటినన్నిటినీ ఒకదానికొకటి కలుపుతారు. అందువల్ల ఆఫీసులకి, పాఠశాలలకి, గ్రంథాలయాలకి వెళ్ళే పని వుండదు. రోడ్లపై కార్లరద్దీ వుండకపోవడంవల్ల వాతావరణ కాలుష్యం కూడా వుండదు.

ఓ మిలియన్‌మంది జనాభా వున్న పట్టణం కావసాకి. వాతావరణపరంగా యిప్పటికే అది ఒక ఆదర్శనగరం. ప్రజల అవసరాలన్నిటినీ దృష్టిలో వుంచుకుని ఆ నగరంలోని కంప్యూటర్లన్నిటినీ తదనుగుణంగా ప్రోగ్రాం చేస్తారు. అత్యవసర పరిస్థితిలో ఫైర్‌బ్రిగేడ్‌కి కబురందించేలా కంప్యూటర్‌ని ప్రోగ్రాం చెయ్యొచ్చు.

ఆ అద్భుతమైన నగరంలోని భవనాలన్నీ ఎలక్ట్రానిక్ సదుపాయాలు కలిగి ఉంటాయి. మరో ఏడేళ్ళలో కావసాకిలో డబ్బు అవసరమే వుండదు. ఎందుకంటే, లావాదేవీలన్నీ అయస్కాంతీకరణం చెయబడ్డ ప్లాస్టిక్‌టోకన్లద్వారా జరుగుతాయి. ఆఫీసుల్లో విద్యుత్తు, నీరు వృధా అయ్యే ప్రమాదమేలేదు. ఎందుకంటే ఉద్యోగులంతా ఆఫీసు భవనం విడిచిన ఏడు నిముషాల్లో స్విచ్‌లు వాటంతటవే ఆర్పబడ



తాయి. కుళాయిలుకూడా వాటంతట అవే ఆగిపోతాయి.

దినచర్యంతా యంత్రాలే నిర్వహిస్తుండటంవల్ల తీరిక సమయంలో గడపటానికి, వినోదం కలిగించటానికి, విశ్రాంతి తీసుకోవటానికి పార్కులు, తోటలు నిర్మిస్తారు. ఈ శతాబ్దం ముగిసేలోపు అలాంటినగరాలు 19 తయారవుతాయట.

నగర నిర్మాణంలో మొహంజోదారో మొదటి విప్లవాన్ని, పారిశ్రామిక విప్లవం రెండో విప్లవాన్ని తీసుకురాగా ఈ కొత్తతరహా నగర నిర్మాణాన్ని మూడో విప్లవంగా భావించవచ్చు.

ఆస్ట్రేలియాలోని బ్రిస్‌బేన్‌లో 'రివర్‌సైడ్' అనే భవనం నిర్మించారు. దాన్ని యింటిలిజెంట్ బిల్డింగ్ అంటారు. ఎందుకంటే అది ఆలోచిస్తుందట. కింది అంతస్థులో నిలవబడ్డ కార్ల దగ్గర్నుండి అన్నిటికీ ఆటోమేటిక్‌గా రక్షణ కల్పించబడుతుంది. ఎవరైనా అక్కడ కారాపి దిగగానే అక్కడవుండే అధునాతనమైన ఏర్పాట్లవల్ల ఎలివేటర్ దానంతటదే వస్తుంది. దాన్లో ఎక్కగానే, కావలసిన అంతస్థుకి తీసుకెళ్ళి, అక్కడి లైట్లువేసి, ఎయిర్‌కండిషన్ స్విచ్‌ఆన్ చేస్తుంది. ఆ భవనానికి మెదడు కంప్యూటర్లు. అక్కడి ఏర్పాట్లని మానవ శరీర నిర్మాణంతో పోల్చవచ్చు. కంప్యూటర్లు మెదడుగా; కేబుల్స్ నాడులుగా; సమాచారాన్ని, శబ్దాన్ని వీడియో ప్రసారాల్ని అందించే లోకల్ఏరియా నెట్‌వర్క్ రక్తప్రసారంగా ఆ భవనం మనిషి శరీరంలా అద్భుతంగా పనిచేస్తుంది.

## రష్యాలో ప్రకటనలు

రష్యాలో వ్యాపార ప్రకటనల హోర్డింగులూ, బిల్‌బోర్డులూ ఈ మధ్య అవతరించిన విషయంగా ప్రపంచవ్యాప్తంగాప్రజల్లో కుతూహలం కలిగించింది. మాస్కో నగరంలో కార్ల ప్రకటనలకు సంబంధించిన భారీ హోర్డింగులు నెలకొల్పిన విషయం యితర దేశాలవారికి ఎంత ఆశ్చర్యాన్ని కలిగించిందో, ఆ హోర్డింగులు తమ నగరంలో చూసుకోవటం మాస్కోవాసులకూ అంతే ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ బోర్డులు ప్రత్యక్షమయినప్పటి నుంచీ, మాస్కోవాసులు గుంపులు గుంపులుగా చేరి వాటిని పరిశీలించటమూ, వాటి గురించి చర్చించుకోవటమూ సాధారణమైపోయింది. ఇందుకు కారణమేమిటంటే రష్యాలో పరిశ్రమలు ప్రభుత్వరంగంలోవుంటాయిగనుక వాటికి వ్యాపార దృక్పథంగల ప్రచారం అవసరంలేదు. మరీ విచిత్రమైన విషయమేమిటంటే, రష్యాలో కారు కావలసినవాళ్ళు దరఖాస్తు చేసుకుని, కొన్ని సంవత్సరాలపాటు వేచివుండాలి. కార్లగురించి చెప్పుకోవలసిన మరో విషయం ఏమిటంటే, కారు సొంతదారులంతా తమ తమ కార్ల వైపర్లను విప్పదీసి కారులోపల దాచుకుంటారు. వర్షం రాగానే కార్ల యజమానులంతా వర్షంలో తడుస్తూ, కార్లకు వైపర్లను



బిగించుకుంటూ మిగతావారికి తమాషా కలిగిస్తుంటారు. ఇందుకు కారణమేమిటంటే వైపర్లూ, సైడ్‌మిర్రర్లలాంటి చిన్న చిన్న విడిభాగాలు సైతం అంత సులువుగా దొరకవు. అంచేత ఆయా విడిభాగాలు అవసరమైనవాళ్ళు తమ కార్లవి ఎత్తుకుపోతారనే అనుమానంతో కార్ల యజమానులు యిలా చేస్తుంటారట. కార్ల మోజును వీలైనంత తగ్గించటానికి ప్రభుత్వం విడిభాగాలను అంత సులువుగా సరఫరా చేయదు. ఒకసారి పాడైన కారును, చిన్న విడిభాగం దొరకక సంవత్సరాలతరబడి మూలనపడేయాల్సి రావటం సర్వసాధారణం. అలాంటి రష్యాలో కార్ల ప్రకటనలు, సరికొత్త పద్ధతిలో హోర్డింగులపై దర్శనమీయటం ఆశ్చర్యమేమరి.

రష్యా అంటేనే కమ్యూనిజానికి మారు పేరయింది. పెట్టుబడిదారీ సమాజంలో వుండే అనేక అవకతవకలూ, వృధాఖర్చులూ, హంగులూ, ఆర్భాటాలూ కమ్యూనిస్టుదేశాలలో అంతగా కనిపించవు. ముఖ్యంగా పారిశ్రామిక రంగానికి ప్రాణమైన వ్యాపార ప్రకటనలు రష్యాలో ఎలా వుంటాయి, అసలుంటాయా అన్నసందేహమూ; వాటికి సంబంధించిన సమాచారాన్ని తెలుసుకోవాలన్న కుతూహలమూ జనసామాన్యాన్ని వెన్నాడుతుంటాయి. ప్రభుత్వం కొన్ని నిర్ణీత వస్తువులను ఉత్పత్తి చేసిన తరువాత వాటిని అవసరం కొద్దీ కొనుక్కోవటం తప్పిస్తే, యిక వాటిని మరింత గొప్పగా చూపించే ఆర్భాటాల అవసరం ఏముంటుంది గనుక.

పాశ్చాత్య దేశాలలో వాడుకలోనున్న అన్ని రకాల ప్రచార సాధనాలూ రష్యాలోనూ ప్రచారంలో వున్నాయి. అయితే వాటిసంఖ్య, స్వరూపమూ, వాటిని ఉపయోగించుకునే రంగాలూ వేరుగా వుంటాయి.

రష్యా దినపత్రికల్లో వ్యాపార ప్రకటనలు చాలా తక్కువగా కనిపిస్తాయి. ఉదయం దినపత్రికల్లో ఎక్కువలో ఎక్కువ ఏడెనిమిది కాలమ్సుకు మించి వ్యాపార ప్రకటనలు ప్రచురించరు. అందులోనూ పూర్తి పేజీ ప్రకటనలు అసలేవుండవు. అరపేజీ ప్రకటనలు కూడా చాలా అరుదు. సాయంత్రం దినపత్రికల్లో కూడా మహాఅయితే ఓ యిరవై పత్రికలు మాత్రమే పూర్తి పేజీ ప్రకటనలను స్వీకరిస్తాయి. ఉదయం పత్రికల్లో ఎక్కువ ప్రజాదరణ పొందినవి 5 వందలపైగానే వున్నప్పటికీ, వాటిలో చాలా వరకూ అరపేజీ, అంతకు తక్కువ స్థలం వుండే ప్రకటనల్నే స్వీకరిస్తాయి. మరి జాతీయ పత్రికలు సాధారణంగా 6 పేజీలు, అప్పుడప్పుడూ 8 పేజీలతో వెలువడుతాయిగానీ, మొత్తం మీద వాటిలో ప్రకటనలన్నీ కలిసి ఒక కాలమ్‌కు మించి వుండవు.

రష్యాలోని పత్రికలకు ఓ నియమం వుందనుకోవాలి. పత్రిక సర్క్యులేషన్ ఎంత ఎక్కువ వుంటే, అది స్వీకరించే ప్రకటనలు అంత తక్కువ వుంటాయి. అందుకేనేమో, స్థానిక పత్రికల్లో దాదాపు సగంపేజీలు ప్రకటనల్ని ప్రచురిస్తాయి. వీటిలో పూర్తి పేజీ, అరపేజీ ప్రకటనలు కూడా తరచుగా దర్శనమిస్తాయి. ఏ పత్రిక ఎన్ని ప్రకటనల్ని ఏసైజులో ప్రకటించాలన్నా అసలు ప్రకటించకుండా తిరస్కరించాలన్నా ఆ నిర్ణయం ఆ పత్రిక సంపాదకుని యిష్టాయిష్టాలపైనే ఆధారపడి వుంటుంది. ముఖ్యంగా చాలావరకు ప్రకటనలు యివ్వడానికి వచ్చిన వ్యాపారస్తులనూ, పౌరులనూ నిరుత్సాహపరుస్తారు. అయినా విననప్పుడు ఆ ప్రకటన అనవసరమనుకుంటే నిరాకరిస్తారు కూడా.

రష్యాలోని రేడియోలు, టెలివిజన్లు కూడా వ్యాపార ప్రకటనలను ప్రసారం చేస్తాయి. అయితే ఇవన్నీ ఆకర్షణీయంగా, ఆకట్టుకునే విధంగా ఉండవు. పాఠం చదివినట్టుగా, అనాసక్తికరంగా ఉంటాయి. రేడియో, టెలివిజన్ ప్రకటనలైనా, పత్రికా ప్రకటనలైనా వాటిలో విషయం చాలా క్లుప్తంగా ఉంటుంది. ఆ వస్తువు వర్ణన, బ్రాండుపేరు, అవి అమ్మే షాపుల చిరునామాలూ, అవసరమైనప్పుడు వస్తువు బొమ్మ- ఇంతే, ఇంతకన్నా ఏ ఇతర ఆకర్షణీయ నినాదాలూ ఉండవు. చాలా దినపత్రికల్లో, పెద్ద పత్రికల్లో కనిపించే ప్రకటనల్లో ఎక్కువగా అగ్నిప్రమాదం, దొంగతనాలకు ఇన్సూరెన్స్ చేసుకోమనే విషయాలూ, పొదుపు చేయటంవలన కలిగే లాభాలూ, వాటి వివరాలూ మాత్రమే ఉంటాయి.

రష్యాలో అడ్వర్‌టైజింగ్ సీజన్‌గా చెప్పుకోదగిన సందర్భాలు రెండున్నాయి. మార్చి 8వ తేదీన వచ్చే అంతర్జాతీయ మహిళా దినో





అబ్బే! యాక్సిడెంట్ కాదు..
ఎడ్వర్టయిజ్‌మెంట్లు ఇవ్వడానికి
పత్రికాఫీసుకు వెళ్ళా! ఆ ఎడిటరే ఇలా
చేసాడు...

త్సవం ముందు స్త్రీలకు సంబంధించిన వస్తువులు, నగలు, సెంటులూ, అలంకరణసామగ్రి, స్త్రీలకు బహూకరించగల వస్తువులకూ సంబంధించిన ప్రకటనలు బాగా కనిపిస్తాయి. ఇక కొత్త సంవత్సరం ముందుగా పండుగ అలంకరణలు చేసే సంస్థలు, అలంకరణ సామగ్రి, కొత్త సంవత్సరం వేడుకలకు సంబంధించి హొటళ్ళ వారి ప్రత్యేక సౌకర్యాలూ, పండుగడాన్సులూ వంటి విషయాల గురించిన ప్రకటనలు దర్శనమిస్తాయి. మామూలుగా వ్యక్తిగత ప్రకటనలే ఎక్కువగా ఉంటాయి. ఏదో విషయంలో సహాయం కావాలనీ, సహాయం చేయగలమనీ, తమ దగ్గర ఫలానా వస్తువులు మిగిలిపోయాయి గనుక అవసరమైన వారు దరఖాస్తు చేయవచ్చుననీ, ముడిసరుకులూ, విడిభాగాలూ లాంటివి కావాలనిగానీ తమవద్ద ఉన్నాయనిగానీ, దర్జీల వివరాలూ, వారు చేసే దుస్తుల వివరాలూ, చెప్పులూ, బూట్లూ బాగుచేసేవారు, ఊరి చివరనున్న తమ విశాలమైన అపార్ట్‌మెంట్ తీసుకుని ఊరి మధ్యలోనున్న చిన్న అపార్ట్‌మెంట్ కావాలనేవారూ, ఇవ్వగలమనేవారూ, విడాకుల ప్రకటనలూ- వంటి వ్యక్తిగత ప్రకటనలు ఎక్కువగానూ, వ్యాపార ప్రకటనలు తక్కువగానూ కనిపిస్తాయి. ఇవికాక ఉన్నత విద్య, వృత్తి విద్యాకోర్సుల పరీక్షా ఫలితాలు, లాటరీల ప్రకటనలూ, ఫలితాలూ కూడా పత్రికల్లో కనిపిస్తాయి. ఇంతవరకూ హోర్డింగులను రాజకీయ ప్రకటనకు మాత్రమే వినియోగించారు.

ప్రకటనలన్నీ మూసపోసినట్టుగా, అనాసక్తికరంగా ఉండే ధోరణి మార్చడానికి ప్రయత్నిస్తామని సాంస్కృతిక మంత్రిత్వశాఖ వారు 1958లో ప్రకటించారు. మరుసటి సంవత్సరం రష్యాలో వాయిదా కొనుగోలు పద్ధతి ప్రవేశపెట్టారు. ఇది కూడా ఒక రకంగా పెట్టుబడిదారీ సంస్కృతే. అందుచేత ఒకటీ, ఒకటీ కలుపుకుని వ్యాపార ప్రకటనా రంగంలో విపరీత మార్పులొస్తాయని చాలామంది భావించారు కానీ, ఇంతవరకూ అలాంటి ప్రయత్నాలేమీ మొదలవ్వలేదు. అంతేకాక, 1958లో రష్యాలో మద్యపాన వ్యతిరేక ఉద్యమం చేపట్టిన తరువాత మద్యపానీయాలకు సంబంధించిన ప్రకటనలు దాదాపు అదృశ్యమయ్యాయి.

పత్రికాఫీసులో వ్యాపార ప్రకటనలు స్వీకరించే డిపార్ట్‌మెంట్‌వారు, ఆయా ప్రకటనలు ఇచ్చేవారికి బొమ్మలూ, లే అవుట్‌లకు సంబంధించి అవసరమైన సహాయం అందిస్తుంటారు. విడిగా వ్యాపార ప్రకటనలు తయారుచేసే, పత్రికల్లో ప్రచురింపజేసే అడ్వర్టైజింగ్ బ్యూరోలు కూడా రష్యాలో ఉన్నాయి. ఇప్పుడు కార్ల ప్రకటనల హోర్డింగులు వెలసిన తరువాత ముందుముందు ఎలాంటి మార్పులు రష్యా ప్రకటన రంగంలో వస్తాయో వేచి చూడాల్సిందే.



# చతుర

సంపుటి : **13** జూలై **1990** సంచిక : **6**

అనుకోకుండా అదృష్టం అందలం ఎక్కించిందతన్ని. లోక మంతా ఆ ఒక్కదానికే దాసోహమంటున్నా తను మాత్రం దాని వలలో చిక్కుకోదల్చుకోలేదతను. 'అది' లేదనే ఒకప్పుడు తనను అవమానపరిచినవారంతా నేడది తనవద్దకు చేరిందని తెలీగానే బెల్లంచుట్టూ ఈగల్లా ముసరసాగారు. కానీ 'అది'లేని ఆనాడూ 'అది' ఉన్న ఈనాడూ కూడా బెదరని, చెదరని ధీచిత్తంతో, ముందుకుసాగే అతను ఒకదశలో ఆత్మీయుల వత్తిళ్ళకు లొంగి వక్రదారులు పట్టబోయాడు. అయినా వెంటనే తనను తాను సవరించుకున్న సంస్కారి అతను.



అలా నైతిక విలువలకోసం, మానవత్వపు మహోన్నత ఆశ యాలకోసం తను నమ్మినమార్గంలో పయనించిన అతనికి లౌకిక ప్రపంచంలో ఎలాంటి సమస్యలెదురయ్యాయి?

అవసరమైనపుడు అందకా, అందాక రకరకాల చిక్కుల్ని సృష్టించీ అతనికి మనశ్శాంతి లేకుండాచేసిన 'అది' ఏమిటి? ఎలాంటిది అది?

ప్రతీవ్యక్తి జీవనగమనంతో ముడిపడి ఉన్న 'డబ్బు'నీ, అది అందించే సుఖాల్నీ, సృష్టించే సమస్యల్నీ సమర్థవంతంగా విశ్లే షించే ...

కె. చిన్నబాబు రచన 'డబ్బు'

ఈ నెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.

అర్ధరాత్రివేళ చప్పున మెలుకువ వచ్చింది సత్యనారాయణమూర్తికి.

చుట్టూ చీకటి!

నల్లని చీకటి...

రాక్షసిలాంటి చీకటి...

రాక్షసులవంటి మనుష్యులు చీకటిలో దాచిన డబ్బువంటి నల్లని చీకటి!

డబ్బు!

ఆ పదం గుర్తుకురాగానే సత్యనారాయణలో ఒకవిధమైన బెదురు కలిగింది. రెండక్షరాల ఆ పదంతో తనకెంత అవసరముందో తలచుకుంటే గుండె బేజారవుతూ ఉంది.

అతడు కళ్లు చికిలించి చూశాడు. అప్పుడే చీకటికి అలవాటుపడుతున్న ఆ కళ్ళకు దూరంగా పడుకుని ఉన్న ఆకారాలు అస్పష్టంగానే అయినా కనిపిస్తూనే ఉన్నాయి.

స్థితికి మించి దుబారా చేసే భార్య...

చక్కగా చదువుకుని కూడా రెండేళ్ళుగా నిరుద్యోగిగా మిగిలివున్న కొడుకు...

ఐదేళ్లక్రితమే పెద్దదయి, ప్రస్తుతం పెళ్ళికెదిగి- .అర్ధరాత్రి కూడా నిద్రలేకుండా చేస్తున్న ముద్దులకూతురు...

నగటు మనిషికి ఈ సమస్యలు చాలవూ?! అయినా నగటుమనిషి అసలు బాధపడేది ఎందుకు? వారి జీవితసమస్యలకు కారణం ఏమిటి?

ఏముంది... ఆ రెండక్షరాల పదమే- డబ్బు!

ఈ లోకంలో డబ్బుకు ఎంతో ప్రాధాన్యత ఉంది. ప్రతి మనిషినీ ఆడించేదీ- ఆడేలా చేసేదీ డబ్బే.

అందలంలో నిలిపేదీ పడవేసేదీ కూడా అదే!

డబ్బుకన్నా గొప్ప 'వస్తువు' ఈ లోకంలో మరేదీ లేకపోవచ్చు. ఆ డబ్బుకోసం జనం ఏ స్థితికయినా దిగజారుతారు.

ప్రజలంతా కలిసి ఎంతో అభిమానంతో ఎన్నుకున్న ప్రధానమంత్రయినా ఒక్కోసారి ఈ డబ్బుకోసమే గడ్డితింటుంటాడు. అంటే అభిమానం, జనంలో గౌరవం, చరిత్రలో సముచిత స్థానం కూడా కేవలం డబ్బుకోసం వదులుకుంటారన్నమాట. ఆ సమయంలో వారికి జనం, వారి ఆదరణ- ఆప్యాయతలు ఏవీ గుర్తుకురావు. ఏ సెంటిమెంటూ వారిని బంధించలేదు. దీనినిబట్టే చెప్పొచ్చు- డబ్బు ఎంత గొప్పదో.

ప్రపంచమంతా తిరిగేది డబ్బు చుట్టుతానే ఏమో!

ఆ డబ్బే తనకు ఉంటే తన పరిస్థితి ఎలా ఉండేది?!... ఎక్కువగా ఆలోచించటం అనవసరమనిపించింది. బలవంతంగా కళ్లుమూసి నిద్రపోవాలని ప్రయత్నించాడు అతడు. నిద్ర రాలేదు. సమస్యలతో సతమతమయ్యే మనిషికి నిద్ర ఎలాపడుతుంది?

పక్కమీద కాసేపు అటుఇటు పొర్లాడు.

దాహంగా అనిపించింది.

పక్కకు ఒరిగి మంచం కింద తడిమాడు నీళ్లచెంబు తగల్లేదు.

'కామేశ్వరి నీళ్లు పెట్టడం మరచిపోయి ఉంటుంది' మనసులోనే అనుకున్నాడు.

లేచి లైట్ స్విచ్చాన్ చేశాడు. గది మొత్తం ఒక్కసారిగా వెలుతురుతో నిండింది. దరిద్రంలో ఉన్న వ్యక్తికి ఒకేసారి పెద్దమొత్తం డబ్బువస్తే కళ్లు కనిపించకుండా పోయినట్లు, అప్పటివరకూ చీకటిలో ఉన్న అతను అంత వెలుతురు ఒక్కసారిగా భరించలేక చప్పున కన్నులు మూసుకున్నాడు. రెండుక్షణాల తర్వాత కళ్లు తెరిస్తే మొదట మసగ్గా తర్వాత స్పష్టంగా కనిపించాయి పరిసరాలు.

అతడు ఆ వంక చూసాడు.

తల్లీకూతుళ్లు ఒకే మంచం మీద, గాఢ నిద్రలో మునిగివున్నారు.

నీరజ ఓ పక్కకు వత్తిగిలి పడుకుని ఉంటే, కామేశ్వరి వెల్లకిలా పడుకొని ఉంది. కట్టుకున్న చీర మోకాళ్లపై వరకూ జరిగివుంది. నునుపైన తొడలు సగం వరకూ కనిపిస్తున్నాయి. కొందరు కవులు అలాంటిస్థితిని ఏవేవో పదాలతో గొప్పగా వర్ణిస్తారు. ఆ సమయంలో స్త్రీని చూస్తే మగాడి మనసు అదుపు తప్పుతుందట.

అదుపు తప్పడం సంగతేమోగాని- తనకు మాత్రం అసహ్యం వేస్తుంది. ఆడదయినా-మగవాడయినా వళ్లు మరిచేలా నిద్రపోవడం




తనకిష్టం ఉండదు. ఒకవేళ గాఢనిద్ర వచ్చినా ఒకింత ఒద్దికగానే పడుకుంటే బాగుంటుంది తప్ప ఇలా చీరలు తొలగీ- పంచలు చెదిరీ... నాస్టీ!

ముందుకు నడిచి బిందె మీది మూత తీసి, గ్లాసులో నీళ్లు ముంచాడు. ఆ చప్పుడుకు కామేశ్వరి కళ్లు తెరచి చూసి 'ఏమిటీ' అంది విసుగ్గా.

"దాహమయితేనూ"

"చెంబుతో పెట్టలేదా?"

"లేదు"

ఇక మాట్లాడే ఓపికలేకనో, ఇంకా ఎక్కువగా మాట్లాడటం అనవసరమనో, ఆమె తిరిగి నిద్రలోనికి జారుకుంది.

సత్యనారాయణ నీళ్లు తాగి వచ్చి లైట్ ఆర్పి మంచం మీద వాలాడు.

తిరిగి ఆలోచనలు మొదలు... సాధారణంగా సామాన్యుడి ఆలోచనలు ఎంతకీ తెగవు. తెగేలా చేయడమంటే పరిష్కారమన్న మాట. ఆ పరిష్కారమన్నది డబ్బుతోనే అయితే- డబ్బు లేకుండా ఎంతగా ఆలోచించి మాత్రం చేయగలిగింది ఏముంది? అది తనకూ తెలుసు. తెలిసి కూడా ఆలోచిస్తూనే గడిపేయడం సామాన్యుడి సాధారణ లక్షణం.

ఆలోచనల మధ్య కొట్టుమిట్టాడిన అతడు ఎప్పటికో నిద్రపోయాడు.

★ ★ ★

రాత్రంతా సరిగా నిద్రలేకపోవడంతో, మంచం దిగేసరికి చాలా ఎండబడిపోయింది.

అంతకుమునుపే కామేశ్వరి రెండుమూడు సార్లు పెద్దగానే సణిగింది. "పొద్దెక్కేవరకూ నిద్రలేవకపోతే ఇంట్లో దొర్లేది శనికాక, మహాలక్ష్మిని రమ్మంటే ఎలా వస్తుంది".

ఆమె అరుపులు, సణుగులూ తనకు అలవాటే కాబట్టి, అతడు వాటిని అంతగా పట్టించుకోలేదు.

లేచి పెరడులోనికి వెళ్లి వచ్చాడు. వంటగది వాకిట్లో నిలబడి "కాఫీ ఇవ్వవే" అన్నాడు భార్యవంక చూస్తూ.

కామేశ్వరి మొగుడివంక తీక్షణంగా చూసింది. "మీకు సేవలు చేయలేక నా ప్రాణాలు పోతున్నాయనుకో. అయినా అందరూ ఒక్కసారే వస్తే, ఆ ఇచ్చేదేదో ఒక్కసారే ఇద్దును కదా! అర్ధగంటకొకరు లేచి వస్తే, ఆ కాఫీని పదిసార్లు కాయలేక చస్తున్నాను".

గృహిణిగా తన సమస్యలు తనకూ ఉన్నాయి. ఆమె అన్నదానిలో వాస్తవం కూడా కొంత ఉంది. కాని... తన ఇబ్బంది తనది! అదంతా విప్పిచెప్పడంకన్నా, మౌనంగా ఉండిపోవడమే మేలని నిశ్శబ్దాన్ని ఆశ్రయించాడు సత్యనారాయణ.

రెండునిముషాల తర్వాత పొయ్యి మీదున్న ఉప్మాను కిందకు దించి, కాఫీ గిన్నె పైకెక్కించింది.

భార్య అందించిన కాఫీగ్లాసు తీసుకుని, హాల్లోనికి వచ్చి కూర్చున్నాడు అతడు.

కాఫీ పూర్తిచేసి గ్లాసు కిందపెడుతుండగా కొడుకు సునీల్ వచ్చి ఎదురుగా నిలబడ్డాడు.

సత్యనారాయణ తలెత్తి కొడుకు ముఖంలోనికి చూశాడు. అంత ఉదయాన్నే వాడలా నిలబడ్డాడంటే- ఎందుకో సులభంగానే గ్రహించేశాడు అతడు. రెండేళ్లుగా తనకది అనుభవమే!

గుండెలు బితుకుబితుకుమంటుంటే- "ఏమిరా సునీల్, ఏం కావాలి?" చిరునవ్వు పెదాలు మీదికి తెచ్చుకుని ప్రశ్నించాడు!

సునీల్ అరనిముషంపాటు మౌనంగా ఉండి, ఇక గత్యంతరంలేనట్టు గొంతు పెగల్చుకుని అడిగాడు- "నాన్నా! బి.యస్.ఆర్.బి ఎగ్జామ్స్‌కి అప్లయ్ చేయాలి. పోస్టల్ ఆర్డర్, జిరాక్స్, రిజిస్టర్ పోస్ట్ ఖర్చులకుగాను మొత్తం మీద ఓ నలభై రూపాయలు అవుతాయి".

ఫలానా దానికని తెలియకపోయినా- అలాంటి అవసరంకోసం తప్ప మరోకందుకు కొడుకు చెయ్యిచాచడని ఆ తండ్రికి తెలుసు.

సునీల్ ఉత్తముడు. అవతలి వ్యక్తి కష్టసుఖాలు గమనించగలడు. కేవలం పదమూడు వందల రూపాయల జీతం తప్ప మరేవిధమైన ఆదాయంలేని తన తండ్రిని అర్థంచేసుకోగలడు. తండ్రి రెక్కల కష్టానికి తనూ ఆదుకోవాలని మనసులో ఉంది. కాని ఏంచేయాలో తెలియట్లేదు. తెచ్చుకున్న డిగ్రీ తక్కువవను

లు చేయనివ్వట్లేదు. 'డిగ్నిటీ ఆఫ్ లేబర్' అని అనుకోగలిగిన మానసిక స్థాయికి తనింకా ఎదగలేదు. బహుశా 'వైట్ కాలర్ జాబ్' కోసం తిరిగి తిరిగి అలసిపోయి ఎప్పుడో రియలైజ్ అయి- "శ్రమకు కూడా ఒక విలువుంది, ఆ శ్రమలో గొప్ప, నీచస్థాయిలంటూ ఏవీ లేవు. మనమంతా శ్రామికులమే. మనమధ్య ఉన్న తేడా అల్లా అధికారాలు చెలాయించడంలోని వ్యత్యాసం మాత్రమే అనుకుని దొరికినపనిలో చేరిపోవడం జరుగుతుంది. ఇది సునీల్ ఒక్కడి కథకాదు. ఈ దేశంలోని నిరుద్యోగులందరి సమిష్టికథ అది...

సత్యనారాయణ నిట్టూర్చాడు. జేబులో చిల్లిగవ్వలేదన్నది గుర్తొచ్చి వ్యధపడ్డాడు.

"పరీక్షలకు అప్లయ్ చేసేందుకు లాస్ట్‌డేట్ ఎప్పుడ్రా?"

"మరో వారం రోజులు ఉంది నాన్నా" అప్పటికీ తండ్రి ఇబ్బంది అర్థమయింది.

"సరే... రేపో, ఎల్లుండో ఇస్తానులే"

"అలాగే నాన్నా" ఇక వత్తిడి చేయకుండా అవతలకి వెళ్లిపోయాడు సునీల్.

అతడు నీరసంగా పైకిలేచి, పెరట్లోకి వెళ్లి కాలకృత్యాలు తీర్చుకున్నాడు. తిరిగి ఇంట్లోకి వచ్చేసరికి, వంటగదిలోనుండి కామేశ్వరి కేక వినిపించింది. "టిఫిన్ రెడీ! రండి తినేద్దురుగాని"

వంటగదిలోనికి వెళ్లి పీట వాల్చుకుని కూర్చున్నాడు అతడు. ప్లేట్‌లో ఉప్మాపెట్టి అతడి ముందుంచింది ఆమె.

అతడు టిఫిన్ తింటుండగా వచ్చి ఎదురుగా కూర్చుని అడిగిందామె. "నీరజకు ఆ కోడూరుపాడు సంబంధమేదో చూస్తున్నామన్నారుగా... అదేమయింది"

నోట్లో పెట్టుకోబోతున్న ఉప్మా చేదుగా అనిపించింది సత్యనారాయణకు.

"వాళ్లు పాతికవేలవరకూ అడుగుతున్నారే" అన్నాడతను బాధగా.

కామేశ్వరి బుగ్గలు నొక్కుకుంది. ఇంటర్మీడియెట్ కూడా పూర్తిచేయలేదూ, ప్రైవేట్ కంపెనీలో ఆరొందలు జీతం తెచ్చుకునేవాడికి కూడా పాతికవేలు కట్నం కావాలటనా! హవ్వా!... ఈ పెళ్లికొడుకులను అంతేసి రేట్లు పెట్టి కొనుక్కునేకన్నా సంతలో పదిగేదెలు కొనుక్కున్నా చాలా ఉపయోగపడతాయి. రోజూ పాతికరూపాయలు ఆదాయం వస్తుంది" అందామె.

"గేదెలు కొనుక్కుంటే ఆదాయం వస్తుంది కాని ఇంట్లో అమ్మాయి అత్తారింటికి వెళ్లడం ఎలా?" నవ్వుతూనే అడిగాడు.

"మొగుడిని కొనుక్కొని అతడి మోచేతి కింద నీళ్లు తాగేకన్నా ఆ డబ్బుతో గేదెలు కొనుక్కొని ఆ ఆదాయంతో స్వేచ్ఛగా- హాయిగా బతకొచ్చు"

"సరేలే... ఈనాటి ఆడపిల్లలకు మంచి సలహానే చెప్పావు. నీ సలహా పాటిస్తే ఈ దేశం గొడ్డుపోతుంది" అని పెళ్లాన్ని ముద్దుగా విసుక్కున్నాడు.

అంతలోనే మరేదో గుర్తొచ్చింది.

"అదిసరే! రేపు నీ కొడుక్కి ఉద్యోగం వస్తే, నువ్వూ యాభై వేలో- అరవైవేలో కావాలని ఆడపిల్లల తల్లితండ్రులను ఏడిపించవూ?" అడిగాడు.

కామేశ్వరి చిరునవ్వులు చిందిస్తూ జవాబు చెప్పింది- "ఆఁ! అది ఎప్పటికో జరగబోయే సంగతికదా! దాని గురించి ఇప్పుడెందుకు అనుకోవడం"

సూటిగా చెప్పవలసిన సమాధానం దాటవేయడం గమనించాడతడు.

"ఔరా! ఈ ఆడవారిలో ఎంతటి ద్వంద్వనీతి ఉంటుంది?!" అని ఆశ్చర్యపోయాడు.

కూతురికి మొగుడిని కొనుక్కోవలసి వచ్చినప్పుడు పెళ్లికొడుకులను సంతలో గేదెలతో పోల్చిన ఆ తల్లి, తన కొడుకు పెళ్లి చేసేప్పుడు తన బిడ్డ మరో అమ్మాయి పాలిటి సంతలో పశువు కాకూడదని కోరుకోకపోవటం ఎంత విచిత్రం?!... అసలు ఈ దేశంలోని ఆడవారంతా ఇంతే. కూతురికి- కోడలికి మధ్య ఎంతో వ్యత్యాసం చూపిస్తారు. తన కూతురు తనకెంతో- తన ఇంటికి వచ్చే కోడలు ఆమె తల్లికి అంతేనని ఎందుకనుకోరు? ఒక ఆడపిల్ల తల్లిగా తనుపడే కష్టాలే- మరొక ఆడపిల్ల తల్లీ పడుతుందని తెలిసీ- ఏమాత్రం అర్థంచేసుకోరు ఎందుకని? సాటి స్త్రీకి తమవంతు



సహాయం చూపించకపోతే పోయింది. కనీసం జాలయినా కనపరచరేం?

"ఇదిగోండి కాఫీ" కామేశ్వరి పిలుపుతో ఆలోచనలు తెగిపోయాయి.

కాఫీగ్లాసు అందుకున్నాడతను.

కామేశ్వరి తిరిగి అడిగింది- "కోడూరుపాడు సంబంధం కాకపోతే, మీ చెల్లెలు కొడుకున్నాడు కదా! బాంక్ ఉద్యోగి కూడానాయె. ఒకసారి మీ చెల్లెల్ని అడిగి చూడకూడదూ?"

అతడు దీర్ఘంగా నిట్టూర్చాడు. "వాళ్లిప్పుడు చాలా హైక్లాస్‌లో ఉన్నారుకదే! మనబోటి వారికి అందుతారా?"

"ఎంతయినా మీ చెల్లెలే కదా!"

"డబ్బుంటేనే ఏ బంధమయినా- అనుబంధమయినా, ఆ ఇంధనం లేకపోతే మేము చుట్టాలమని చెప్పుకోవడం తప్ప- సంబంధాలు కలుపుకునేందుకు దగ్గరితనం ఎట్టిపరిస్థితుల్లోనూ ఏర్పడదు"

"పోనీ ఒకసారి వెళ్లి అడిగిచూడరాదూ?"

ఆమెమాట కాదనడం ఇష్టంలేకపోయింది. "అలాగేలేవే! రేపు ఆదివారం మనిద్దరం కలసి ఆ ఊరెళ్లివద్దాం"

కామేశ్వరి ముఖంలో కాస్తవెలుగు కనిపించింది. రాజేశ్వరి ఒప్పుకుంటుందన్న ఆశకాకపోయినా, ప్రయత్నలోపం లేకుండా భర్త అంగీకరించాడన్న ఆనందచిహ్నాం అది.

కాఫీ పూర్తయిన తర్వాత సత్యనారాయణ లేచి బట్టలు మార్చుకుని ఆఫీసుకు బయలుదేరాడు. అతను తాలూకా ఆఫీసులో ఓ మామూలు గుమస్తా. జీతం తప్ప పైఆదాయం ఉన్నసీటు కాదు అతనిది. అలా అని అతడిది గుంజే మనస్తత్వమూ కాదు. ఒకవేళ పైసంపాదన వచ్చే అవకాశం ఉన్నా దానిని మనస్ఫూర్తిగా తిరస్కరించే స్వభావం అతనిది.

ఆఫీసులో మంచివాడిగా, సిన్సియర్ ఎంప్లాయిగా సత్యనారాయణకు పేరుంది. అయితే కేవలం సిన్సియారిటీ- మంచితనమే సాటివారిని ఆకట్టుకునేలా చేస్తాయనుకోవడం పొరపాటు. తనపనేదో తను చూసుకుని తనదారిన తను వెళ్లేవాడిని ఎవరూ గుర్తించరు. మనుష్యుల్ని ఆకట్టుకోవాలంటే మాటకారితనం కావాలి. కాస్త హుందాగా, హుషారుగా కనిపించాలి. అలా కనిపించాలంటే డబ్బు కావాలి. డబ్బు కావాలంటే సంపాదించే మార్గాలు ఎన్నో ఉన్నాయి. అయితే అవన్నీ సక్రమమార్గాలే కావు. అక్రమమార్గాలే ఎక్కువ. వాస్తవంలో సక్రమమార్గం కన్నా అక్రమమార్గంలో సంపాదించడమే అన్నివిధాలా సులభం.

అలా అని అక్రమమార్గంలో సంపాదించాం కదా! జనం దృష్టిలో చులకన అవుతామనుకుంటే అదీ పొరపాటే! జనం మనిషి వెనుక ఉన్న డబ్బెంత అన్నది చూస్తారేగాని, ఆ డబ్బు ఏమార్గాన వచ్చింది అని మాత్రం అడగరు. అసలు జనాలే అడుగుతున్నారిప్పుడు-

"అవునూ! మీ అబ్బాయికి జీతం డబ్బు లేనా లేక పైసంపాదన ఏమయినా ఉంటుందా?" అని.

ఇక్కడ పైసంపాదన అంటే అక్రమ సంపాదన అనే అర్థం.

అంటే జనం ముసుగులో చాటుమాటు వ్యవహారాలు ఎందుకని డైరెక్ట్‌గా అడిగేయడం మొదలుపెట్టారన్నమాట. అంతేకాదు ప్రస్తుతం అసలు సంపాదనకన్నా- ఆ 'పైసంపాదనకే' ప్రాధాన్యత పెరిగింది. ఉన్నవాడు లక్షల కట్నంపోసి ఇంజనీరు అల్లుడిని ఎందుకు కొనుక్కుంటున్నాడంటే- ఇంజనీరు అల్లుడికయితే పైసంపాదన బాగా ఉంటుందని, ఇంజనీరు జీతం ఓ మామూలు ఆఫీసు సూపరింటెండెంట్ కంటే వందో- రెండొందలో ఎక్కువుంటుంది. కాని పర్సంటేజ్‌ల రూపంలో వచ్చే మొత్తాలు మాత్రం చాలా ఎక్కువ. అందుకే అలాంటి అల్లుడు కావాలని చాలామంది కోరుకుంటుంటారు.

డబ్బు అనే పదార్థంకోసం ఈ జనం ఏ స్థాయికి దిగజారారో తెలుసుకుంటే...

ఓ మైగాడ్! ఈ వ్యవస్థ రేపు ఎక్కడికి చేరుకుంటుందో...?

అక్కడక్కడా సత్యనారాయణమూర్తిలాంటి వారు కొంతమంది ఉన్నారు. అలాంటివారు ఆ కొద్ది సంఖ్యలోనయినా ఉండబట్టే ఈ సమాజం ఆమాత్రం ఉంది. లేకుంటే నీతినియమాలు




మచ్చుకి కానరాక- ఏనాడో మరింతగా పతన మయి ఉండేది.

★ ★ ★

ఆదివారం పొద్దున్నే బస్టాండ్‌కు చేరుకున్నారు భార్యాభర్తలిద్దరూ.

సత్యనారాయణ చెల్లెలు రాజేశ్వరిది దంపూరు గ్రామం. టౌన్‌కి ఇరవై కిలోమీటర్ల దూరంలో ఉందా గ్రామం.

పూలు, పళ్లు కొనుక్కుని బస్సెక్కారు వాళ్లు.

టిక్కెట్లు కొట్టడం కోసమని మార్గమధ్యంలో కండక్టర్ గంటసేపు బస్ ఆపుచేశాడు. డ్రైవరేమో గుంటలలో తప్ప బస్సు నడపనని శపథం చేసినట్టుగా బస్సు ఎగిరెగిరిపడేలా నడపసాగాడు.

అలా ఆ పల్లెకు చేరుకునేసరికి సగం ప్రాణం పోయింది వాళ్లకి.

రాజేశ్వరి అన్నావదినలను సాదరంగా ఆహ్వానించింది. ఆప్యాయంగా పలుకరించింది.

రాజేశ్వరిదీ మధ్యతరగతి సంసారమే. నాలుగెకరాల పొలం, చిన్నదయినా గట్టి ఇల్లు, గొడ్డూ గోదా... ఆస్తిపాస్తులు సాధారణమే అయినా కొడుక్కి బాంక్‌లో ఉద్యోగం రావడంతో వారి స్టేటస్ పెరిగిపోయినట్టయింది.

నీరజను ఆ ఇంటికోడలుగా చేయాలని గతంలో వీరు అనుకోలేదు. చేసుకోవాలని వాళ్లూ కోరుకోలేదు. అసలు ఆ రెండు కుటుంబాల మధ్య ఆ ప్రస్తావనే ఎన్నడూ రాలేదు. కాని ఇప్పుడు- తన కూతురికి సరయిన సంబంధం చేయలేని పరిస్థితిలో భార్యా ప్రేరేపితుడై చెల్లెలి దగ్గరకు వచ్చాడు సత్యనారాయణ.

ఆ ఇంట్లో రాజేశ్వరిదే పూర్తి పెత్తనం. మొగుడున్నా నామమాత్రమే. మొగుణ్ణి ఏనాడో కీలుబొమ్మగా చేసి ఆడించడం మొదలుపెట్టిందామె. కాబట్టే ముఖ్యమైన నిర్ణయాలన్నీ రాజేశ్వరే చేస్తుంటుంది. ఆమె మాటను కాదనే ధైర్యం ఆ ఇంట్లో ఎవ్వరికీ లేదు. ఆ విషయం సత్యనారాయణకు బాగా తెలును. ఈ స్థితిలో- కన్నకూతురికి పెళ్లిచేయలేక అల్లాడే దిక్కుతోచని స్థితిలో తనకు తగిన సహాయం చేయగలిగిన ఏకైక వ్యక్తి ఆ చెల్లెలే అని అతడు భావించాడు.

అందుకనే చెడిపోయిన స్థితిలో స్నేహితుని ఇంటికి వెళ్లొచ్చుగానీ, చెల్లెలి ఇంటికి వెళ్లకూడదు- అన్న నిజం తనకు తెలిసినా తప్పనిసరి పరిస్థితిలోనే ఆ ఇంటికి వచ్చాడు.

ఆ మధ్యాహ్నం భోజనాలయ్యాక, కాసేపు విశ్రాంతి తీసుకున్న తర్వాత రాజేశ్వరి ఆమె భర్త గంగాధరంను దగ్గరకు పిలిచి తాను వచ్చిన పని వివరించాడు సత్యనారాయణ.

"రాజీ! ప్రస్తుతం నేను నా కూతురికి ఘనమైన కట్నకానుకలిచ్చి పెళ్లి చేసే స్థితిలోలేను. అలా చేయగలిగివుంటే నేనిలా వచ్చి మిమ్మల్ని అడగవలసిన అవసరమే వచ్చి ఉండేది కాదనుకుంటా...... ఏమయితేనేం- నేను మీవద్దకు వచ్చి అడుగుతున్నాను, నా కూతుర్ని మీ ఇంటికోడలుగా చేసుకోగలరా?"

ఆ గదిలోని నలుగురిమధ్యా కొద్దిసేపు గాఢమైన నిశ్శబ్దం అలముకుంది. ముందుగా తేరుకున్నది రాజేశ్వరి. ఆమె బుర్ర పాదరసంకన్నా చురుకైనది. ఇటువంటి సమయాలలో చాలా వేగంగా ఆలోచించి అవతలివారి మనసుకు దెబ్బ తగలకుండా మెత్తని మాటలతోనే అవతలివారి ప్రయత్నాన్ని అడ్డుకోగలదు.

ఆమెకు అన్నగారంటే అభిమానం ఉంది. అయితే ఆ అభిమానం మన వరకే పరిమితం. అభిమానాన్ని డబ్బుతో ముడిపెట్టకూడదని ఆమె సిద్ధాంతం. ఆమెకు తెలుసు- తన కొడుక్కి ఇప్పుడు పరాయి సంబంధం చేసుకుంటే కనీసం ముప్ఫయ్, నలభై వేల కట్నం, దానికి తగిన లాంఛనాలు వస్తాయి. అదే తన అన్నకూతుర్ని చేసుకుంటే పదివేలకన్నా ఎక్కువ పెట్టలేడు. అన్నగారి మీద ఎంత అభిమానం ఉన్నా- చూస్తూచూస్తూ ముప్ఫయ్ వేలు వదులుకోవడం ఆమెకిష్టంలేదు. అందుకే మెల్లగా అన్నదామె-

"మీరన్నది బాగానే ఉందన్నయ్యా! కాని... వారు ఈ కాలంపిల్లలు. మనం ఫలానా అమ్మాయిని చేసుకో అంటే వాళ్లు వింటారా? వారి మనసుకు నచ్చితేనే కదా!.... అయినా బంధుత్వాలు, ఆప్యాయతలు మనకు అర్థమవుతాయిగాని, వారికి తెలుస్తాయా అని...."

ఆ మాటలతోనే అర్థమయిపోయింది చెల్లెలికి తమ సంబంధం ఏమాత్రం ఇష్టం లేదని. కాకపోతే తను 'ఊఁ' అంటే ఆ కొడుకు మాత్రం కాదంటాడా?.... అయినా ప్రయత్నలోపం ఏమాత్రం ఉండకూడదని మరోమాట అన్నాడు.

"అది నిజమేననుకో! వాళ్లు ఈ కాలంకుర్రాళ్లేగాని, మనవంతు మనం కాస్త బలవంతపెట్టకపోతే ఎలా?.... నువ్వు వాడిని కాస్త అడిగి చూస్తే...."

"అలాగే! నేనేమో అడుగుతాను. కాని వాడు ఒప్పుకుంటాడో లేదోనని..." నసుగుతూ అంది రాజేశ్వరి.

అతడికి కోపం వచ్చింది. చెల్లెలు మరీ కొండమీద కూర్చుని మాట్లాడుతున్నట్టనిపించింది. చివరికి చెల్లెలి ముందు లోకువ కావలసి వచ్చిన తన దారిద్ర్యానికి తననుతాను తిట్టుకున్నాడతను.

"అయినా అడిగి చూడు రాజీ"

"అలాగేలే అన్నయ్యా! వాడి అభిప్రాయం అడుగుతాను. వాడు సరేనంటే అలా మీకు జాబు వ్రాస్తాను...."

అవన్నీ ఒదార్పు మాటలని అతడికి తెలుసు. చెల్లెలు ఆడే నాటకం అర్థమవుతూనే ఉంది. 'నీ కూతుర్ని నేను కోడలిగా చేసుకోలేను' అని సూటిగా చెప్పలేకనే ఈ డొంక తిరుగుడు మాటలన్నీ అని తెలుస్తూనే ఉంది. అయితే- అన్నీ తెలిసినా అంతకన్నా తనేం చేయలేడు. ఆమెను బలవంతపెట్టినా ప్రత్యేక ప్రయోజనమంటూ ఏమీ ఉండదు.

ఆ సాయంత్రం రాజేశ్వరి దంపతులు బలవంతం చేస్తున్నా ఉండకుండా, 'ఆఫీసు ఉందంటూ' బయలుదేరారు ఆ భార్యాభర్తలిద్దరూ.

గంగాధరం బస్సు ఎక్కించి వీడ్కోలు చెప్పాడు.

మిణుకుమిణుకుమనే ఆశతో బయలుదేరిన వాళ్లు నిరుత్సాహంగా వెనుదిరిగారు.

గంటన్నర ప్రయాణం తర్వాత ఊసురోమంటూ వచ్చి ఇంట్లో పడ్డారు వాళ్లు.

ఆ రాత్రి చాలా పొద్దుపోయేవరకూ నిద్రపట్టలేదు సత్యనారాయణకు. కూతురి పెళ్లి సమస్య భూతమై ఎదుట నిలిచి భయపెట్టసాగింది.

బహుశా వయసులో ఉన్నంతకాలం రాబోయేకాలంలో ఎదురవబోయే సమస్యలు గుర్తుకు రావు. కాబట్టే ఆ వయసులో ఒకింత నిశ్చింతగా, అజాగ్రత్తగా కాలం గడిపేస్తారు. తీరా అసలైన జీవిత సమస్యలు ఎదురయినపుడు అప్పుడు కళ్లు తెరచి దిక్కులు చూసి గుండెలు బాదుకోవడం మొదలుపెడతారు.... కొందరు మొదటినుండీ జాగ్రత్తపడినా, సక్రమం తప్ప అక్రమమార్గం తెలియకపోవడంతో గొర్రెకు బెత్తెడు తోకే అన్నట్టు వారి స్థితి, పరిస్థితి ఆ చోట ఉంటుంది.

సత్యనారాయణ ఆ రెండోకోవకు చెందుతాడు.

ఏమయితేనేం అతడు ప్రస్తుతం తనకు ఎదురయిన సమస్యకు పరిష్కారం ఏమిటో తోచక అల్లాడుతున్నాడు.



సత్యనారాయణకున్న ఒకే ఒక దగ్గరి స్నేహితుడు పరాత్పరరావు.

హైస్కూల్లో కలసి చదువుకున్నారు. కాలేజీ చదువు కలిసే పూర్తిచేశారు. చదువు పూర్తయ్యాక పరాత్పరరావు ఇంట్లో డబ్బు కొంత, బ్యాంక్ లోనులు కొంత కలిపి వ్యాపారం ప్రారంభించాడు. సత్యనారాయణేమో వచ్చిన గవర్నమెంట్ ఉద్యోగంలో చేరిపోయాడు.

పరాత్పరరావుకు వ్యాపారం బాగా కలిసొచ్చింది. బాగానే సంపాదించేశాడు. జీవితంలో





నిలదొక్కుకున్నాడు. ప్రస్తుతం ఒక కొడుకు వ్యాపార విషయాలు చూసుకుంటుంటే, మరో కొడుకు డాక్టరయ్యాడు. కూతురిని పెద్ద ఆఫీసర్‌కిచ్చి పెళ్లిచేశాడు. జీవితంలో అన్నివిధాలా సంతృప్తి లభించింది ఆయనకు.

సత్యనారాయణపట్ల సిన్సియర్‌గా బాధను వ్యక్తంచేసేది ఆ మిత్రుడొక్కడే. ఆ విషయం అతడికీ తెలుసు. అందుకే మరీ బాధ కలిగినప్పుడో, సంతోషం కలిగినప్పుడో అతడు ఆ ఇంటికెళ్లి మిత్రునితో కొద్దిసేపు తన సుఖ దుఃఖాలు పంచుకుని వస్తుంటాడు.

అతడు ఆ ఇంటిని సమీపించాడు.

విశాలమైన ఆవరణలో న్యూమోడల్‌లో కట్టబడిన బిల్డింగ్ అది. ఇంటిముందున్న పూల మొక్కలు- చిన్న లాన్- అందులో తిరిగే బొచ్చుకుక్క- ఎంతో ఆకర్షణీయంగా ఉంటుందా ఇల్లు.

అతడు ఆ ఇంటిని సమీపించేసరికి పరాత్పరరావు లాన్‌లో కుర్చీలో కూర్చుని పత్రికలు తిరగేస్తున్నాడు.

సత్యనారాయణ గేటు తీసాడు. ఆ చప్పుడుకు తిరిగి చూసిన ఆయన మిత్రుడుని చూసి పలకరింపుగా నవ్వాడు. అతడు వెళ్ళి ఆయన ఎదురుగా కూర్చున్నాడు.

"ఏమిటోయ్! ఈమధ్య కనుపించడమేలేదు" అడిగాడు పరాత్పరరావు.

అతడు బలవంతంగా నవ్వాడు. "ఏమిటో ఈ మధ్య పనులెక్కువయి..." అంటూ కుర్చీలో వెనక్కువాలాడు.

"అంత తీరికలేని పనులేమిటో?"

అందుకు సమాధానం అని కాకపోయినా, సంభాషణ మొదలయింది కనుక చెప్పాడు అతడు. "మొన్న మా చెల్లెలు రాజేశ్వరి ఇంటికి వెళ్ళానోయ్"

"ఏమిటి విశేషం?"

ఒక్కక్షణం మౌనంగా ఉండి, "నీరజను వాళ్ళబ్బాయికి చేసుకోమని అడిగేందుకు వెళ్లాను" అన్నాడు సత్యనారాయణ.

"ఏమన్నారు?" ఆసక్తిగా ముందుకు వాలాడు పరాత్పరరావు.

ఓ శుష్కమందహాసం అనంతరం సత్యనారాయణ చెప్పాడు- "వాళ్ళు ఇప్పుడు మనకన్నా ఒక మెట్టు పైస్థాయిలో ఉన్నారు. కాబట్టి వారిపుడు తమ స్థాయికి తగిన సంబంధం చూసుకుంటారేగాని మనలను దగ్గరకు ఎందుకు చేరనిస్తారు?"

"అలా అన్నారా వాళ్లు?"

"అంత సూటిగా అనకపోయినా డొంక తిరుగుడుగా వాళ్లు చెప్పిన దానికి అర్థం అదే" అంటూ చెల్లెలికీ, తనకూ మధ్య జరిగిన సంభాషణ పూర్తిగా వినిపించాడు సత్యనారాయణ.

పూర్తిగా విన్న పరాత్పరరావు అసహ్యంగా ముఖంపెట్టాడు. "ఛీఛీ... ఏంమనుష్యులో వీరు?! ఈ మనుష్యుల మధ్య డబ్బు సంబంధాలు తప్ప అభిమానాలు, ఆప్యాయతలు అసలు కనుపించడం మానేసాయి. నాకు తెలుసు-నువ్వు నీ చెల్లెలిని ఎంతగా ప్రేమించేవాడివో. అటువంటి నీ చెల్లెలు ఈ కష్టకాలంలో నీ గుండెల మీద బరువు కొద్దిగానయినా తగ్గించకూడదా?"

"ఈ లోకంలో అభిమానాలు-ఆప్యాయతలూ ఏనాడో అంతరించిపోయాయి. నేడు మనుష్యుల మధ్య ఉన్నది కేవలం వ్యాపార బంధాలే. డబ్బుతో ముడివడిన సంబంధాలే"

తలూపాడు పరాత్పరరావు.

ఇంతలో పనిమనిషి అటువస్తే, రెండుకాఫీలు కలుపుకు రమ్మని చెప్పి పంపాడు.

ఐదు నిమిషాలలో కాఫీ తీసుకొచ్చి వారి ముందుంచిందామె. "తీసుకోరా" తనో కప్పు తీసుకుని, మరో కప్పు మిత్రుడి వైపు పెడుతూ అన్నాడు పరాత్పరరావు.

సత్యనారాయణ కాఫీ కప్పు చేతిలోనికి తీసుకుని సిప్ చేయసాగాడు.

కాఫీ తాగుతుండగా పరాత్పరరావు అన్నాడు- "ఒక్కోసారి మనిషిలో అంతర్గతంగా మరొకరి మీద ప్రేమాభిమానాలు ఉండి ఏదయినా సహాయం చేయదలచుకున్నా- ఈ కులాలు, మతాలు, సమాజం అతడిని ముందడుగు వేయనివ్వకపోవచ్చుకదూ సత్యం" ఆ మాటలు అంటున్నప్పుడు ఆయన చూపులు ఎక్కడో శూన్యంలో-ఏదో వెతుకుతున్నట్టుగా అని

పించాయి.

ఔనన్నట్టుగా తలూపాడు సత్యనారాయణ. మిత్రుడు ఏ ఉద్దేశంతో ఆమాట అన్నాడో తనకు అర్థమయింది. కొద్దికాలం క్రితం నీరజను తన ఇంటికోడలుగా చేసుకోవాలని పరాత్పరరావు ఉత్సాహపడ్డాడు. అందుకు కారణం, తమిద్దరి మిత్రత్వం ఈ పెళ్ళి ద్వారా గట్టిపరచుకోవాలని ఒక కోరికయితే-తద్వారా తన మిత్రుని గుండెల మీది కుంపటి కిందకు దించాలన్న సదుద్దేశం కూడా మరో ఆలోచన. అయితే ఇందుకు ఆయన ఇంట్లోనివారే కాదు-శ్రేయోభిలాషులు కూడా అంగీకరించలేదు. కాలం ఎంత ముందుకు వెళ్ళినా, ఇంకా కులాల ప్రాధాన్యత తగ్గలేదనీ, వర్ణసంకరం జరిగితే లేనిపోని ఇబ్బందులు ఎదురవుతాయని వారంతా ఆయనకు భయం కలిగించారు. ఇంట్లోవారు గట్టి వ్యతిరేకతే చూపారు. ఇక తప్పనిసరి పరిస్థితుల్లో తన ప్రపోజల్ వెనక్కు తీసుకున్నాడు పరాత్పరరావు.

జరిగిన విషయాలు లీలగా అతడికి తెలిశాయి. మిత్రుడు తన మీద చూపించిన అభిమానానికి ఆనందపడ్డాడు. ఆ అభిమానం వలన తనకు ప్రయోజనం కలగకపోయినా ఆ అభిమానం కలకాలం అలా నిలిస్తే చాలని మాత్రం అనుకున్నాడు.

పరాత్పరరావు మిత్రుడికి సహాయం చేసేందుకు ఆ ఒక్క ప్రయత్నంతోనే ఆగిపోలేదు. డబ్బిచ్చి ఆదుకోవాలని ఆలోచించి-రెండుమూడుసార్లు డబ్బు ఇవ్వబోయాడు. సత్యనారాయణ అందుకోలేదు. కనీసం అప్పుగానయినా తీసుకోమని బ్రతిమిలాడాడు. పరాత్పరరావు మిత్రుడి దగ్గర అప్పు తీసుకుంటే, అది తిరిగి కట్టలేని పరిస్థితిలో స్నేహం దెబ్బతింటుందన్న ఆలోచనతో ఆయన ప్రయత్నాన్ని మృదువుగా తిరస్కరించాడు సత్యనారాయణ.

ఈ సృష్టిలో కనీసం స్నేహమన్నదయినా డబ్బు బంధానికి అతీతంగా ఉన్నందుకు అతడు సంతోషించాడు.

మరికొద్దిసేపు కష్టసుఖాలు చెప్పుకున్న తర్వాత సత్యనారాయణ అన్నాడు "అనూయ పడుతున్నాననుకోక పోతే నిన్ను చూస్తుంటే నాకు చాలా ఆనందంగా ఉంటుందోయ్. పుష్కలంగా డబ్బు, రత్నాల్లాంటి బిడ్డలు, ఆరోగ్యవంతమైన శరీరం..... జీవితంలో సాధించాల్సినవన్నీ సాధించేసావు. తీర్చుకోవలసిన బాధ్యతలన్నీ తీర్చేసుకున్నావు. ఇక నీ వరకూ నిశ్చింతంగా ఉండొచ్చు..... నిజంకదూ"

పరాత్పరరావు గుంభనంగా నవ్వాడు "సాధించాల్సినవన్నీ సాధించేసినా బాధ్యతలన్నీ తీర్చేసుకున్నా అంతమాత్రం చేతే మనిషికి నిశ్చింత మనశ్శాంతి వస్తాయనుకోవటం చాలా పొరపాటు. నాకు డబ్బు ఉండొచ్చు. కాని డబ్బు ఒక్కటే మనిషికి నిశ్చింత, మనశ్శాంతి ఇవ్వవు. డబ్బు వలన కష్టాలు దరికి చేరకపోవచ్చు. చాలా సమస్యలు డబ్బుతో పరిష్కరించవచ్చు కాని డబ్బు ఉన్నంతమాత్రానే మానసికశాంతి వస్తుందంటే మాత్రం నేను ఒప్పుకోను".

సత్యనారాయణ వింతగా పరాత్పరరావు వంక చూసాడు. మిత్రుడి నోట అలాంటి మాటలు వినడం ఈరోజే మొదలు. డబ్బు గురించి చెప్పేప్పుడు ఎప్పుడూ డబ్బు ఉంటే అన్నీ సాధించేయవచ్చు అనేవాడు- ఈరోజు ఒకింత వైరాగ్యంగా అంటున్నాడంటే.... ఏదో జరిగి ఉంటుందనిపించింది.

"ఏమిత్రా! ఏమయింది?" ఆరాగా అడిగాడు సత్యనారాయణ.

ఆయన అర్థవంతంగా నవ్వి "ఇప్పుడు కాదులే మరోసారి తీరిగ్గా చర్చించుకుందాం" అన్నాడు.

అతడు మరేదో అడగబోయేంతలో ఇంటిలోపల నుండి పెద్దకోడలు బయటకు వచ్చి ఆయన ఎదురుగా నిలిచి మామయ్యా! నేను మహిళామండలికి వెళుతున్నాను అంది.

తలూపారాయన. ఆమె వెళ్ళిపోయింది.

ఏదో లీలగా అర్థమయింది అతడికి బిడ్డలు రత్నాలే కావచ్చు కానీ వచ్చిన కోడళ్ళు గులకరాళ్ళయి ఎందుకుండకూడదూ?.... ఇక రెట్టించలేదు. కాసేపు కూర్చుని లేచి వెనుతిరిగాడు సత్యనారాయణ.

★ ★ ★

అప్పుడెప్పుడో ఓ ప్రైవేట్ సేవింగ్స్ కంపె





నీలో ఓ ఎనిమిది వందల రూపాయల వరకూ డిపాజిట్ చేసి ఉన్నాడు సత్యనారాయణ. మెచ్యూరిటీ పీరియడ్ అయిపోవటంతో ఇంట్రెస్ట్, బోనస్ అదీ, ఇదీ కలుపుకుని రెండువేల రూపాయలకు చెక్కు రావడం, దానికి క్లియరెన్స్‌కి వేయడం జరిగింది.

ఆ డబ్బు వస్తుందని తెలియగానే భార్య రాత్రి భోజనం వడ్డిస్తూ గారాంగా అడిగింది "ఆ చెక్కు క్లియరైతే నాకో రెండొందలు ఇవ్వరూ?"

"ఎందుకు?" అడిగాడు సత్యనారాయణ.

"మంచి చీరలన్నీ చిరిగిపోయాయి. ఏవైనా కార్యాలకు వెళ్ళేందుకు మంచి చీరంటూ ఒక్కటీ లేదు అందుకే వెంకటగిరి జరీ చీర ఒకటి కొనుక్కుందామనీ".

గుటకలు మింగాడు సత్యనారాయణ. ఆమెకు చాలా చీరలున్నాయని అతడికి తెలుసు. ఆమె దుబారాలతో చీరల కొనుగోలు ఒక భాగమనీ తెలుసు కానీ కాదనలేని అశక్తత.

ఆ రెండువేలతో తనకు చాలా అవసరం ఉంది. "ఇదిగో ఇస్తానంటూ' కొంతమంది దగ్గర చేబదులు తీసుకుని ఉన్నాడు తను. ఆ మొత్తాలు రెండువేల వరకూ ఉంటాయి. ఆ చిన్న చిన్న బాకీలన్నీ తీర్చేస్తే తనకో నిశ్చింత. ఇక పెద్ద మొత్తాలుగా ఉన్న ఒకటీ రెండు...

తన బాకీల గోల ఎలాగున్నా భార్యామణికి అడిగిన డబ్బు అందివ్వకపోతే ఆమె అలుక వ్రతం పాటిస్తుంది. ఇంట్లో రెండుమూడురోజులు మౌనపోరాటం సాగుతుంది. అయిష్టంగానే అయినా "అలాగే లేవే" అన్నాడతడు.

పదిరోజుల తర్వాత చెక్కు క్లియరయి వచ్చింది.

మధ్యాహ్నం వేళ ఆఫీసునుండి అటుగా బేంక్‌కి వెళ్ళి డబ్బు తీసుకుని తిరిగి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం ఇంటికొచ్చి కాఫీ తాగుతుండగా ఒక ధోవతీ మనిషి వీధిగేటు దగ్గర నిలబడి పెద్దగా అల్లరి చేయడం మొదలుపెట్టాడు.

ఆ వ్యక్తిని చూడగానే సత్యనారాయణ ముఖం పాలిపోయింది. గుండెదడ హెచ్చింది.... పెద్ద మొత్తం అప్పువాళ్ళలో ఆ వ్యక్తి ఒకడు.

అప్పుడెప్పుడో ఓ ఆరునెలల క్రితం- నెలాఖరు దినాలలో నీరజను చూసేందుకు మగపెళ్ళివారు వస్తున్నారని పెళ్ళిళ్ళ పేరయ్య చెప్పటంతో కనీసం కూతురికి సరయిన బట్టలు కూడా లేని పరిస్థితిలో వడ్డీ జలగలాంటి ఆ వ్యక్తి వద్ద ఐదొందలు అప్పు చేసాడు తను. నూటికి నెలకు ఒక్కంటికి పదిహేను రూపాయలు వడ్డీ. నెలనెలా వడ్డీ వెళ్ళి అసలుతో కలుస్తుంది. అలా అసలు వడ్డీ కలిపి ప్రస్తుతం వెయ్యి రూపాయలు అయి ఉంది.

"ఏమిటయ్యా ఇది? ఎన్ని నెలలయిందీ. ఇదిగో నెలాఖరుకు ఇస్తానని చెప్పి తీసుకుని ఆరునెలలయింది. పోనీలే ఇస్తాడు ఇస్తాడు కదాని ఊరుకునేకొద్దీ మరీ రోజులు గడిపేస్తున్నావు....... ఆఫీసు కొస్తేనేమో 'ఇదిగో ఈరోజిస్తా- రేపిస్తా' అంటావు.... అసలు ఇవ్వాలనుకుంటున్నావా- లేదా?..... ఎగెయ్యాలనుకుంటే అదీ తేల్చి చెప్పెయ్యి... నీ దగ్గర ఎలా వసూలు చేయాలో నాకూ బాగా తెలును.... చెప్పవయ్యా.... ఏంటో చెప్పు...."

సత్యనారాయణ బిక్క చచ్చిపోయాడు. ఇంట్లో పెళ్ళాంబిడ్డలు తనవైపే గుచ్చిగుచ్చి చూస్తున్నారు. వీధిలో కొందరు కిటికీలలోనుండే తన వైపే జాలిగా చూస్తున్నారు. భూమి రెండుగా చీలి తను అందులోనికి కూరుకుపోతే బాగుండునని అనిపించింది అతడికి. సంస్కారవంతుడికి జనం జాలి, ఎగతాళి చూపులకన్నా మించిన శిక్షలేదు. ఛీఛీ! ఏం జన్మ తనది! చివరికి అడ్డమైన వెధవలచేత కూడా అడ్డమైన మాటలూ అనిపించుకునే స్థితికి దిగజారాడు.... ఇంతకన్నా హాయిగా చచ్చినా బాగుణ్ణు......'.

ఆ సమయంలో అతడి జేబులోకి డబ్బు గుర్తుకువచ్చింది. దానితో పాటే చిన్న మొత్తాలుగా కట్టాల్సిన పదిమంది అప్పులోళ్ళు మదిలో మెదిలారు. వారందరిదీ ఎట్లున్నా మొదట ముందున్న ఈ గండం గడవాలి.... అతడింక ఆలోచించలేదు. ఆ వంక చూస్తే వడ్డీ జలగ ఇంకా అరుస్తూనే ఉంది. వాడు అంటున్న మాటలకు నరాలు తెగిపోతు

న్నాయి. ఒకవేళ బాకీ ఎంత ఉంటే మాత్రం ఎదుటివాడిని ఇంత హీనంగా మాట్లాడుతారా? అవతలివాడు బాకీ తీర్చే వ్యక్తా- తీర్చని వ్యక్తా అని కూడా ఆలోచించేది లేదా? మంచితనం- మానవత్వం గమనించరా? అన్నింటికన్నా డబ్బే ముఖ్యమా?!

సత్యనారాయణ చప్పట్లు తట్టి వడ్డీజలగను పిలిచాడు.

వాడు వచ్చి అతడిముందు హుందాగా నిలబడ్డాడు. అప్పిచ్చినవాడికి, పుచ్చుకున్నవాడు ఎప్పుడూ లోకువే.

"నీకు మొత్తం ఎంతివ్వాలి?"

వడ్డీజలగ అతడి వంక అదోలా చూసి లెక్కకట్టి మొత్తమెంతో చెప్పాడు. సత్యనారా



యణ జేబులోనుండి డబ్బు తీసాడు. వడ్డీజ లగ ఆశ్చర్యపోయాడు. అతడు ఆక్షణం అలా బాకీ తీర్చివేయగలడని ఏమాత్రం ఊహించ లేదు. దాంతో నక్కవినయం ప్రదర్శించాడు.

"భలేవారే సార్!.... మీకు కోపం తెప్పించిన ట్లున్నాను.... ఏదో నాకు కాస్త అవసరపడి.... లేకపోతే మీ దగ్గర డబ్బు ఎక్కడికి పోతుంది సార్! బాంక్‌లో దాచుకున్నట్టే కదూ....."



సత్యనారాయణ బదులు పలుకలేదు.

"పోనీ మీకంతగా అవసరం ఉంటే ఓ ఐదొందలు ఉంచుకోండి తర్వాత ఇద్దురు" ఎంతయినా డబ్బు తిరిగొచ్చే పార్టీని వదులుకోవడం ఏ వ్యాపారీ భరించలేడు.

"వద్దులే" అన్నాడు అతడు.

మొత్తం లెక్కపెట్టి వడ్డీజలగకు అందించాడు. వాడు ఆ డబ్బు అందుకుని వంగి వంగి సలాములు కొడుతూ వెళ్ళిపోయాడు.

ఏదో జరుగుతుందని ఊహించిన కొద్ది మంది జనాలకు ఏమీ జరగకపోవటం కాసింత బాధగా అనిపించింది. నిరాశగా తమ పనులలో మునిగిపోయారు వారు.

మిగతాఅప్పులవాళ్ళలో గొంతు మీద కూర్చున్న అప్పులు కొన్ని ఇంటిదాకా రాకముందే కట్టేయాలని వెంటనే బయలుదేరాడు సత్యనారాయణ.

జీవితంలో ఓడిపోయినవాడి మనసులా చీకటి అప్పుడప్పుడే మెల్లమెల్లగా వ్యాపిస్తూ ఉంది. వికలమైన మనసుతో ముందుకు అడుగులేస్తున్నాడు అతడు.

వీధిలో నడుస్తుంటే పక్క ఇళ్ళలోని వారి చూపులు బాకులై శరీరాన్ని తూట్లు పొడుస్తున్నట్లుగా అనిపించింది. సిగ్గుతో కుంచించుకుపోతున్నాడతను. సంస్కారవంతుడు చిన్న అవమానాన్ని కూడా భరించలేడు.

"మంచితనం అన్నది అన్నివేళలా మంచి చేయదు నీకు. జనం నీ మంచితనాన్ని ఎప్పుడూ మెచ్చుకుంటారు కాని ఎప్పుడయినా నీ 'అసమర్ధత' బయటపడినపుడు మాత్రం నిన్ను ఎగతాళి చేయకమానరు.... అసలు సమర్ధత అంటే ఏమిటి? "నీవు వడ్డీజలగ దగ్గర వెయ్యిరూపాయలు అప్పు తీసుకున్నావనుకో- ఆ వ్యక్తి వచ్చి అల్లరిపెడుతుంటే తలొంచుకుని మౌనంగా ఉంటే అది మంచితనం. చూడు! అప్పు తీసుకున్న నేరానికి తలొంచుకున్నాడతడు పాపం! ఎంత మంచివాడు?....' అంటూ జనం జాలి చూపిస్తారు అదే నువ్వు ఆ వడ్డీ వ్యాపారికి ఎదురు తిరిగి 'ఏరా! నా అవసరాన్ని అవకాశంగా తీసుకుని నా రక్తాన్ని పీల్చి పిప్పి చేస్తావా?' అంటూ తిరగబడితేనో లేదా 'పోరా బడుద్దాయ్! నీ అప్పు రెండురోజుల్లో కట్టేస్తాను' అని ఆ వ్యక్తి మీద కలియబడి కొట్టబోయి, ఆ వ్యక్తి భయపడి పారిపోయాక- చెప్పిన గడువు సమయంలో దొంగతనమో దొరతనమో చేసి అప్పు కట్టేయడం 'సమర్ధత' అవుతోంది. దొరతనం ద్వారా సంపాదిస్తే ఫర్వాలేదు. దొంగతనం ద్వారా సంపాదించి తెస్తే అయినా అది సమర్ధతే!..... సమర్ధత, మంచితనం బహుశా ఒకే ఒరలో ఇమడలేకపోవచ్చు.

సమర్ధుడు అంటే కేవలం అక్రమమార్గం అవలంబించేవాడు అని కాకపోయినా ఒక్కోసారి తన సమర్ధత నిరూపించుకునేందుకు అక్రమమార్గాలు చట్టవ్యతిరేకత, మానవత్వం మరిచిపోవటం, యాంత్రికత అలవర్చుకోవడం తప్పదు.

మరి మనిషి మంచివాడిగా బ్రతకడమెలా? సమర్ధుడనిపించుకోవడం మెలా?

అసమర్ధుడు తన జీవితయాత్రలో అవమానాలు, కష్టాలు, నిట్టూర్పులు, కన్నీళ్ళు, సమస్యలు ఇవే చూడగలడు.

అదే సమర్ధుడి జీవితంలో ఇవేవీ దరిచేరవు.

మంచితనానికి అలవాటుపడ్డవాడు తన మంచితనాన్ని ఎట్టి పరిస్థితిలోనూ వదులుకోలేడు. అన్ని వ్యసనాలలాగానే మంచిగా గడపాలనుకోవడం కూడా ఒక వ్యసనమే!....

నలుగురయిదుగురికి డబ్బు సర్ది ఇచ్చాడు అతడు.

తిరిగి ఇంటికి చేరుకునేసరికి చాలా పొద్దుపోయింది. కామేశ్వరి వాకిట్లోనే నిలిచి తన వంక కోపంగా చూస్తోంది. తను చేసొచ్చిన ఘనకార్యం అప్పటికే అర్ధమయిపోయినట్లుందామెకు. ఆమె కోపానికి కారణమేమిటో ఊహించేసాడతను.

ఆ రాత్రి భోజనం వడ్డించేప్పుడు ఆమె అడుగనే అడిగేసింది. "అవునూ! ఆ రెండువేలలో ఏమీ మిగలనే లేదా?"

"లేదు... అందరికీ ఇచ్చేసాను"

"నేనో చీర తెచ్చుకోవాలని చెప్పానుగా"

"చీర కన్నా ముందు అప్పులు కట్టడం





ముఖ్యం...చూశావుగా! అప్పులాడు వచ్చి ఇంటి ముందు ఎంత అల్లరి చేసి వెళ్ళాడో" చిరాకుగా అన్నాడతను. అప్పటికే వడ్డీ జలగ గొడవతో తను చాలా విసుగుపడి ఉన్నాడు.

దాంతో ఆమె సణగడం మొదలుపెట్టింది. "ఏం పాడు బ్రతుకో! కనీసం ఒక్కమంచి చీర కొనుక్కోవడానికి కూడా గతిలేకపోయింది...ఏమని ఈ ఇంట్లోనికి వచ్చానో-వచ్చినప్పటినుండీ నాకు కష్టాలే!...ఆ పుట్టింట్లో సుఖపడటం తప్ప ఈ ఇంట్లో నేను సుఖపడింది ఏముంది?...అన్నింటికీ-అందరికీ డబ్బులొస్తాయిగాని నా ఖర్చుకంటే మాత్రం నయాపైసా మిగలదు..."

అతడికి అన్నం సయించలేదు. అసంతృప్తిగా ఏదో కొంత తిని లేచి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి అంతా కామేశ్వరి సణుగుతూనే ఉంది.

మంచమెక్కాక సత్యనారాయణ దేవుడిని తలచుకున్నాడు.

"ఓ భగవంతుడా! మనిషి జన్మస్థితిలయలు నీకు ఏమీ తోచక చేస్తున్నావో అందులో ఏదైనా పరమార్థం ఉందో నాకు తెలియదు. కాని-నువ్వు చేసే ఈ పనిలో నాలాంటివారు మాత్రం ఈ లోకంలోనే నరకయాతన అనుభవిస్తున్నారు. శివుడాజ్ఞలేనిదే చీమయినా కుట్టదు అంటూనే-నువ్వుచేసే పాపాలకు నువ్వు తప్పక శిక్ష అనుభవిస్తావు అంటుంటారు ఆస్తికులు. నువ్వు చేయించే పాపాలకు మేము శిక్ష అనుభవించడమేమిటో నా కర్థం కావట్లేదు. మహనీయులు విపులీకరించే ఆ వేదాంతసారాన్ని అర్థం చేసుకోగలిగినంత జ్ఞానం కూడా నాలో లేదు.

భగవాన్! పునర్జన్మలున్నాయో లేదో నాకు తెలియదు. ఈ జన్మలో తప్పు చేసినవారు వచ్చే జన్మలో శిక్ష అనుభవిస్తారనడంలోని నిజానిజాలు నేనెరుగను. అయితే-ఈ జన్మలో నేరమూ-శిక్ష అన్నదానిని గుర్తించడం జరిగితే జరుగుతున్న చరిత్రంతా అన్యాయం-అక్రమం-అమానుషం అని నేను ఖచ్చితంగా చెప్పగలను. నేను-నా చుట్టూ ఉన్నవారి కంటే చాలా తక్కువ తప్పులే చేసానని నాకు తెలును. నేరాలు, ఘోరాలు, ద్రోహాలు చేసే ఎంతో మందిని నేను చూశాను. కాని వారంతా ఎంతో సంతోషంగా, సుఖసౌఖ్యాలతో ఈ లోకంలోనే స్వర్గసుఖాలు అనుభవిస్తున్నారు...ఏ తప్పూ చేయని నేను మాత్రం మానసిక క్షోభ అనుభవిస్తున్నాను. మరి ఈ వ్యత్యాసం ఏమిటి భగవాన్?..."

దేవుడున్నాడో-లేడో తెలియదు. ఉంటే మాత్రం అతని గోడు విని ఉంటాడు. ఉండకపోతే విని ఉండడు.

ఆ దేవుడు అతడి గోడు విన్నావినకపోయినా సామాన్యుడి బ్రతుకు బండి మాత్రం తరతరాలుగా ఏ మార్పులూ లేకుండా ఇలాగే సాగుతూ ఉంది.

★ ★ ★

రాజేశ్వరి దగ్గర నుండి ఉత్తరం రాలేదు. నెలరోజులు గడిచిపోయాయి. వస్తుందని వారు ఆశించలేదు కూడా.

అయితే సత్యనారాయణ మాత్రం నీరసించిపోయాడు. తన కూతురికి ఇక పెళ్ళిచేయలేనేమోనని భయపడిపోయాడు.

తన చుట్టూ ఎన్ని సమస్యలున్నా మనిషి జీవితాన్ని సాగించక తప్పదు.

ఆరోజు ఉదయం టిఫిన్ తినేప్పుడు కొడుకు ఓమాట చెప్పాడు-

"నాన్నా! మరో ఆరురోజులలో బి.యస్.ఆర్.బి. ఎగ్జామ్స్ జరగబోతున్నాయి అవి వ్రాస్తాననుకో. బాగా రాస్తే ఉద్యోగం రావచ్చు... ఒకవేళ రాకపోతే..." ఆగాడు సునీల్.

"చెప్పరా" అన్నాడు తను.

క్షణం ఆగి చెప్పాడు సునీల్ "సెంట్‌ఫీటర్స్ హైస్కూల్‌లో టీచర్ పోస్టులు రెండు ఖాళీగా ఉన్నాయట. కమిటీ మెంబర్లకు తలా ఐదువేలు సమర్పించుకుంటే ఆ ఉద్యోగం మనకే వస్తుంది...అంటే సుమారు పాతికవేల రూపాయలు లంచం ఇస్తే నాకు ఉద్యోగం వస్తుంది..."

పాలమారింది సత్యనారాయణకు 'పాతికవేలా' అనుకున్నాడు మనసులో. మెల్లగా తేరుకుని "మన ఇల్లు అమ్మినా పాతికవేలు రావుకదరా!... అంత మొత్తం సర్దడం ఎలా వీలవు

తుంది నాకు''

సునీల్ తలూపాడు. ''అదీ నాకు తెలుసు నాన్నా!...అయినా ఆ విషయం మీకు తెలుపడం బాగుంటుందేమోనని...అంతే'' సర్ది చెపుతూ అన్నాడు.

ఆ సమయంలో కొడుకు ముఖంలో కదలాడిన నిరాశా భావాలు గమనించకపోలేదు సత్యనారాయణ. గమనించినా తను చేయగలిగింది ఏమీలేదు.

అలవాటైన నిట్టూర్పు ఒకటి అతడి గొంతు లోనుండి వెలువడింది.

పాతికవేలుంటే తన కొడుక్కి ఉద్యోగం వస్తుంది. మరో పాతికవేలుంటే కూతురు పెళ్ళి జరిగిపోతుంది. ఇంకో పాతికవేలతో తన గుమస్తాగిరి వలన చాలీచాలక చేసిన అప్పులు అన్నీ తీరిపోయి భార్యాబిడ్డలు సౌఖ్యంగా కాలం గడిపేందుకు కొన్ని వసతులు కల్పించుకోగలుగుతాడు. అంటే సుమారు లక్షరూపాయల చుట్టూనే తన జీవిత సమస్యలన్నీ ముడివడి ఉన్నాయి. ఆ లక్ష రూపాయలే కనుక తనకు ఉంటే...

అతడికి నవ్వొచ్చింది. తన బాధలన్నీ లక్ష రూపాయలతో తీరిపోతాయి. అంటే లక్షరూపాయలు ఒక మనిషి జీవితాన్ని ఆనందమయం చేస్తుంది. అదే ఆ లక్ష రూపాయలే-మరొకరికి ఎందుకూ పనికిరాని మొత్తం అయిఉండవచ్చు. కొందరు పారిశ్రామికవేత్తలు ఘనమైన పార్టీ చేయాలనుకుంటే లక్షరూపాయలన్నది ఏ మూలకూ సరిపోకపోవచ్చు...ఎంత విచిత్రం! ఒక వ్యక్తి ఆర్భాటం కోసం ఒక్క రాత్రి ఖర్చుచేసే మొత్తం-తన జీవితాంతం తనకెంతో ఉపయోగపడుతుంది...హే భగవాన్! నీ సృష్టిలో ఎందుకింత వ్యత్యాసం!

అతడు ఆఫీసుకు వెళ్తుంటే వీధి చివరన ఉన్న హొటల్‌లో నుండి పాట వినిపించసాగింది.

'బ్రతుకంత బాధగా
కన్నీటి గాధగా
కరిగిపోయేనూ
తలచేది జరగదు
జరిగేది తెలియదు
బొమ్మను చేసీ ప్రాణము పోసి
ఆడేవు నీకిది వేడుకా...''

ఆపాట తన బాధల బ్రతుకుకు అర్థంలా ఉన్నట్టనిపించింది సత్యనారాయణకు. 'నిజమే తన బ్రతుకంతా బాధే' అనుకున్నాడు అతడు.

ఆరోజు ఆఫీసులో కూడా సరిగా పనిచేయలేకపోయాడు.

సాయంత్రంవేళ గజిబిజి మనసుతో ఇంటికి తిరిగి వస్తున్నాడు. బస్‌స్టాప్‌లో నిలబడి బస్సెక్కుదామా అనిపించింది. కాని ఆ జనప్రవాహం మధ్య నలిగిపోయి, చెమటకార్చుకుంటూ ఇంటికివెళ్ళేకన్నా ఒకింత ఆలస్యంగా నయినా ప్రశాంతంగా నడుచుకుంటూ వెళ్తే మేలనిపించింది.

మెల్లగా రోడ్డు పక్కనే నడువసాగాడు.

జనం!

రోడ్డునిండుగా జనం, బస్సులతో కిక్కిరిసిన జనం, కారులలో- స్కూటర్లలో జనం. ఈ లోకమంతా జనపూరితం.

మరి ఈ జనాల జీవితాలు ఆనందపూరితాలా! దుఃఖపూరితాలా?... కొందరి జీవితాలు ఆనందమయం అయితే - మరి కొంతమంది జీవితాలు దుఃఖపూరితాలయి ఉంటాయి. ఇంకొంతమంది జీవితాలు సుఖదుఃఖాల కలయికతో సాగిపోతూ ఉంటాయి.

అతడు నడుస్తున్నాడు...ఆలోచిస్తూ నడుస్తున్నాడు. అనంతమైన ఆలోచనలు అతడి చుట్టూ. చూపులు మాత్రం యధాలాపంగా చుట్టూ పరికిస్తున్నాయ్. ఉన్నట్టుండి అతడు ఆగిపోయాడు. ఆలోచనలు స్థంభించిపోయాయి. చూపులు విస్పారితాలయ్యాయి.

ఏదోతెలియని ఉద్వేగం, శరీరంలోని రక్తమంతా వడివడిగా పరిగెత్తసాగింది. అతడు అటుగా చూశాడు. కళ్లు చికిలించి మరీ చూశాడు.

నిజమే!

ఆమె...ఆమె...వసుంధరే!

అతడు చెయ్యెత్తి పిలుద్దామనుకున్నాడు. గొంతెత్తి అరుద్దామనుకున్నాడు. కానీ చెయ్యిపైకి లేవలేదు. గొంతు పెగల్లేదు.

అవతల...అవతలివైపు బస్‌స్టాపులో నిలబ





డి ఉంది వసుంధర. ఆమెను అలా చూస్తుంటే తన మనసునిండా ఉత్సాహం.

అతడు వాహనాలను తప్పించుకుంటూ రోడ్డు దాటాడు. తడబడే అడుగులతో ఆమెను సమీపించాడు.

వసుంధర ఎటోచూస్తుంది. బహుశా రావలసిన బస్సు కోసం ఎదురుచూపులు చూస్తుంది. అతడిని గమనించలేదు.

అతడు ఆమె దగ్గరగా నిలబడి "వసుంధర" అన్నాడు.

ఆమె చప్పున తలతిప్పి చూసింది. అతడిని చూడటంతోనే ఆమెకళ్ళు మిలమిల మెరిసాయి. పెదాలు విచ్చుకున్నాయి.

"హాయ్...సత్యం...నువ్వా"

"ఇంకెవరనుకున్నావు?" నవ్వుతూ అడిగాడు.

"నువ్విలా కలుస్తావని ఊహించలేదు..."

"మద్రాసు నుండి ఎప్పుడొచ్చావు?"

"రెండురోజులయింది... మాపిన్నికూతురి పెళ్లి ఉంటే వచ్చాను. ఎలాగూ వచ్చాను కాబట్టి అమ్మానాన్నతో రెండురోజులు గడిపివెళ్దామని ఉండిపోయాను"

మాట్లాడుతుంటే ఏదో బస్సు వచ్చి ఆగింది-

"నువ్వెళ్లాల్సిన బస్సు వచ్చినట్టుంది" అన్నాడతను ఆమెతో- ఆమె కదలకపోవటం చూసి. అయితే మనసులో మాత్రం ఆమె వెళ్లిపోతుందేమోనని కాస్త బాధగా అనిపించింది.

వసుంధర తల అడ్డంగా ఊపింది. "నేనిప్పుడు ఆ బస్సులో వెళ్లడంలేదులే. చాలా సంవత్సరాల తర్వాత కలుసుకున్నాం...అలా వెళ్తూ కాసేపు మాట్లాడుకుందాం".

అతడికి చాలా సంతోషం వేసింది. తన ప్రియమైన వసుంధరతో మరికొద్దిసేపు మాట్లాడే అవకాశం కలిగినందుకతడు పొంగిపోయాడు.

తలూపాడు సత్యనారాయణ. ఆమె ముందుకు నడిచింది. అతడు ఆమె పక్కనే నడవసాగాడు. అలా నడుస్తుంటే తనకు గాలిలో తేలిపోతున్నట్టుగా అనిపించింది. చాలా...చాలాకాలం తర్వాత తనకా అనుభూతి తిరిగి లభించింది.

అతడు ఓరగా ఆమె వంక చూశాడు. వసుంధరలో ఈ ఇరవైరెండేళ్ల సుదీర్ఘకాలం పెద్ద మార్పేమీ తీసుకురాలేదు. ఆమె కాలేజీ రోజుల్లో విరిసీవిరియని గులాబీ మొగ్గలా గుంటే, ఇప్పుడు పూర్తిగా అరవిరిసిన రోజాపు వ్వులాగుంది. అసలు వసుంధరకిప్పుడు నల భైఏళ్లంటే ఎవ్వరూ నమ్మరు. ముప్ఫయ్‌రెండు-ముప్ఫయ్‌మూడు ఉంటాయనుకుంటారు. వసుంధర తన అందాలను చాలా జాగ్రత్తగా కాపాడుకుంటూ వస్తున్నట్టుంది...అయిఉండొచ్చు, వసుంధరకు మొదటి నుండీ తన అందం అంటే తనకు చాలా ఇష్టం. ఆ అందాన్ని కాపాడుకునేందుకు ఎంతో ఖర్చుచేసింది.

ఆమెకు తన అందం మీద అంత మమకారమే లేకపోయి ఉన్నట్లయితే బహుశా...తామిద్దరూ భార్యాభర్తలుగా జీవితాన్ని పంచుకుని ఉండి ఉండేవారేమో!

"ఏమిటాలోచిస్తున్నావ్ సత్యం?"

అతడి ఆలోచనలు టక్కున తెగిపోయాయి. తడబడి అడ్డంగా తలూపాడు "ఏంలేదు"

ఆమె మరి రెట్టించలేదు. మాట్లాడుకుంటూ వెళ్దామని బయలుదేరినవారు మాట్లాడేందుకు మాటలే కరువయినట్లు మౌనంగా నడవసాగారు. ఇద్దరిమధ్యా కొద్దిసేపు నిశ్శబ్దం. ఇక తప్పదన్నట్టు అతడే మాట్లాడాడు.

"పెళ్ళికి మీవారు రాలేదా?"

"వచ్చారు... ఏదో అర్జంట్ పనులున్నాయని తిరిగి ఆరోజే వెళ్ళిపోయారు"

"అన్నట్టు పిల్లలెంతమంది?"

"ముగ్గురు- ఒక అబ్బాయి, ఇద్దరమ్మాయిలు. అబ్బాయి కాలేజీ చదువుతున్నాడు. అమ్మాయిలింకా హైస్కూల్ చదువుల్లోనే ఉన్నారు" అని క్షణం తర్వాత ప్రశ్నించింది.

"మరి మీకు?"

అతడు జవాబుగా వివరాలు చెప్పాడు-

ఎదురుగా హొటల్ కనిపించింది. "కాసేపలా కూర్చుందామా?" ఆమె అడిగింది.

తలూపాడతడు. ఇద్దరూ లోపలికెళ్ళి ఏ.సి. రూమ్‌లో ఓ కార్నర్‌సీట్లో కూర్చున్నారు. ఆ క్షణం అతడికి తామిద్దరూ విడిపోయే సన్నివేశం గుర్తుకు వచ్చింది. ఆరోజు కూడా ఇదిగో... ఇలాగే...హొటల్‌లో ఎదురెదురుగా కూర్చుని... మనసంతా బాధతో నిండిపోయింది.

"మీవారి బిజినెస్ ఎలాఉంది?"

"బాగానే సాగుతోంది"

వసుంధర భర్తకు మద్రాసులో సినిమాలకు ఫైనాన్స్‌చేసే బిజినెస్ ఉంది అందులో బాగానే సంపాదిస్తున్నాడని వినికిడి.

స్టీవార్డ్ వచ్చాడు. ఆమే ఆర్డర్ చేసింది.

వారు తిరిగి కాలేజీ ముచ్చట్లతో మునిగిపోయారు. ఆరోజులను జ్ఞప్తికి తెచ్చుకుంటే- అదో వింత అనుభూతి. సరదాలు, చిలిపితనాలు, ప్రేయసితో షికార్లు...ఎంత తియ్యని జీవితం అది. మనిషికి జన్మనిచ్చిన ఆ దేవుడు- ఆ మనిషి కోరుకుంటే తిరిగి అందమైన బాల్యంలోనికో, ఆనందకరమైన యవ్వనంలోనికో వెళ్ళిపోయేలా వరం ఇచ్చి ఉంటే ఎంత బాగుణ్ణు. అప్పుడు లోకం ఎలాఉండేది... వయసు వస్తుందన్న సమస్యేలేదు. జీవితంలో పోరాడేందుకు అశక్తత వస్తుందన్న బాధలేదు. అప్పుడు లోకం ఎంత ఆనందంగా-ఆహ్లాదకరంగా ఉండి ఉండేదో, ఎటుచూసినా చిన్న పిల్లలా, సమస్యలెరుగని కుర్రకారు... అంతలోనే మరో ఆలోచన-అందరూ సమస్య లెరుగకుండా ఆనందంగా బ్రతికేస్తుంటే, మరి కష్టపడి వారిని పోషించేదెవరు?... అప్పుడు మనిషి కష్టపడకుండా ప్రకృతే ఫలాహారాలతో మనిషి ఆకలి తీరుస్తుండాలి! అంతే- ఒకనాటి ఆటవిక సమాజాన్ని తను కోరుకుంటున్నాడా?... వాస్తవంలో మనిషికి ఇన్ని సమస్యలతో జీవించే ఈ బ్రతుకు కంటే, ఆనాటి అడవులలో నివశించే అనాగరిక జీవితమే ఎంతో మేలయినది...

బేరర్ ప్లేట్లలో ఆర్డరిచ్చినవి సర్ది టేబుల్ మీద ఉంచి వెళ్లాడు. ఆమె ముందున్న ప్లేట్‌లోని చికెన్ నూడిల్స్ ఫోర్క్‌తో నోట్లోకి లాక్కుంటూ అతడితో అంది-

"ఆనాటి కాలేజీ జీవితం ఎంతో ఆనందంగా గడిచింది. బహుశా అంతటి ఆనందాన్ని నేను తిరిగి ఎన్నడూ పొందలే





దేమో!''

''కాలేజీ జీవితం చాలా ఆనందకరమైనదే కావచ్చు. కాని ఇప్పుడు మాత్రం నీ ఆనందానికి లోటేముంది?''

అతడి మాటలకు ఆమె ముఖంలో విషాద ఛాయలు క్షణకాలం తళుక్కున మెరిసి, వెంటనే మాయమయ్యాయి. ఆ క్షణంకాలంలోనే ఆమె ముఖంలోని భావాలను పసిగట్టాడు అతడు. అయితే వివరాలు అడగదలచుకోలేదు. తన ముందున్న ప్లేట్స్‌లోని పదార్థాలను ఖాళీచేయటంలో నిమగ్నమయ్యాడు.

కొద్దిక్షణాలు తర్వాత మెల్లగా అందామె- ''జీవితంలో నేను పెద్ద తప్పుచేశానేమో, తప్పటడుగు వేశానేమోననిపిస్తుంది''

అతడు వింతగా చూశాడామెవంక. ''ఏంచేశావు?'' అయోమయంగా అడిగాడు.

''డబ్బుమీది వ్యామోహంతో- దూరపుకొండలు నునుపు అని తెలియక- నా అందం కాపాడుకోవాలని- కార్లలో, మేడలలోనయితేనే సుఖంగా బ్రతకవచ్చుని వెళ్ళినందుకు నాకు తగిన శాస్తే జరిగింది''

అతడి అయోమయం మరింత పెరిగింది. ముఖాన్ని అలాగే ప్రశ్నార్థకంగా పెట్టాడు.

ఆమె చెపుతూ ఉంది ''డబ్బు వలననే సర్వసుఖాలు లభ్యమవుతాయని అమాయకంగా నేనో ధనవంతుడిని పెళ్ళాడాను. కాని ఆ డబ్బువలన నాకేం జరిగింది? సర్వసుఖాలు- అంటే కారు, మేడ, ఫ్రిజ్, కలర్ టి.వి, నౌఖర్లు లభ్యమయ్యాయి. బట్... మనశ్శాంతి...మనశ్శాంతి ఎక్కడుంది?! నా భర్త పక్కా తాగుబోతు. ప్రతిరాత్రీ పీకలవరకూ తాగి, నానా అల్లరి చేయనిదే తనకు నిద్రపట్టదు. దానికితోడు అమ్మాయిలపిచ్చి కూడా.... అందులోనూ ఉండేది సినిమాఫీల్డ్. మద్రాసులో జూనియర్ ఆర్టిస్టులకు కొదవలేదు కాబట్టి ఆయన కోరికలు నిరాటంకంగా సాగిపోతూ ఉన్నాయి. నాకు లగ్జరీస్ అన్నీ ఉన్నాయి. కాని ఆయనవలన శారీరక సుఖం, మానసిక శాంతి-రెండూ లేకుండాపోయాయి. యూ ఫోమ్ బెడ్‌మీద పడుకుని ఒక్కోసారి ఒంటరిగా నాలోనేనే కుమిలికుమిలి ఏడ్చుకుంటుంటాను...ఆ సమయంలో నువ్వు నాకు గుర్తొస్తావు. జీవితంలో నేనెంత పొరపాటుపని చేశానో నాకర్థమయింది...''

వసుంధర ఇంకా ఏవేవో చెప్పుకుపోతుంది. అతడు పూర్తిగా వినడంలేదు. అప్పటికే అతని మనసునిండా సంతోషం నిండిపోయింది... 'తనను ఒకప్పుడు కాదని తిరస్కరించిన ప్రేయసి, ఇంతకాలానికి జరిగిన తప్పుపట్ల బాధను వ్యక్తంచేస్తోంది. తనను పోగొట్టుకున్నందుకు పశ్చాత్తాపపడుతోంది'... ఎవరైనా కోరుకునేది ఎదుటి వ్యక్తిలోని పశ్చాత్తాపమే కదా! ఆ పశ్చాత్తాపం వలన తనకున్న ఉపయోగం ఎంత-అన్నది ఎవ్వరూ పట్టించుకోరు.

అప్పటివరకూ ఇన్నేళ్ళ బాధను మనసులోనే దాచుకుందేమో, మనసుకు దగ్గరయిన వ్యక్తి కనపడేసరికి ఆవేదన బద్దలై, ఆవేశంగా చెప్పుకుపోసాగింది. ఆమె ఆ మాటలు ఆపేసరికి ఎగశ్వాస ప్రారంభమయింది. కళ్ళు వర్షించేందుకు సిద్ధంగా ఉన్నాయి.

వసుంధర పరిస్థితిని వినటంతో అతడికి ఆమెమీద జాలికూడా కలిగింది. బట్ తనిప్పుడు నాలుగు ఓదార్పుమాటలు మాట్లాడడంతప్ప మరేం చేయగలడు? జాలిమాటలవలన ప్రయోజనం ఏముంది?

అంతా విన్న తర్వాత మౌనంగా తల వంకించాడు సత్యనారాయణ. అంతకన్నా చేయగలిగింది మరేమీ కనిపించలేదు.

చెప్పదలుచుకున్నదంతా చెప్పిన తర్వాత ఆమె మనసు తెరిపిన పడినట్టుంది. మనసులోని ఆవేదన కొద్దిగా తగ్గింది.

తనను తాను సంభాళించుకునే ప్రయత్నంలో ''సారీ'' అంది వసుంధర.

''ఇట్సాల్‌రైట్'' అన్నాడు సత్యనారాయణ.

తర్వాత ఇద్దరూ ఎక్కువగా మాట్లాడుకోలేదు. చాలాసేపు నిశ్శబ్దస్రవంతి తర్వాత ఆమె అంది ''ఇక వెళ్దామా''

తలూపాడు అతడు.

సత్యనారాయణ వారిస్తున్నా వినకుండా, వసుంధరే బిల్లు చెల్లించింది. ఇద్దరూ హోటల్ బయటకు నడిచారు.

శరీరానికి వయస్సు వచ్చి ఉండొచ్చు. మనసు పెద్దరికాన్ని సంతరించుకుని ఉండొచ్చు. అయితే ఆ మనసులో జనించే భావాలన్నీ పెద్దతరహాగానే ఉండాలని నియమం లేదు. యాభైఏళ్ల వ్యక్తి మనసు కూడా ఒక్కోసారి పాతికేళ్ళ కుర్రాడి మనసులా తీపి స్పందనల కలుగజేయవచ్చు. ప్రస్తుతం సత్యనారాయణ మనసు కూడా పాతికేళ్ల కుర్రాడి మనసులా తీపి స్పందనలకు నిలయమై ఉంది. చాలా కాలం తర్వాత ఒకనాటి ప్రేయసి కలుసుకోవడంతో మనసు ఆరోజులలోనికి వెళ్ళిపోయింది. అందులోను ఆమె చెప్పిన మాటలు పశ్చాత్తాపం చెందిన మనసు అతడికి ఆనందం కలుగజేసాయి... ఇంతకాలానికైనా ఆమె తన గొప్పతనం గుర్తించగలిగినందుకు అతడెంతో సంతోషించాడు.

ఇద్దరూ కొద్దిదూరం నడిచాక ఆమె అంది- ''నేను ఇటుగా వెళ్తాను'' ఒక సందు మొదట్లో నిలబడి ఉన్నారు వారిద్దరూ.

మాటల మధ్య పక్కపక్కనే నడుచుకుంటూ, చాలాదూరం వచ్చేసారు వాళ్లు. ఆమె ఇల్లు దగ్గరయింది.

తలూపాడు అతడు.

వసుంధర అతడి కళ్లలోనికి నిముషంపాటు అదోలా చూసి, చప్పున తలతిప్పుకుని వేగంగా ముందుకు నడిచింది. ఆమె అలా ఎందుకు చేసిందో అతడికి అర్థమయింది.

అతడు తిన్నగా నడవసాగాడు వసుంధర కలయిక- ఎడారిలో పయనిస్తూ అలసిపోయిన వాడికి, సేదతీర్చేందుకు వచ్చిన వసంతగా నంలా అనిపించింది.

సత్యనారాయణ ఇల్లు చేరాడు. అదే ఇల్లు- అదే వాతావరణం- అవే జీవిత సమస్యలు అయినా అతడి మనసులో ఏదో కొత్త ఉత్సాహం.

ఆ ఉత్సాహానికి కారణం- 'ఒక జీవితకాలం లేటయినా' తన వసుంధర తన ప్రేమను ఆమోదించింది. తన యొక్క గొప్పతనం గ్రహించింది.

ఆరోజంతా అతడు చాలా ఉత్సాహంగా గడిపాడు. ఆరాత్రి భోంచేశాక పడుకుంటే 'గతం' మెల్లగా పలకరించింది. ఆనంద, దుఃఖోద్వేగాలు మనసును కదిలించాయి.

ఆరోజుల్లో వసుంధర కాలేజీ బ్యూటీ. తనేమో కాలేజీ ఫస్ట్‌క్లాస్ విద్యార్థి.

బహుశా తన చదువే ఆమెను ఆకర్షించి ఉండొచ్చు. అందుకే ఆమె తనతో కోరి పరిచయం పెంచుకుంది.

డిగ్రీ మొదటి సంవత్సరంలో తమ పరిచయం నోట్సులు అడిగి తీసుకోవడంతో మొదలయింది. రెండో సంవత్సరంలో చనువుగా మాట్లాడుకోవడం ప్రారంభించారు. మూడో సంవత్సరంలో కలిసి సినిమాలకు, షికార్లకు తిరగడం సాగింది.

వసుంధరది, తనది ఒకటే కులం. ఇరవై రెండేళ్లక్రితం పెద్దలు మహా పట్టింపుగా చూసేది కులాలనే. కాబట్టి కలసిన మనసులేకాదు కులాలు కూడా కలవడంతో ఒక పెద్ద గండం గడిచినట్టుగా ఫీలయ్యాడు తను. ఇక రెండవది ఆస్తి అంతస్తులు. ఆ విషయంలో తమ కుటుంబం, వసుంధర కుటుంబంతో సరితూగలేదని తనకు తెలుసు. వసుంధర తండ్రి ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు. రెండుచేతులా సంపాదిస్తున్నాడు. ఆయన కూతురిని లక్ష రూపాయల కట్నంతో అత్తారింటికి పంపించగలడు. మరి తన వైపు ఆలోచిస్తే తనకేముంది?! అమ్మ కష్టపడుతూ, తనను చదివిస్తోంది. తమకు ఉన్న ఆస్తల్లా ఒక్క పెంకుటిల్లు మాత్రమే. అదీ తాకట్టులో ఉంది. మరి వసుంధర తండ్రి పేదవాడైన తనకు తన బిడ్డనిచ్చి పెళ్లి చేస్తాడా?! అయితే అసలీ సమస్యలేవీ ఆయనవరకు వెళ్లలేదు. వసుంధరే తేల్చివేసింది.

వసుంధరకు మొదటినుండీ ఆమె అందంపట్ల పెద్ద ఇష్టం. ఇంకా కారులలోనూ, మేడలలోనూ గడపాలని ఊహించుకుని కలలు కంటుండేది. మరి పేదవాడైనా తనతో తిరగడం అదో వయసు ఆకర్షణ. అయితే ఆమె ఊహలలో తన భవిష్యత్‌లో చాలా గొప్పగా ఉండొచ్చని అనుకున్నట్టుంది. తనెలాగూ ఫస్ట్‌క్లాస్ స్టూడెంట్ కాబట్టి, ఇంకా పై చదువులు చదివి ఐ.ఎ.ఎస్ ఆఫీసరో, ఐ.పి.ఎస్ అధికారో అవుతాడని ఊహించింది.

కాని చదువు పూర్తయ్యాక వెంటనే వచ్చిన ఉద్యోగంలో తను చేరిపోతానని చెప్పినప్పుడు ఆమె ఎంతో బాధపడింది. మరెంతో నిరాశపడింది. 'ఉద్యోగం వద్దు- ఇంకా పై చదువులు చదవమని' పోరింది కూడా.

అయితే ఆ సమయంలో ఇంట్లో అమ్మ పడే కష్టాలు చూస్తూ, చుట్టుముడుతున్న జీవిత సమస్యలు చూస్తూ తనకుఇంకా చదువుకోబుద్ధ వలేదు. తన మీద ఎన్నో బాధ్యతలున్నాయి. చెల్లెలు రాజేశ్వరి పెళ్ళి చేయాలి, ఉన్న అప్పులు తీర్చాలి, అమ్మను ఇకనైనా సుఖంగా బతికేలా చేయాలి... అందుకే ఆమె మాటలను తిరస్కరించాడు తను.

దాంతో వసుంధరకు కోపం వచ్చింది. తన మీద కట్టుకున్న ఆశలమేడలు ఒక్కసారిగా కూలిపోయాయి. దానితోపాటే ఆకర్షణ కూడా చెదిరిపోయింది. ఆమె ప్రాక్టికల్‌గా కూడా ఆలోచించగలదు.

అందుకే ఆమె ఒకరోజు తనతో తెగేసి చెప్పింది-

"సత్యం నీమీద నాకు ప్రేమ ఉంది. నిన్ను పెళ్లాడాలని ఆశగా కూడా ఉంది కాని ... నాకంటూ కొన్ని కోరికలున్నాయి. నేను నివసించేందుకు మేడ ఉండాలి. తిరిగేందుకు కారు ఉండాలి. ఇంట్లో సకల సౌకర్యాలుండాలి. నేను కష్టపడకుండా పనిచేసే నౌఖర్లూ కావాలి. బట్ ... నిన్ను పెళ్ళి చేసుకుంటే నాకవన్నీ లభ్యమవుతాయా. నీకొచ్చే వెయ్యి రూపాయల జీతం కనీసం నా అందానికి మెరుగులు దిద్దుకునేందుకైనా సరిపోతుందా అన్నది! నువ్వే ఆలోచించు. ఇప్పుడు నీ చుట్టూ ఎన్నో బాధ్యతలున్నాయి. అన్ని బాధ్యతల మధ్య నన్ను సుఖపెట్టడం నీవలన కాదనుకుంటున్నా. అందుకే ... మనం ఇలాగే విడిపోదాం..."

తను మాట్లాడలేదు. మాటలు రాని మూగ అయ్యాడు.

ఆమె వెళ్లిపోయింది.

కొద్ది రోజుల తర్వాత తెలిసింది – వసుంధర ఓ పెద్ద వ్యాపారవేత్తను పెళ్ళి చేసుకుందని. చాలా రోజులపాటు బాధపడ్డాడు.

కాని ప్రేమే లోకం – ప్రేమే మరణం – ప్రేమే శాశ్వతం ... అనుకుంటూ దేవదాసులు కావడం అసహజం కాకపోయినా చాలా అరుదైన విషయం

ప్రేమించినవాడికి బాధ ఎంత సహజమో మరిచిపోవడం కూడా అంతే సహజం. కాలగమనంలో వసుంధర మనసుమూలలకు చేరుకుంది. ఆ స్థానంలో మిగతా ఆలోచనలు మొదలయ్యాయి.

రాజేశ్వరికి పెళ్లి చేశాడు. కొంత అప్పు అయింది. తను కామేశ్వరిని పెళ్లి చేసుకున్నాడు. అప్పు కాస్త తగ్గింది. అప్పటినుండీ ప్లస్ మైనస్‌లతోనే జీవితం గడిచిపోతూ ఉంది.

... ... ... ...

'గతం' తాలూకూ ఆలోచనలు మధ్యనే అతడు మెల్లగా నిద్రలోనికి జారుకున్నాడు.



"రేయ్ పరాత్పరం! మొన్నో రోజు వసుంధర కనిపించిందిరా" ఉత్సాహంగా అన్నాడు సత్యనారాయణ.

"ఏ వసుంధర" ప్రశ్నార్థకంగా చూశాడు పరాత్పరరావు.

"మనకు తెలిసిన వసుంధర మరెవరున్నారు. ఆమే ... మన క్లాస్‌మేట్"

రెండు క్షణాల తర్వాత ఆమె ఎవరో గుర్తొచ్చి "ఓహో! నీ వసుంధరా ... ఆఁ! ఏమిటట విశేషం" నవ్వుతూ ఉత్సాహంగా అడిగాడు పరాత్పరరావు.

సత్యనారాయణ తాను ఆమెను ఎలా కలిసింది అన్న దగ్గరనుండి మొదలుపెట్టి, ఆమె చెప్పిన వివరాలన్నీ వినిపించాడు మిత్రుడికి.





పరాత్పరరావు మొదలు ఆశ్చర్యపోయి, వెంటనే భుజాలెగరేసి "ప్చ్! పాపం – లేట్ రియలైజేషన్" అన్నాడు ఒకింత వ్యంగ్యంగానే.

అతడు మాట్లాడలేదు. ఎంతైనా తను ప్రేమించిన వ్యక్తిపట్ల కాస్త జాలి దయ కనపరచటం మామూలే.

కొద్దిసేపు వసుంధర గురించి, ఆ తర్వాత కాలేజీ రోజుల గురించి చర్చ జరిగింది. ఆ చర్చ అయిన తర్వాత సత్యనారాయణ కాస్త ఆసక్తిగా అడిగాడు.

"అది సరే! ఇంతకు ముందు మనం కలిసినప్పుడు డబ్బు ఉండగానే మనశ్శాంతి లభించదని. దానిగురించి వివరిస్తానన్నావ్ ... ఏం జరిగిందేమిటి?"

పరాత్పరరావు అతడి వంక చూసి అదోలా నవ్వాడు. తర్వాత "డబ్బు ఉంటే ఏదయినా సాధించొచ్చు, ఏదైనా కొనుక్కోవచ్చు అని నేను అనుకుంటుండేవాడిని. బట్ డబ్బువలన చాలా కొనుక్కోవచ్చేమోగానీ, ఒక్కటి మాత్రం కొనుక్కోవడం ఎట్టి పరిస్థితుల్లోనూ సాధ్యపడదు. అదే మనశ్శాంతి. ఈ విషయంలో నాది కూడా లేట్ రియలైజేషనే ..." చెబుతూ ఆగాడు ఆయన.

"వివరంగా చెప్పు" అన్నాడు సత్యనారాయణ.

ఆ కాంపౌండ్ లోపలి ఒక ఎత్తయిన చెట్టు ఆకులు గాలికి మెల్లగా కదులుతున్నాయి. సూర్యుడు పశ్చిమాద్రిన క్రుంగి చాలాసేపైంది. రాత్రి, పగలుకు మధ్య వారధిగా నిలిచిన సంధ్యాకాంతి లోకమంతా పరచుకుని ఉంది. పరాత్పరరావు ముఖంలో కూడా సంధ్యాకాంతి అలముకుంటూ ఉంది. అది యవ్వనంలో నుండీ, మధ్యవయస్సుదాటి వృద్ధాప్యంలోనికి అడుగుపెట్టబోయే ముందు స్థితి.

పరాత్పరరావు చెప్పడం మొదలుపెట్టాడు. "...నిజంగా నాది లేట్ రియలైజేషనేరా సత్యం! వయసులో ఉన్నన్నాళ్లూ నా భార్య – నా బిడ్డలు అంటూ రాత్రింబవళ్లూ శ్రమించాను. ఎంతో డబ్బు వెనకేశాను. అయితే ఆ డబ్బే భవిష్యత్‌లో నావారిని నానుండి దూరం చేస్తుందని నాకు తెలియదు ... నీకు తెలుసా! నేనిప్పుడు భయంకరమైన ఒంటరితనంతో బాధ పడుతున్నాను. మానసికంగా తోడు ఎవరూ లేక మనసులోనే కుమిలిపోతున్నాను ... నా భార్య ఉంటే పరిస్థితి ఎలా ఉండేదో నాకు తెలియదు గాని, ఆమె పోయాకే నాకీ ఒంటరితనం ప్రాప్తించింది. నా కొడుకులు - కోడళ్లు ఎప్పుడూ బిజీనే. నా డబ్బే వారిని బిజీ చేసింది. ఒక కొడుకు డాక్టరుగా బిజీ అయితే, మరో కొడుకు వ్యాపారంలో బిజీ. కోడళ్లు కూడా ఇంటిపట్టున ఉండరు. మహిళా మండలులు, సభలు, షాపింగ్‌లతోనే వారికి సరిపోతుంది. పోనీ మనుమళ్లను దగ్గరకు తీద్దామంటే వారు కాన్వెంట్‌ల కోసం పరుగు,రాగానే ట్యూషన్‌లలో బిజీ ... ఇక ఈ వయసులో నేను పలకరించేందుకు ఎవరున్నారు చెప్పు! ప్రతి మనిషీ ఒకానొక వయసు వచ్చాక, విశ్రాంతిగా గడపడం మొదలయ్యాక తనేం కోరుకుంటాడు? తన కొడుకు - కోడళ్లు తనను కనిపెట్టుకుని ఉండాలనుకుంటాడు. మనుమళ్లతో ఆటలాడాలనుకుంటాడు ... ప్చ్! బట్ ... కాలంతోనూ, డబ్బు వెనుక మనిషి పరుగెత్తడం మొదలుపెట్టాక ఏం జరుగుతుంది? -- పక్కవాడి గురించి ఆలోచించే తీరిక లేకపోయింది. అతడు కన్నతండ్రయినా, తమ కోసం సర్వస్వం ధారపోసినవాడైనా సరే ... అతడిని పట్టించుకోరు. వారి పరుగే వారిది.

మరి ఇలా నన్ను అశ్రద్ధ చేసే వారికోసం ... నేనెందుకంతగా శ్రమపడ్డానా అని నేనిప్పుడు బాధపడుతున్నాను ... తోడెవరూ లేకపోవడంతో ఒంటరితనం. దానితోపాటు మానసిక అశాంతి ... నువ్వనుకుంటున్నావు కదూ డబ్బు ఉంటే అన్నీ సమకూరుతాయని. ఒకప్పుడు నేనూ అలా అనుకునేవాడినే. కాని నాకిప్పుడున్న మానసిక అశాంతిని నాడబ్బు పోగొట్టగలదా? నాకున్న లక్షలు నాకు మనశ్శాంతిని ఇవ్వగలవా? ... ఊపిరి పీల్చుకునేందుకేమో ఆగాడు క్షణంపాటు.

మిత్రుడి మనోవ్యథ వింటున్న సత్యనారాయణ అవాక్కయ్యాడు. "అరే! పరాత్పరానికి డబ్బు ఉంది కాబట్టి సకల సౌఖ్యాలు - సర్వశాంతులు ఉన్నాయనుకుంటున్నాడు తను. కాని ఇలా కూడా ఉంటుందా? డబ్బున్న

వాడికి ఇలాంటి మానసిక అశాంతి కూడా ఉంటుందా? ... తనింతవరకూ 'డబ్బు' అన్న పదార్థం యొక్క ఒకవైపు మాత్రమే చూశాడు. ఇదిగో ఇప్పుడే 'డబ్బు' యొక్క మరోకోణాన్ని చూడగలుగుతున్నాడు ... వసుంధర కూడా ఇలాగే అంది. "తనకు కారులు, మేడలు, కలర్ టీ.వీలు, ఫ్రిజ్‌లు – అన్నీ ఉన్నాయి. కాని మానసికశాంతి లేదట' ... అవునూ! మనిషికి మనశ్శాంతి డబ్బు ద్వారా రాదా? అదెలా – తన జీవిత సమస్యలు – మనశ్శాంతి డబ్బుతోనే ముడిపడిఉన్నాయే. తనకో లక్ష రూపాయలు ఉంటే చాలు – తను ఈ లోకంలో ఎవరూ ఉండనంత ఆనందంగా - మనశ్శాంతితో, అతి చక్కగా కాలం గడపగలడు. మరేమిటి వీళ్ళూ – డబ్బుండికూడా ఇలా ... బహుశా ఏ సమస్యలూ లేకుండా కాలం గడపడం మనిషి తత్వానికి విరుద్ధం. అందుకే చాలామంది సమస్యలు కొని తెచ్చుకుంటారు. సాధారణంగా డబ్బున్నవారి సమస్యలన్నీ కొని తెచ్చుకునేవే అయి ఉంటాయి. అసలయిన సమస్యలు సామాన్యుడి జీవితసమస్యలే!

అతడి మనసులోని భావాలు చదివి అన్నాడో – చదవకనే అన్నాడో తెలియదుగాని పరాత్పరరావు ఇలా చెప్పాడు" ... సత్యం! నువ్వనుకోవచ్చు వీడు తిని కొవ్వెక్కి, మరే పనీ లేక తీరిగ్గా కూర్చుని ఇలా ఒంటరితనం మానసిక శాంతి అనే మాటలు మాట్లాడుతున్నాడని, లేకపోతే నలభై ఐదేళ్లకే పనీపాటా చేయకుండా వైరాగ్యంగా మాట్లాడటం ఏమిటని అనుకోవచ్చు. కాని నీకు తెలియనిదేమిటంటే ' నా భార్య చనిపోయిన తర్వాత బిజినెస్ మీద నాకు పెద్ద ఇంట్రస్ట్ లేకపోయింది. మనసు విశ్రాంతి కోరుకుంది. ఈ సమయంలోనే నేను నా వాళ్లనుండి ఒకింత ఆప్యాయత, ఆదరణ కోరుకున్నాను. పూర్తి సమయంకాకపోయినా కొద్ది సమయమైనా వారు నాతో గడపాలని ఆశించాను. కాని జరుగుతున్నదేమిటి? ... ఎవరి పనులలో వాళ్లు బిజీ. నేను సంపాదించిన డబ్బును మరింత పెంచేందుకు శ్రమపడుతూ, ఆ డబ్బుకు మూలస్థంభమైన నన్నే మరచిపోయారు. నన్ను పట్టించుకోవడం మానేశారు ... నాకిప్పుడు అనిపిస్తుంది – నన్ను పట్టించుకోని వీరికోసం నేనెందుకంతగా శ్రమపడ్డానా? అని అందుకే అంటాను, నాది లేట్ రియలైజేషన్ అని..."

ఈ లోకంలో 'నేను చాలా హాయిగా ఉన్నాను. నాకు ఎలాంటి అసంతృప్తి లేదు' అని చెప్పగలిగిన మనిషి బహుశా ఎవరూ ఉండకపోవచ్చు. ప్రతి వ్యక్తి జీవితంలో ఏదో అసంతృప్తి మరేదో సమస్య!

ఆకాశం చీకటి చీరను తన మీద కప్పుకుంటోంది.

అప్పటికే మాటలన్నీ పూర్తయిపోవడంతోనూ, ఇంటికెళ్ళాలన్న ఆలోచన రావటంతోనూ సత్యనారాయణ లేచాడు. వెళ్ళొస్తారా అన్నాడు పరాత్పరరావుతో. తలూపాడు ఆయన.

లేచి మిత్రుడిని గేటు వరకూ వచ్చి సాగనంపాడు.

సత్యనారాయణ రోడ్డెక్కి ఇంటివైపు నడవసాగాడు.

★ ★ ★

"ఏమోయ్ కామూ! రేపు మన నీరజను చూసుకునేందుకు సంబంధం ఒకటి వస్తుంది" ఉత్సాహంగా అన్నాడు సత్యనారాయణ.

"ఏ వూరు?" ఒకింత ఆసక్తిగా ప్రశ్నించింది కామేశ్వరి.

"అల్లూరు! ... మన కృష్ణారావు లేడూ – తను తీసుకువస్తున్నాడీ సంబంధం"

కృష్ణారావు సత్యనారాయణ కొలీగ్.

"అబ్బాయి ఏం చేస్తున్నాడేమిటి", ఆరాగా అడిగింది ఆమె.

"డిగ్రీ చదివాడట. ప్రస్తుతం ఆర్.టి.సిలో కండక్టర్‌గా పనిచేస్తున్నాడు"

"పోనీలే ఈ సంబంధమైనా కుదిరితే ... "కామేశ్వరి చేతులు రెండూ జోడించి, తల పైకెత్తి కళ్ళు మూసుకుని, పెదవులతో ఏదో గొణుక్కోసాగింది. అది దేవుడిని ప్రార్థించడం కాబోలు.

వంటగది తలుపులకానుకుని అమ్మానాన్నల సంభాషణ వింటూ ఉంది నీరజ. ఆ




సంభాషణవల్ల తల్లిదండ్రులు సంతోషపడినంతగా తను సంతోషపడలేకపోతుంది. తను ఇప్పటికే ఐదారు పెళ్ళి చూపులకు అలంకరించుకుని వచ్చి మగపెళ్ళివారి ముందు, ఏదో ఘోరమైన నేరంచేసినట్టు తలదించుకుని కూర్చుంది. ఆ మగపెళ్ళివారు కూడా సంతలో పశువును చూసినట్టుగానే తనను నఖశిఖపర్యంతం పరిశీలనగా చూసి, 'మీ గొడ్డు పాలు ఎన్ని ఇస్తుంది?, ఎంత గడ్డి తింటుంది? అని అడిగినట్లు, 'మీ అమ్మాయికి వంట వచ్చా, సంగీతం వచ్చా, అని సదరు జంతువు యజమానిని ప్రశ్నించడమూ జరిగింది.ఈ విషయంలో ఆమెకు చాలా ఆశ్చర్యం వేసేది. ప్రపంచం మొత్తంలో ఎక్కడైనా – ఎప్పుడైనా జరిగేది ఏమిటంటే – 'వస్తువు'ను కొనుక్కునేవాడు, వస్తువును అమ్మేవాడిని ప్రశ్నిస్తాడు. కొనబోయే వస్తువుయొక్క గుణగణాలు అమ్మకందారుడిని అడిగి తెలుసుకుంటాడు. కాని ఈ దేశంలో పెళ్ళిళ్ల విషయంలో వరకట్నంకు సంబంధించి ఈ విషయం పూర్తిగా సిద్ధాంత వ్యతిరేకమయింది. 'పెళ్లికొడుకు' అనబడే వస్తువును కొనుక్కునే అమ్మాయి, ఆ పెళ్లి కొడుకే అడిగే వివరాలకు జవాబు చెప్పడం చాలా విచిత్రం. అంతకన్నా మించిన విచిత్రం మరోటుంది.

ఎక్కడైనా మనం ఒక వస్తువును కొంటే ఆ వస్తువును మన వెంట తీసుకువెళ్తాం. అయితే ఈ పెళ్లి తంతులో అమ్మబడిన వ్యక్తి వెంట కొనబడిన వ్యక్తి వెళ్లటం... ఎవరు నిర్మించారు ఇలాంటి సిద్ధాంత వ్యతిరేక సాంప్రదాయాలను? ఓహో! ఇది పురుషాధిక్యత సమాజం కాబట్టి, ఆ పురుషులే తమ స్వార్థప్రయోజనాలకు అనుగుణంగా ఒక రీజన్ అంటూ లేకుండా ఇలాంటి వికృత వ్యవస్థకు రూపకల్పన చేశారు. నిజంకదూ మరి ఈ పురుషాధిక్యతను ఎదిరించాలంటే స్త్రీ ఏంచేయాలి? ఎందరో మహానుభావులు ఎంతో చెప్పారు. ఆ మహాపురుషుల ఆలోచనలను ఆచరణలో పెడితే చాలు ఈ దేశంలోని స్త్రీల బ్రతుకులు ఎంతో బాగుపడతాయి.

ఐదారు సంబంధాలు వచ్చాయి, వివరాలన్నీ అడిగి తెలుసుకున్నాక 'అమ్మాయి నచ్చిందండీ'- ఇక కట్నకానుకల వివరాలు మాట్లాడుకుంటే...' అంటూ డబ్బు కోసం బేరసారాలు మొదలుపెట్టేవారు. నాన్నేమో పది పదిహేను వేలు మించి ఇవ్వలేననే వాడు. 'మా అబ్బాయికి ఫలానా ఊరు వారు పాతికవేలు ఇస్తామన్నారు. ఇంకో ఊరువాళ్లు ముప్పయి వేలు ఇస్తామన్నారు' అంటూ వచ్చిన వారు తమ బిడ్డ రేటెంతో చెప్పేవారు. నాన్న ఇస్తానన్న దానికి వారు అడిగే మొత్తాలకు ఒద్దిక కుదిరేది కాదు. తనకు తప్పిపోయిన సంబంధాలన్నీ కేవలం 'కట్నం' దగ్గర బేరం కుదరకనే...

వరుసగా వచ్చిన సంబంధాలన్నీ తప్పిపోవటంతో ఇప్పుడు రాబోయే సంబంధంకూడా ఆ సంఖ్యకు మరో అంకె కలపటంకోసమేనని ఆమె అభిప్రాయం. అందుకే వస్తున్న సంబంధంవల్ల పెద్దగా ఉత్సాహం చూపకుండా ఒకవిధంగా మూఢీగా ఉండిపోయింది.

ఆ క్షణం నీరజకు తొలి పెళ్లిచూపులు గుర్తుకు వచ్చాయి. మర్నాడు తనను చూడడానికి పెళ్లివారు వస్తున్నారనగానే ఆమె మనసు గాలిలో తేలిపోసాగింది. వస్తున్న రాకుమారుడు తన అందం, అణకువ చూసి 'భామా! నీకోసమే నేనింతకాలం వేచి ఉన్నది. నువ్వే నా కలలరాణివి.' ఇక నుండి నా జీవిత భాగస్వామివి' అంటాడనుకుంది. ఆ రాత్రంతా తనకు నిద్రపట్టలేదు. రాబోయే పెళ్లికొడుకు గురించిన ఆలోచనలే. అసలు పెళ్లి నిశ్చయమైపోయినట్టే అనుకుంది నీరజ. తన అందంవల్ల ఆమెకు అంత నమ్మకం.

అయితే ఆ మర్నాడు ఆమె కలలన్నీ కల్లలయిపోయాయి. ఈ లోకం యొక్క నగ్నస్వరూపం మొదటిసారిగా చూసిందామె. వచ్చిన పెళ్లికొడుకు కుర్చీలో ముభావంగా కూర్చుని తనవైపు ఓరచూపులు చూస్తుంటే, అతగాడి వెంట వచ్చిన బంధుజనానికి తను సమాధానాలు చెప్పలేక చచ్చింది. మొదటిసారిగా ఆమెకు పెళ్లికొడుకనే ఆ గంగిరెద్దుమీద విసుగేసింది. ఆ తర్వాత కట్నంకోసం వారు బేరసారాలు మొదలెట్టినప్పుడు మాత్రం తనెంతో ఆశ్చర్యపోయింది. డబ్బుకోసం మనుష్యులింతగా తాపత్రయపడతారా అనుకుంది. ఆ

డబ్బుకన్నా ముఖ్యంగా అమ్మాయి అందం, చదువు సంస్కారం చూడాల్సింది అనుకుంది. బట్! ఈ లోకంలో అన్నింటికన్నా అతి ముఖ్యమైనది డబ్బే అని నిరూపిస్తూ- డబ్బు విషయంలో రాజీ కుదరక వచ్చిన పెళ్లివారు వెళ్లిపోయారు. రాత్రంతా తన ఆలోచనలలో విహరించిన రాకుమారుడు 'డూడూ బసవన్న' లా వారి వెనుకే కదిలాడు.

అది ఆమె కలలకు తగిలిన మొదటి దెబ్బ. ఆ పిమ్మట వరుసగా రెండు, మూడు నాలుగు, ఐదు... దాంతో ఊహాలోకం నుండి వాస్తవిక ప్రపంచంలోనికి వచ్చి పడింది. రియలైజేషన్! కలలన్నీ చెల్లాచెదరయిన వాస్తవం! అందుకే పెళ్ళంటే ఆమెకు ఆసక్తిపోయింది. యాంత్రికత అలవాటయింది. అలా యాంత్రికంగానే మరునటిరోజు కృష్ణారావు తీసుకొచ్చిన సంబంధం ముందు తలదించుకుని కూర్చుంది.

ఎన్నిసార్లు ఓటమి ఎదురయినా, ప్రతి మనిషికీ మనసుమూలల ఎక్కడో చిరుఆశ ఉంటుంది. ఆమెలోనూ ఎక్కడో- ఏదో చిన్న ఆశ. ఈ సంబంధమయినా కుదిరితే బాగుండునని.

అయితే ఈసారి కూడా వచ్చిన వారు కట్నకానుకలకోసం బేరసారాలకు దిగేసరికి ఆమె నిరాశగా నవ్వుకుంది. పశువులకయినా కొన్ని మినహాయింపులు ఉంటాయేమోగాని, మనుష్యలలో ఎలాంటి ఎక్సెప్షన్స్ లేవు అనుకుంది. అందులోనూ డబ్బు విషయంలో- భూమి పరిభ్రమించేది డబ్బు చుట్టూనేమో!

అప్పటికే తన తండ్రి వారిని బ్రతిమలాడుతున్నాడు. "ఏమండీ! మీరు డబ్బు విషయంలో ఇంతగా పట్టుబట్టడం భావ్యంకాదేమో! మా అమ్మాయి చాలా అందమైనది. అపరంజి బొమ్మ"

"మీ అమ్మాయి అందమైనది కావచ్చు. అయితే మాత్రం ఆ అందాన్ని కొరుక్కుతింటామా ఏమిటి?" వెకిలిగా నవ్వుతూ జవాబొచ్చింది.

నీరజకు ఏడుపొచ్చింది.

ఆ సంబంధం కూడా డబ్బు తక్కువ కారణంగా కేన్సిలయింది. పాపం! ఆ సంబంధం తీసుకొచ్చిన కృష్ణారావు ఆ ఇంట్లోని వారివంక నూటిగా చూడలేక తలదించుకుని వెళ్లిపోయాడు.

ఆ ఇంట్లో గాఢమైన నిశ్శబ్దం. ఒకరినొకరు పలుకరించుకోవాలన్నా భయపెట్టేంత నిశ్శబ్దం.

సత్యనారాయణ మౌనంగా పెరట్లోనికి వెళ్లి వేపచెట్టు మొదట్లో కూర్చున్నాడు. మనసంతా గజిబిజిగా తయారయి ఉంది. ఏవో స్పష్టంగాని ఆలోచనలు. పది నిమిషాలు గడిచి ఉంటాయి.

అతడా ఆలోచనల మధ్య ఉండగానే నీరజ వచ్చింది ఆ చోటుకు. వచ్చి తండ్రి ఎదురుగా నిలబడింది.

చప్పుడుకు తలెత్తి చూశాడు సత్యనారాయణ. ఎదురుగా కూతురు కనుపించడంతో, తడబడి "ఏమ్మా నీరజా! ఏం కావాలి?" అన్నాడు.

"మీతో మాట్లాడాలి నాన్నా"

అతడు కూతురి ముఖంలోనికి పరీక్షగా చూసి, ఏదో విశేషం ఉంది అనుకున్నాడు. పక్కనే చోటుచూపిస్తూ "కూర్చోమ్మా" అన్నాడు. నీరజ తలూపి, తండ్రి పక్కనే ఒదిగి కూర్చుంది.

రెండు నిమిషాలసేపు ఇద్దరి మధ్యా మౌనం. కూతురు ఏమీ మాట్లాడకపోవటంచూసి అతడే అడిగాడు. "ఏమ్మా! ఏదో మాట్లాడాలన్నావు".

బహుశా ఆవేదనను అప్పటివరకూ అణచుకుని ఉందోమో, తండ్రి మాటతో ఆ ఆవేదన ఒక్కసారిగా బ్రద్ధలయింది. ఆమె వెక్కివెక్కి ఏడవసాగింది.

కూతురి దుఃఖం చూసి సత్యనారాయణ గాభరావడ్డాడు. వెంటనే తేరుకుని ఆమె తల మీద చెయ్యివేసి లాలనగా అడిగాడు. "నీరూ! ఎందుకమ్మా ఏడుస్తున్నావు" కంపిస్తున్న స్వరంతో ప్రశ్నించాడు.

అలా ప్రశ్నించాడేగాని ఆయన మనసులో కూతురి దుఃఖానికి కారణం లీలగా అర్థమవుతూనే ఉంది.

తండ్రి లాలనతో ఆమె పూర్తిగా కరిగిపో



యింది. భుజం మీద తలవాల్చి, మెడ చుట్టూ చేతులువేసి వెక్కుతూ చెప్పింది. "నాన్నా! నిజంగా నాకు పెళ్ళిచేసుకోవాలని లేదు. నాకింకెప్పుడూ ఇలా పెళ్ళిచూపులు ఏర్పాటు చేసి ఇంట్లో అందరినీ బాధపెట్టకండి నాన్నా"

"అదేమిటమ్మా, ఆడపిల్ల పెళ్ళిచేయడం నా బాధ్యత కదా?"

"పెళ్ళిచేయడం మీ బాధ్యతే నాన్నా! కాని... మన లేనితనం ఇలా ఉంది ! మనల్ని మనమే ఇలా బాధపెట్టుకోవడం ఎంతవరకూ భావ్యం మీరే చెప్పండి ! వాళ్ళు పెళ్ళిచూపుల కొస్తారు. ఏవేవో కోరికలు కోరుతారు. వారి గొంతెమ్మ కోరికలు తీర్చలేనప్పుడు మన లేనితనాన్ని అపమానిస్తూ వెళ్ళిపోతారు... ఇలా ఎన్నిసార్లని అవమానపడటం?... ఆలోచించండి నాన్నా! నేను మనసు చంపుకునయినా వచ్చినవారి ముందు తలవంచుకుని కూర్చోగలను. కాని ఏనాడూ ఎవరినీ, ఏమీ ఆశించని మీరు ఈ రోజు నాకోసం వారిని యాచకుడిలా బ్రతిమిలాడుకోవడం... వద్దు నాన్నా... అందుకే నేనింక జీవితాంతం పెళ్ళిచేసుకోదలచుకోలేదు..." చెపుతుంటే నీరజ కంఠం రుద్ధమయింది.

తనమీద తాను జాలిపడ్డాడు. అయితే ఏనాడూ అతడు తన దారిద్ర్యాన్ని అంతగా అసహ్యించుకోలేదు. చివరికి వడ్డీజలగ వీధిలో అల్లరిచేసినప్పుడు కూడా ఇంతగా వ్యధపడలేదు. కన్నకూతురు తండ్రి మీద జాలిపడి తనకుతానే స్వయంశిక్ష విధించుకోవడం ఏ తండ్రి మాత్రం భరించగలడు.

తక్షణం అతడి మనసులోని వేదనకు అక్షర రూపం ఇవ్వడం అసాధ్యం ! సత్యనారాయణ కూతురు చుట్టూ చేతులువేసి ఆప్యాయంగా నిమురుతూ ఉండిపోయాడు. ఆమె మాటలను ఖండించనూలేదూ- అంగీకరించనూ లేదు... అది ప్రస్తుతం అనవసరం.

అందుకే మౌనంలోనే వారిద్దరూ ఎదుటివారి మనసులోని వేదనను అర్థం చేసుకుంటూ, నిశ్శబ్దంలోనే, 'ఓదార్పు' పొందుతున్నారు.

* * *

ఆఫీసుకెళ్ళి తన సీట్లో కూర్చున్న పదినిముషాలకు ప్యూన్ వచ్చి "సార్ ! మిమ్మల్ని అయ్యగారు పిలుస్తున్నారు" అన్నాడు.

కుర్చీలోనుండి లేచి ఎదురుగా ఉన్న గదిలోకి వెళ్ళాడు సత్యనారాయణ. తాసిల్దారు పరంధామం ముఖం సీరియస్‌గా ఉంది. సత్యనారాయణను చూడడంతోనే పరంధామం ఆఫీసుకప్పు ఎగిరిపోయేలా అరవసాగాడు. తన ముందున్న ఫైలు అతడిముఖాన కొట్టినంత పనిచేసాడు.

"ఏమయ్యా సత్యం ! డ్రాఫ్టు వ్రాయడం ఇలాగేనా ఇందులో ఎన్ని తప్పులున్నాయో చూడు... అసలు మెదడు పెట్టి ఇక్కడ పనిచేస్తున్నావా- లేక తలలేకుండానే ఏదేదో గీసేస్తున్నావా !... ఇంతకాలం నుండి పనిచేస్తున్నావు ఎందుకయ్యా..." అంటూ దండకం చదవడం మొదలుపెట్టాడు. సత్యనారాయణ తలొంచుకున్నాడు.

అతడు నిన్నవ్రాసిన ఫైల్ తీసి తన ముందు కొట్టాడు పరంధామం. "...వెళ్ళవయ్యా ! వెళ్ళి ఆ డ్రాఫ్టు నీట్‌గా వ్రాయి...."

ఆ ఫైల్ అందుకుని గదిలో నుండి ఇవతలికి వచ్చేశాడు సత్యనారాయణ. ఆ గదిలో నుండి బయటకు వస్తుంటే అతడివంక కొందరు జాలిగా చూశారు. తల తీసేసినంత పనయింది.

అతడు తన సీట్లోనికి వచ్చి కూర్చుని డ్రాఫ్ట్ వ్రాయడం మొదలుపెట్టాడు. కొద్ది నిముషాల తర్వాత కృష్ణారావు వచ్చి అతడి పక్కన కూర్చుని అడిగాడు "ఏమిటీ ! పరంధామంగాడు నీ మీద అంతెత్తున ఎగిరిపడుతున్నాడు." సత్యనారాయణ వివరం చెప్పాడు.

అంతా విన్న కృష్ణారావు "నీకు బుద్ధిలేదోయ్ సత్యం ! లేకపోతే వాడు మాట్లాడుతుంటే నువ్వు తలొంచుకుని మూగిలా ఉండిపోవడమేమిటి" తలెత్తి 'ఏదో పొరపాటయింది- సరిదిద్దుకుని వస్తాను' అని చెప్పొచ్చుకదా ! నువ్వు అలా చెప్పవు. 'మెత్తగా ఉంటే మొత్తబుద్ధవుతుంది'. నీ మెతకతనం చూస్తే అతగాడికి అరవాలనిపిస్తుంది. ఇంట్లో పెళ్ళాం ముందు ఏమీ మాట్లాడలేక, ఆ కోపం ఆఫీసులో నీలాంటి నోరులేని వాళ్ళమీద తీర్చేసుకుంటుంటారు. నువ్వు కాబట్టి తలొంచుకు





న్నావు. అదే నన్ను అలా తిట్టిఉండమను మొహన్నే రెండు జాడించి ఇవతలికి వచ్చి ఉండేవాడిని... ఆఫీసరయితే మాత్రం ఎవడికేం భయం... అయినా ఈ ఆఫీసులో పనిచేసే వారు ఎవరు? ఎవరూ లేరు నువ్వుతప్ప. నువ్వుమాత్రం కష్టపడి పనిచేసికూడా తిట్లు తింటుంటావు... నీకు బ్రతకడం చేతకాదోయ్''.

అప్పటివరకూ కృష్ణారావు మాటలు వింటున్న పక్కసీటు రామ్మోహన్ ''మన సత్యనారాయణగారికి నిజంగానే బ్రతకడం ఎలాగో తెలియదు. తెలిసుంటే ఆ సీట్లో కూర్చుని ఉండడు... ఏ ఆఫీసరునో మాటలలో మభ్యపెట్టి పై సంపాదన వచ్చే సీట్లోనికి మారి ఉండును...

''ఊఁ... అదికూడానా! ఈయనగారికి ఎన్ని కష్టాలు ఉన్నా మళ్ళీకొన్ని ఆదర్శాలు ఏడ్చాయిలే! నీతి నియమాలు- న్యాయాన్యాయాలు అన్నీ గమనించి గాని అడుగువేయడు. తప్పో- ఒప్పో డబ్బు వస్తుంటే- అది అక్రమ సంపాదన కదా అని మోకాలడ్డంపెడతాడు...'' దీర్ఘంగా నిట్టూర్చాడు కృష్ణారావు.

ఆమాటతో రామ్మోహన్ పూర్తిగా వారివైపు తిరిగాడు. ''అదేమిటి?! తప్పయినా ఒప్పయినా, ఏ దారిన వచ్చినా మనకు కావలసింది డబ్బు. ఈ వ్యవస్థలో డబ్బు లేకపోతే ఎందుకూ కొరగాము. రోడ్డు పక్కన పోయే బిచ్చగాడికైనా పదిపైసలు వేస్తేనే గౌరవంగా సలాము చేస్తాడు. అవతలివాడు ఎంతపెద్ద ఆఫీసరయినా, మనం కాస్త దర్జాగా-టిప్‌టాప్‌గా ఉంటే మాట జారేందుకు కాస్త భయపడుతాడు... అంతేందుకు- చివరికి కట్టుకున్న పెళ్లామయినా మన డబ్బును చూసే మనల్ని గౌరవిస్తుంది. సుఖపెడుతుంది. నువ్వీ రాత్రికి ఎక్కడో ఒకచోట- ఏదోలాగా చేసి ఓ కొత్తచీర కొనుక్కెళ్ళు. అది చూసిన ఆమె ఎంతో సంతోషపడుతుంది. ఆ సంతోషంలో నిన్ను ఉక్కిరిబిక్కిరి చేసేస్తుంది. ఆ రాత్రి తనకై తాను వచ్చి కొత్తచీర కట్టుకున్న అందాలు తనే సొంతం చేస్తుంది... ఇవన్నీ చేస్తుందేగాని ఈ కొత్తచీరకు మీ దగ్గర డబ్బులెక్కడివి? అని మాత్రం ప్రశ్నించదు. ఇది సహజం... అందుకే నేనంటాను- సుఖంగా బ్రతకాలనుకునే మనిషి నీతినియమాలు గురించి ఆలోచించకుండా డబ్బు సంపాదించాలని. డబ్బు ఉంటే ఈ లోకంలోని ఎన్నో సుఖాలు మనసొంతం అవుతాయి. పామెల్లా బోర్డర్స్ దగ్గర నుంచి ఎగస్తా పద్మిని వరకూ అనుభవించొచ్చు. దేశవిదేశాలలోని గొప్ప గొప్ప వింతలు చూడొచ్చు. హొటళ్లలో లగ్జరీగా గడిపి, విమానాలలో జల్సాగా తిరిగి, క్లబ్బులులో కుషీ చేసి... అదీ జీవితమంటే! అసలు మనదీ ఒక బ్రతుకేనా- కుక్కల్లా, నక్కల్లా, ఆఫీసుల్లో గుమాస్తాల్లా...''

తలూపాడు కృష్ణారావు 'నిజమే' అనుకున్నాడు సత్యనారాయణ. 'రామ్మోహన్ చెప్పింది నిజమే! డబ్బు ఉంటే చాలా పొందవచ్చు. ఎన్నో సుఖాలు అనుభవించవచ్చు. ఆ సుఖాలు అనుభవం కోసమేకదూ- ఎంతో మంది నీతినియమాలు వదిలేసి డబ్బువేటలో పడి ఉంటారు! డబ్బు విలువ తెలిసినవ్వాడెవడూ నీతినియమాల కోసం ప్రాకులాడడు. డబ్బు రుచి తెలిసిన మనిషి, మనిషిరక్తం రుచి తెలిసిన పులి ఒక్కటే! అందుకేగా వేలకోట్ల రూపాయలు సంపాదించిన పారిశ్రామికవేత్తలు కూడా, అక్రమ మార్గం ద్వారా మరిన్ని కోట్లు పోగుచేసేందుకు తాపత్రయపడుతుంటారు... తనది లేట్ రియలైజేషన్' అనుకుంటూ నిట్టూర్చాడు అతడు.

అంతలో అటుగా ఎవరో రావడంతో టాపిక్ కట్ అయింది. సత్యనారాయణ తిరిగి డ్రాఫ్ట్ వ్రాయడం మొదలుపెట్టాడు.

మధ్యాహ్నంకు పూర్తయ్యిందది. తీసుకెళ్ళి పరంధామం ముందుపెడితే ''హుఁ! ఇక నువెళ్ళు'' అన్నాడు.

మౌనంగా తిరిగి వచ్చేసాడు సత్యనారాయణ. వస్తుంటే అతడి మనసుకు అనిపించింది 'నేనింత న్యాయంగా, సిన్సియర్‌గా వర్క్ చేస్తున్నానే- ఆ పరంధామం నాలోని సిన్సియారిటీని గుర్తించడెందుకని? నాలోని మంచితనం గమనించడెందుకని? నా యొక్క నీతినిజాయితీలు పట్టించుకోడు ఎందుకని... తనను అందరితోపాటే కలిపేస్తాడు. గుర్రం. గాడిద ఒకటిలానే భావించినట్టు నటిస్తాడు... ఏమిటీ మనుష్యులు మనస్తత్వం...'

ఈ మనుష్యుల మనస్తత్వం ఏమిటంటే- ఎదుటివారు నిర్మల హృదయులైనంత మాత్రాన వారు గౌరవించరు; వారికి కావల సింది అంతర్‌సౌందర్యం కాదు, బాహ్యరూపం. ఠీవిగా, దర్పంగా, దర్జాగా ఉంటే చాలు, లేని గౌరవం పుట్టుకొస్తుంది. అలాగే ఎదుటివాడు నీతి నిజాయితీగలవాడు కదా అని ఆలోచించ రు. తమకెంతవరకూ ఉపయోగపడగలడా అని మాత్రమే అంచనాలు వేసుకుంటుంటా రు... ఈ లోకమంతా వ్యాపార బంధాలతో అల్లుకుని ఉంది.

ఇది సత్యనారాయణకు తెలియకపోవడం అతడి తప్పుకాదు. అతడి లోకజ్ఞానం ఆ స్థాయిలోనే ఉంది.



ప్రక్క ఊళ్ళో బంధువులొకరిది గృహప్ర వేశం ఉంటే వేకువనే బయలుదేరాడు సత్యనా రాయణ.

బస్టాండుకు చేరుకున్నాక జేబు తడుము కుని, అందులో ఉన్నది యాభై రూపాయల కాగితం అని గుర్తు చేసుకున్నాడు. అంత వేకువనే ఆర్.టి.సి. కండక్టర్‌కి యాభై రూపా యల కాగితం ఇస్తే, చిల్లర ఉన్నా ఇచ్చేందుకు విసుక్కుంటాడు. ఒకవేళ చిల్లర లేకపోతే బస్సు దిగేయ్యమన్నా ఆశ్చర్యం లేదు! ఎందుకొచ్చిన గొడవలే అనుకుని పక్కనే ఉన్న కిళ్లీబంకు దగ్గరకెళ్లాడు. షాపు లోని వ్యక్తిని చూసే అతగాడు, తను చిల్లర అడిగితే; 'భలే బేరం తగిలింది మొదటే' అని తనను చూసి విసుక్కోవచ్చు. అందుకే ఏం చేద్దామా ! అని పక్కగా నిలబడి బంకులోని వస్తువుల వంక చూడసాగాడు అతడు. కిళ్లీలు- అలవాటులేదు. సిగిరెట్ తాగి ఎరుగడు. చాక్లెట్లు, బిస్కెట్లు అనవసరం! మరేం కొందామా అని ఆలోచిస్తుంటే సీసాలకు ముందు వరుసగా పేర్చి ఉన్న లాటరీ టిక్కెట్లు కనిపించాయి. తనకెప్పుడూ లాటరీ టిక్కెట్లు కొనడం అలవాటులేదు. అలా అని అవంటే అసహ్యమూ లేదు. ప్రస్తుతం అదృష్టం మీద ఆశతోకాక, అవసరార్థం కొనాలనుకున్నాడు. ఆ ఆలోచన రాగానే జేబులో నుంచి యాభై రూపా యల కాగితం తీసి షాపువాడికి ఇచ్చి "రెండు లాటరీ టిక్కెట్లు ఇవ్వబ్బాయ్" అన్నాడు.

అతగాడు ఆ యాభై రూపాయల కాగితం వంక అదోలా చూసి "ఏ రాష్ట్రానివి సార్?" అని ప్రశ్నించాడు.

"ఏదో రాష్ట్రానివి అయిదు రూపాయలు నీకు దక్కి- నలభై అయిదు రూపాయలు నాకు అందేలా చెయ్యి చాలు" అంటూ నవ్వాడత ను.

'చిల్లర ప్రాబ్లెమ్' అని అర్థమయింది షాపు వాడికి "అలాగే సార్! ఒకటి రాజస్థాన్ బంపర్, రెండోది భాగ్యలక్ష్మి బంపర్ ఇస్తాను" అని రెండు లాటరీ టిక్కెట్లు తీసి అతడికి అందించాడు.

ఆ టిక్కెట్లను జేబులో పెట్టుకుని, షాపువాడి చ్చిన మిగతా డబ్బు అందుకున్నాడు. వెళ్లి బస్సులో కూర్చున్నాడు.

ఊళ్ళో దిగేసరికి తన బంధుజనమంతా కని పించారు. వారంతా రాత్రే ఆ ఊరికి చేరుకున్న ట్టుంది. వచ్చినవారిలో రాజేశ్వరి కూడా ఉంది.

అతడిని చూడడంతోనే ఆమె దగ్గరగా వచ్చి పలకరించింది. బంధువులందరి కుశల ప్రశ్నలయ్యాక, ఎవరితోనో కాలక్షేపం మాటలు మాట్లాడుతూ కూర్చున్నాడు. ఆ తర్వాత కార్య క్రమం మొదలయింది.

పాతఇంటి నుండి కొత్త ఇంటికి మేళతాళా లతో బయలుదేరారు. ఇంటి దగ్గర పురోహితు డు ఇంటిపెద్దలిద్దరినీ పీటల మీద కూర్చోబెట్టి పూజాకార్యక్రమాలు పూర్తిచేయించాడు.

టిఫిన్ తినేప్పుడు తన పక్కనే కూర్చున్న రాజేశ్వరి, తనతో నీరజ పెళ్లి విషయమేమ





యినా అడుగుతుందేమోనని ఎదురుచూశాడు అతడు. అప్పుడయినా మేనకోడలిని కోడలుగా చేసుకుంటానని హామీ ఇస్తుందేమోనని ఆశించాడు. కాని ఆమె ఆ ప్రస్తావనే తీసుకురా లేదు.

మధ్యాహ్నం భోజనాలయ్యాక తిరుగు ప్రయాణమయ్యాడు. రాజేశ్వరి కూడా వెంట బయలుదేరింది. బస్సులో ఇద్దరికీ తనే టిక్కెట్ తీసుకున్నాడు. బస్టాండ్‌లో దిగాక ఇంటికి రమ్మని పిలిస్తే, కాదు 'పని ఉంది' అంటూ బస్సెక్కి వెళ్లిపోయింది రాజేశ్వరి.

కాళ్లీడ్చుకుంటూ ఇంటికి చేరాడు సత్యనారాయణ.

కామేశ్వరి ఎదురొచ్చి అడిగింది "కార్యం బాగా జరిగిందా?"

"బాగానే జరిగింది"

ఆమె ఉత్సాహంగా వివరాలడుగుతూ ఉంటే, అన్నింటికీ జవాబు చెప్పాడు అతడు.

అన్ని వివరాలూ విన్న తర్వాత వంటగదిలోకి వెళ్లి పదినిమిషాల తర్వాత కాఫీ కప్పుతో వచ్చిందామె. భార్య చేతిలోని కాఫీ గ్లాసు అందుకున్నాడు సత్యనారాయణ.

కొద్దిసేపు తర్వాత ఏదో చీకాకుగా అనిపిస్తే, లేచివెళ్లి స్నానం చేశాడు. వరండాలోనికి వచ్చి వాలుకుర్చీలో కూర్చోబోతూ, ప్రశాంతత కోసం ఏదైనా చదువుకుందామని నీరజ టేబుల్ దగ్గరకువెళ్లాడు. నీరజ లైబ్రరీ నుండి, పక్కింటి స్నేహితురాళ్ళ నుండీ రకరకాల పుస్తకాలు తెచ్చుకుని చదువుకుంటూ ఉంటుంది. అన్నీ కాలక్షేపం పుస్తకాలే.

టేబుల్ మీద ఉన్న ఓ లావుపాటి పుస్తకం చేతిలోనికి తీసుకున్నాడు అతడు. ఏదో కొత్త నవల తీసుకుని వచ్చి వాలుకుర్చీలో కూర్చుని చదవడం మొదలుపెట్టాడు.

అదో హైక్లాస్ నవల. వళ్లుబలిసి, లగ్జరీగా బ్రతికేందుకు అడ్డదారులుతొక్కి గ్లామర్ ప్రపంచం ఇరుక్కుపోయిన ఒక రంగంలోని స్త్రీలను విశ్లేషించి రాసింది. తమాషా ఏమిటంటే రచయిత అదో జాతీయ సమస్యలా, ఆ సమస్యవల్ల ప్రజలంతా తిరగబడకపోతే ఆ 'వందమంది' స్త్రీలు ఏమైపోతారా అన్నంత ఆతృత వ్యక్తం చేస్తాడు. ఆ వళ్లుకొవ్వెక్కిన వారిపట్ల విపరీతమైన ఆవేదనను కనుపరుస్తాడు. కన్నీటిధారలు కురిపిస్తాడు. చదివేవారికి అదంతా హిపోక్రసీ అని తెలుస్తూనే ఉంటుంది. అయినా ఆ రచయితకు పాఠకులు మేము మీ అభిమానులం అని ఉత్తరాల వర్షం కురిపిస్తూ ఉంటారు. ఆ రచయిత ఆ ఉత్తరాలు చూసుకుని 'ఆహా, నాకెంతమంది అభిమానులున్నారోగదా' అని పొంగిపోతుంటారు. దాంతో ఆ తరహా నవలలు మరిన్ని సృష్టించి దేశం మీదకు వదులుతాడు...జీవిత స్పర్శ ఏమాత్రం తెలియని రచయితలు వేరు. సగటు మనిషి జీవితంలోనికి ఏనాడైనా తొంగి చూసి, కొద్దిక్షణాలపాటు వారి గురించి ఆలోచించి ఉంటే అప్పుడు తెలిసిఉండేది- అసలైన జాతీయ సమస్యలన్నవి ఏమిటో! నిజమైన కష్టాలు ఎలా ఉంటాయో!

ఆ క్షణం అతడికి 'అసమర్థుని జీవితయాత్ర' గుర్తుకు వచ్చింది. ఎందుకో ఈ క్షణం ఆ పుస్తకం మరోసారి చదవగలిగితే బాగుంటుందనిపించింది. ఎందుకో ఆ నవలలో తన జీవిత పాత్రను తొంగి చూసుకోవచ్చనిపించింది. సామాన్యుడు తనను తాను ఐడింటిఫై చేసుకోగలిగినదే మంచి నవల. కాలక్షేపం నవలలు చదవడం రాయడం తప్పనికాదుగాని, సదరు రచయిత అవే కళాఖండాలని చంకలు గుద్దుకుంటూ 'సామాజికస్పృహ' అనే పదాన్ని గేలి చేయడం దెయ్యాలు నీతులు వల్లించినట్టుంటుంది.

విసుగేసి పుస్తకం పక్కనపడేశాడు. కుర్చీలో వెనక్కువాలి కళ్లుమూసుకున్నాడు.

కమర్షియల్ నవలలో చూపించినంత డ్రామా మనిషి జీవితంలో ఉండదు. కాని మనిషి జీవితంలో కూడా కొంత డ్రామా ఉంది. ఒక్కొక్కసారి ఎవరూ ఊహించని అద్భుతాలు జరుగుతుంటాయి మనిషి జీవితంలో. దాంతో ఆ వ్యక్తి జీవితంలో గొప్పమలుపులు మొదలవుతాయి.

సత్యనారాయణకు లాటరీ తగలడం కూడా ఒక అద్భుతమే!

★ ★ ★

ఆరోజు ఆఫీసులో పేపర్ తిరగేస్తుంటే, తన జేబులోని లాటరీ టిక్కెట్లు గుర్తుకు వచ్చాయి. రిజల్ట్స్ ఆ పేపర్లో ఉండి ఉండాలి.

లాటరీ టిక్కెట్లు చేతిలోనికి తీసుకుని పేపర్ తిప్పసాగాడు. ఒకపేజీలో వరుసగా కనిపించాయి. లాటరీ ఫలితాలు.

లక్షలు కాకపోయినా కనీసం పదో అయిదో తగిలుండకపోతుందా అన్న చిరు ఆశ అతడిలో ఉంది.

భాగ్యలక్ష్మీ బంపర్- తన చేతిలోని టిక్కెట్ నెంబర్ వెతుక్కుంటూ వెళితే ఎక్కడా ఆ నెంబర్ కనిపించలేదు.

ఆ టిక్కెట్ మడిచి జేబులో పెట్టుకుని, మరో టిక్కెట్ వంకచూశాడు.

రాజస్థాన్ బంపర్!

యధాలావంగా నెంబర్ చూసుకుని, కింది నుండి పైకి నెంబర్లు వెతుక్కుంటూ వెళ్లసాగాడు.



పది , యాభై , వంద , వెయ్యి, పదివేలు, లక్ష రెండవ బహుమతి ఏడులక్షలు...

చేతిలోని టిక్కెట్ నెంబర్ వంకా, పేపర్ లోని ద్వితీయ బహుమతి నెంబర్‌వంకా మార్చి



మార్చి చూశాడు. జీవితంలో అతడు ఎప్పుడు గూడా అంతటి ఎగ్జయిట్‌మెంట్ అనుభవించి ఎరుగడు. అతను తన కళ్లను తానే నమ్మలేక పోయాడు. కళ్లు నులుముకుని మరోసారి ఆ నెంబర్‌వంక చూశాడు. కనీసం ఒక అంకె అయినా పొరపాటుందేమోనని పరికించి చూశాడు. లేదు... అంతా సరిపోయింది.

అప్పుడు... అప్పుడు అతడికి కలిగిన ఆనందం... నాటుపడవలో సముద్రంలోపడి ప్రాణాలు కోల్పోయేస్థితిలో, స్వప్నంలోలా హెలికాప్టర్‌లోనికి ఎక్కించబడితే...!

అతడు పెద్దగా అరిచేశాడు. ''కృష్ణా! నాకు... నాకు లాటరీలో ఏడు లక్షలు తగిలింది...''

ఆఫీసులోని జనమంతా ఒక్కసారిగా అటు చూశారు. మొదట సత్యనారాయణ చెప్పింది జోకేమో అనుకున్నారు. తర్వాత పిచ్చిపట్టి అరిచాడేమో అనిపించింది. అయినా అతడు ఎలాంటి స్థితిలోనూ తొణకనివ్యక్తి కావడంతో అనుమానం వచ్చి అందరూ ఆ టేబుల్ చుట్టూ మూగారు. కృష్ణారావు అతడి చేతిలోని లాటరీ టిక్కెట్ తీసుకుని, పేపర్‌లోని నెంబర్‌తో టాలీ చేశాడు. సరిపోయింది. ఒక వేళ అచ్చుతప్పేమోనని మరో పేపర్ తెప్పించి చూశారు. అందులోనూ ఇదేనెంబర్. అందరి ముఖాలలో ఆనందాశ్చర్యాలు... అయినా అప్పటికీ అందరికీ అనుమానమే.

''ఎందుకయినా మంచిది! లాటరీ ఏజంట్ దగ్గర గవర్నమెంట్ గెజిట్‌కాపీ ఉంటుంది. అందులో సరిచూసుకుంటే ఏ అనుమానమూ ఉండదు'' అన్నాడు కృష్ణారావు.

ముగ్గురు, నలుగురు కలిసి సైకిళ్లమీద లాటరీ ఏజెంట్ ఆఫీను వెతుక్కుంటూ వెళితే, ఆ ఆఫీసులో అప్పటికే చాలా సందడిగా వుంది. వీరు వెళ్లి తాము వచ్చిన వివరం చెపితే, ఏజంట్ రాచమర్యాదలుచేసి, ''మేమూ మీ కోసమే ఎదురు చూస్తున్నాం'' అన్నాడు.

ఆ మాటతోనే విషయం అర్థమయిపోయింది వారందరికీ. ఇక అనుమానం ఏమాత్రంలేదు. తర్వాత జరగవలసిన పనులు వరుసగా, అతడి ప్రమేయం, కష్టం లేకుండానే జరిగిపోయాయి. బాంక్‌కి వెళ్లడం- మేనేజర్‌ని కలువడం, బాంక్‌లో డిపాజిట్, టాక్స్, అవీ ఇవీ అన్నీ పూర్తయిపోయాయి.

జరుగుతున్నదంతా కలలోలా వుంది సత్యనారాయణకు. అతడికి ఎంతకీ నమ్మకం కుదరటంలేదు. ఆ డబ్బు తన చేతికి వస్తుందని ఏమాత్రం నమ్మకం లేదు. తనలాంటి దురదృష్టవంతుడికేమిటీ- ఏడు లక్షలు రావడం ఏమిటి... ఎక్కడో ఏదో పొరపాటు జరిగి వుంటుంది.

బాంక్‌లో మొదటి మొత్తం డ్రా చేసినంతవరకూ అతడికి తన అదృష్టంమీద ఎంతో అనుమానం. తొలిసారిగా పదివేలు డ్రా చేసినప్పుడు... అప్పుడు అనిపించింది- జరిగింది కల్ల కాదు నిజమేనని!

★ ★ ★

సత్యనారాయణ ఇప్పుడు లక్షాధికారి.

వారు ఇల్లు మారలేదుగాని, ఉన్న ఇంటి రూపురేఖలు మాత్రం పూర్తిగా మారిపోయాయి. ఇంట్లోనికి కొత్త హంగులు వచ్చిచేరాయి. డోర్‌కర్టెన్స్, ఫ్యాన్లు, కలర్ టి.వి, గ్యాస్ స్టౌ, కుక్కర్లు- అవీ ఇవీ చేరి ఇంటెడు సామానయింది. లాటరీ డబ్బు రాగానే కామేశ్వరి చేసిన మొదటిపని- భర్తగారిని అడిగి పాతికవేలతో ఆ సామానూ, ఈ సామానూ కొనిపించటం. సామానుకొనే విషయమై చర్చించేటప్పుడు ఆవిడ భర్తకు ఏనాడూ ఇవ్వనంతగా గౌరవమర్యాదలు, ఎప్పుడూ చూపించతనంతగా ప్రేమాభిమానాలు ప్రదర్శించింది. తన చేతికి డబ్బు వచ్చిన తర్వాత ఎదురయిన మొదటి సన్నివేశానికే సత్యనారాయణ కళ్లు తెల్లబడ్డాయి. భార్యలో వచ్చిన హఠాత్ పరిణామం అతడిని ఆశ్చర్యంలో ముంచింది. అటువంటి గౌరవ మర్యాదలు, ప్రేమాభిమానాలు అతడు మున్నెన్నడూ ఎరుగనివి. పెళ్లయిన కొత్తలో కూడా కామేశ్వరి అంతగా ఆప్యాయత చూపించేదికాదు! మరి ఆమెకు ఆకస్మికంగా ఇలాంటి అభిమానం ఎలా పుట్టుకొచ్చింది... జవాబుగా తనకు తోచిన పదం- డబ్బు!

అవునూ! డబ్బు మాత్రమే తనకు ఏనాడూ లభ్యంకాని భార్య ప్రేమాభిమానాలు లభ్యమయ్యేలా చేస్తుందంటే 'కాఫీ తెచ్చి




ఇచ్చేందుకు కూడా విసుక్కునే భార్యామణి "అది కాదండీ- ఇది కాదండీ" అంటూ గౌరవ మర్యాదలతో హొయలుపోతూ వగలు కురి పిస్తుందంటే... జీవితాంతం కలిసివుండే అర్ధాంగి దగ్గర కూడా కేవలం వ్యక్తిగా తనమీద ప్రత్యేకభావం ఏమీలేదా? గౌరవమర్యాదలు, ప్రేమాభిమానాలు కేవలం డబ్బు ద్వారానే లభ్యమా...? ఒక మనిషిని ఏవిలువలూ లేకుండా వస్తుబంధరహితంగా రోడ్లో నిలబ డితే ఆ వ్యక్తికి ఈ సమాజం ఇచ్చే గౌరవం ఏపాటిది? ఏ మనిషికయినా 'వ్యక్తి'గా తన కంటూ ప్రత్యేక విలువ ఏముండదు. వ్యక్తి విలువ అతడి ప్రస్ఫుటమైన తెలివి, వెనక వున్న పదార్థవిలువలమీద ఆధారపడి వుంటుంది... భార్యలోని మరో మనిషిని దర్శించడంతో, ఆమెను మరో కోణంలో మొద టిసారిగా పరిశీలించటంతో... అతడిలో ఏదో అసంతృప్తి మొదలయింది. లోకంపోకడ, మనుష్య సంబంధాల నిజాలు తెలిసిన ప్రతిఒ క్కరికీ మనసులో ఏదో అసంతృప్తి మొదల వటం సహజం. పాతకాలంలో కొంతమంది రాజులు, సామాన్యులు భవబంధాలు వదులు కుని అడవులకు ఎందుకెళ్లేవారంటే జస్ట్ ఇలాంటి రియలైజేషనే కారణం. కాని నేటి మానవుడు ఆవిధంగా ఎందుకు చేయలేకు న్నాడంటే ఈ స్పీడ్‌యుగంలో సాటిమను ష్యుల తత్వాలపట్ల పరిశీలనా శక్తి తగ్గింది. మనిషి అడ్జస్టుకావడం నేర్చుకున్నాడు.

సత్యనారాయణ కూడా తనలోని అసంతృప్తి భావాన్ని కప్పెట్టే ప్రయత్నంచేసి అందులో సఫలీకృతుడయ్యాడు.

పోతే ఆ ఇంట్లో హంగులే కాదు అంతక న్నా విలువయినది మరోటి వచ్చిచేరింది. అదే కళ!

ఆ ఇంటిలోని నలుగురు వ్యక్తుల ముఖా లలో చిరునవ్వు, సంతోషం కదలాడసాగింది. ముఖంలో సంతోషం, పెదాలు మీది చిరునవ్వే కదా ఇంటిని కళాకాంతులతో నింపేది.

ఈ ప్రపంచంలో చాలామందికి డబ్బు ఉంది. కాని వారంతా సంతోషంగా ఉన్నారా అంటే! ఉండి ఉండకపోవచ్చు. అయితే, కొత్తగా వచ్చి చేరిన డబ్బు సత్యనారాయణ కుటుంబాన్ని సంతోషపెట్టింది. ముఖాలలోనికి కళవచ్చేలా చేసింది.

నిన్నటివరకూ కట్నం ఇచ్చుకోలేని తండ్రి అసమర్థత కారణంగా, తనకిక పెళ్ళికా దేమోనని నిరాశపడ్డ ఆడపిల్ల, ఆ తండ్రీ ఇప్పుడు లక్షరూపాయలైనా కట్నంగా ఇచ్చి పెళ్ళిచేయగలడని తెలిసీ— తన పెళ్ళి ఖచ్చితంగా జరుగుతుందని నిర్ధారణయ్యాక సంతోషపడకుండా ఉంటుందా? అలాగే నిరుద్యోగ సముద్రంలో దిక్కూదరి తోచక, భవి ష్యత్ ఏమిటో అర్థంకాక అల్లాడిపోయే అబ్బా యికి, తనకిక ఉద్యోగం రాకపోయినా పర్వాలే దు - ఏదో వ్యాపారం చేసుకోగలనని ధీమా ఏర్పడితే ఆనందించకుండా ఉంటాడా? ఇంకా దుబారా మనిషయినా, ప్రతిదానికీ వెతుక్కునే ఆ ఇల్లాలు, ఇకనుండి 'చేతినిండా' ఉంటుందని తెలిస్తే సంతోషపడకుండా ఉంటుందా? మరి అప్పులు, డబ్బులేక ఆగిన కూతురిపెళ్ళి, లంచం ఇవ్వకపోవడంతో రాని కొడుకు ఉద్యోగం, ఇంట్లో సమస్యలు అన్నీ ఒక్కరోజుతో తీరిపోతే అతడుమాత్రం ఆనందపడడా?!... ఆ ఆనందమే ఆ ఇంట్లో 'కళ'ను తెచ్చిపెట్టింది. ఒక్కసారిగా డబ్బు రావడంతో ఆ ఇంట్లో డబ్బుతో ముడిపడినవారి సమస్యలన్నీ తీరిపోయాయి. కాని ఇంకా 'డబ్బు' వెనుక ఉండే సమస్యలేవీ ముందుకు రాలేదు. 'డబ్బు' వెనుక ఏం సమస్యలున్నా యంటే , తప్పకుండా ఉన్నాయి. అలా డబ్బువెనుక సమస్యలే లేకుండా ఉండి ఉన్న ట్లయితే, ఈ లోకంలోని డబ్బు ఉన్నవారంద రూ సుఖసంతోషాలతో కాలంగడపరూ... మరి డబ్బు ఉన్నవారికి కూడా కష్టాలు, సమస్యలూ ఉన్నాయి కదా!

ఆరోజు ఆఫీసుకు బయలుదేరాడు సత్యనా రాయణ. 'ఆఫీసుకు వెళ్తానంటే' కామేశ్వరి అతడివంక వింతగాచూసి "ఇంకా ఎందుకూ ఆ వెధవ ఉద్యోగం మానేయకూడదూ" అంది.

అతడు చిరునవ్వు నవ్వాడు. జవాబు చెప్ప లేదు.

ఆఫీసుకు వెళ్ళి లోపలికి అడుగుపెడితే, స్టాఫ్ అంతా అతడివంక ఆశ్చర్యంగా చూశారు.



ఒకరిద్దరు "ఏం గురూ! మమ్మల్ని చూసివెళ్దామని వచ్చావా" అని ప్రశ్నించారు కూడా.

అతడు తల అడ్డంగా ఊపి "లేదు. డ్యూటీలో జాయినయ్యాను" అన్నాడు.

వారు మరింత ఆశ్చర్యపోయి "ఇంకా ఎందుకు గురూ నీకీ వెట్టిచాకిరీ— ఇక నుండి హాయిగా లైఫ్‌ని ఎంజాయ్ చేయకూడదూ?" అన్నారు.

సత్యనారాయణ బదులు పలకకుండా, వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు. ఫైల్స్ ముందేసుకున్నాడు.

కొద్దిసేపటి తర్వాత వచ్చిన కృష్ణారావు అతడిని చూసి పలకరించాడు. "ఏం సత్యం! మళ్ళీ ఈ డ్యూటీయేనా?"

తలూపాడు సత్యనారాయణ

"వచ్చిన డబ్బుతో ఏదయినా ఇండ్రస్ట్రీ పెట్టేందుకు ప్రయత్నించకూడదూ?"

"అలాంటివి నాకిష్టంలేదు. ఈ ఉద్యోగం చేయటమే నాకిష్టం" చెప్పాడు అతడు.

కృష్ణారావు తిరిగి రెట్టించలేదు. మిత్రుని మనస్తత్వం తెలిసినవాడు కావటంతో మౌనంగా ఉండి, కాసేపు తర్వాత తన సీట్లోకి వెళ్ళిపోయాడు.

సత్యనారాయణ తన వర్క్ చేసుకుంటుంటే, పరంధామం దగ్గర నుండి పిలుపువచ్చింది.

లేచి ఆయన రూమ్‌లోనికి వెళ్లాడు అతడు. పరంధామం సాదరంగా ఆహ్వానించారు అతడిని.

"రావోయ్ సత్యం! రారా" అంటూ కుర్చీ చూపించాడు.

కాస్త ఇబ్బందికరంగా ఫీలయి, ఆయన బలవంతంచేయడంతో ఇక తప్పనిసరై కుర్చీలో కూర్చునాడు.

"ఏమిటి విశేషాలూ?" నవ్వుతూ అడిగాడు పరంధామం.

ఏముంటాయి విశేషాలు?!... తనకు లాటరీ తగలడం ఒక విశేషం. అది ఎలాగూ అందరకూ తెలిసిన విశేషమే. ఇక తెలియనివీ, ఆయనకు చెప్పదగిన విశేషాలు ఏమున్నాయి?... ఆ(! అనుకోదగిన విశేషం ఏమిటంటే! ఈ పరంధామం తననిలా సాదరంగా ఆహ్వానించి, పలకరించడం. లేకపోతే అమిత గర్విష్టిగా, ఎప్పుడూ చిర్రుబుర్రులాడుతుండే ఆఫీసరు వెధవ, ఆఫ్టాల్ ఒక క్లర్క్‌ను కూర్చోబెట్టి మర్యాదలు జరపడం గొప్ప విశేషమే. కాని ఈ విశేషం ఆ వ్యక్తికి చెప్పదగిందికాదు..." అందుకే అతడు నిశ్శబ్దంగా నవ్వి "విశేషాలు ఏమున్నాయి సార్" అన్నాడు.

"అవునవునూ!" అంటూ పరంధామం కూడా వెకిలిగా నవ్వాడు. ఇద్దరిమధ్యా కొద్దిక్షణాల నిశ్శబ్దం.

"అవునూ! ఇంతకీ నువ్వు ఈ ఉద్యోగం కంటిన్యూ చేస్తావా? లేక రిజైన్‌చేస్తావా?"

"లేదు సార్! కంటిన్యూ చేయదలచుకున్నాను".

ఆయన అదోలా నవ్వాడు. "ఇంకా నీకీ డబ్బులు ఎందుకోయ్?... ఆఫ్టాల్ పదమూడు వందలు. లక్షరూపాయలకు నెలకు వడ్డీఅంత కూడా లేదు..."

"కావచ్చు...కానీ కూర్చుని తినడం ఏమంత బాగుండదు కదా!"

"అదీ నిజమే!" అని ఆగి అన్నట్టు "నీకెంతమంది పిల్లలు?... ఇద్దరేకదూ? ఒక అబ్బాయి డిగ్రీ చదివి జాబ్‌కోసం ఎదురుచూస్తున్నట్టుగా ఒకసారి చెప్పావు. యామై కరక్ట్?"

తలూపాడు సత్యనారాయణ.

"ఇంతవరకూ అతడికి జాబ్ రాలేదా?"

"పరీక్షలకూ ఇంటర్వ్యూలకు అటెండ్ అవుతున్నాడు. త్వరలో ఏదోఒక ఉద్యోగం సంపాదించగలడనే అనుకుంటున్నాను నేను"

పరంధామం తలాడించాడు.

తర్వాత ప్యూన్‌ని పిలిచి కాఫీ తెప్పించాడు. తానే కాఫీని చేతికి అందించాడు పరంధామం.

ఆయన తనకెందుకు అలాంటి అతిథి మర్యాదలు చేస్తున్నాడో సత్యనారాయణకు అర్థంకాలేదు.

కొద్దిసేపు అవీ ఇవీ మాట్లాడాక సత్యనారాయణ అక్కడనుండి లేచి వచ్చేశాడు. తన సీట్లోకి వచ్చి కూర్చున్నా- అదే ఆలోచన!... పరంధామం ప్రవర్తన ఒక్కసారిగా ఇలా





ఎందుకు మారింది?!

లంచ్ టైమ్‌లో కృష్ణారావు పక్కన కూర్చుని మాట్లాడించాడు. "ఉదయం మన పరంధామం నిన్ను రూమ్‌లోనికి పిలిచి, ఏదో గుసగుసగా మాట్లాడుతున్నాడే ఏమిటి విశేషం?"

సత్యనారాయణ తమిద్దరిమధ్యా జరిగిన సంభాషణ మొత్తం పూసగుచ్చినట్టుగా కృష్ణా రావుకి వివరించాడు.

అంతా విన్న తర్వాత కృష్ణారావు సన్నగా నవ్వాడు. "అయితే మనవాడు నీకు గాలం వేస్తున్నాడన్నమాట"

అతడికి ఆ మాటలలోని ఆంతర్యం ఏమీ బోధపడలేదు. మిత్రుడివంక అయోమయంగా చూసి- "గాలం వేయడమేమిటి?" అంటూ ప్రశ్నార్థకంగా ముఖం పెట్టాడు.

"పిచ్చివాడా! తెప్పలుగా చెరువు నిండిన కప్పలు పదివేలు కదరా... అన్న సామెత నువ్వు మర్చిపోయోవేమో! ఆ కప్పలలో పరంధామం కూడా ఒక కప్ప... ఇప్పుడు నీ కొడుకు లక్షాధికారి బిడ్డ. ఉద్యోగంకోసం ఎదురు చూస్తున్నాడు. ఒకవేళ ఉద్యోగం రాకపోయినా, వ్యాపారమైనా చేసుకు బతకగల స్తోమత ఉంది. ఒక ఆడపిల్ల తండ్రికి అంతకన్నా కావలసిందేమిటి?..."

కృష్ణారావు మాటలలోని అర్థం మెల్లగా బోధపడుతుంటే, కేవలం నిర్ధారణకోసం అడిగాడు "అంతే?"

"మన పరంధామంకు పెళ్ళికెదిగిన కూతురు ఉంది. ఆ అమ్మాయి వికారంగా ఉంటుంది. పాపం! చాలా పెళ్ళిచూపులు తప్పిపోయినట్టున్నాయి. అమ్మాయికి పెళ్ళి చూపులు తప్పిపోయినా, అతగాడికి తన ఆఫీసరు హోదా గుర్తుండి, హోదాకు తగిన సంబంధమే చేయాలని అనుకునేవాడు... ఒకప్పుడు మీ హోదాకు చాలా తక్కువ. ఆఫ్టాల్ ఒక క్లర్కువి నీవు. అమ్మాయి వికారంగా ఉన్నా ఒక క్లర్కు కొడుక్కిచ్చి పెళ్ళిచేయడం ఆయనకు ఇష్టంలేదు... ఇప్పుడూ నువ్వు క్లర్కువే. కానీ నీ హోదా వేరు. కావాలంటే కారు మెయిన్‌టెన్ చేయగలవు. కాబట్టే పరంధామం కన్ను నీమీద పడింది. మీ ఇద్దరి కులాలు ఒకటే కాబట్టి, ఇప్పుడు కులాల బంధం కలుపుతాడు. మెల్లగా మీ ఇద్దరికీ బంధుత్వమేదయినా కలిసి ఉందేమోనని ఆరా తీస్తాడు. కుటుంబాల స్నేహం మెరుగుపరచి, తర్వాత- తర్వాత అమ్మాయి విషయం నీముందు కదుపుతాడు... సో! జరగబోయే నాటకానికి ఈరోజు జరిగింది. ఒక రిహార్సల్ మాత్రమే. కాబట్టి కాస్త జాగ్రత్త..."

ముందున్న అనుమానం తెర ఒక్కసారి తెరచుకుంది. అసలు భావం అర్థమయింది. "ఓహో! ఇదా సంగతి" అనుకున్నాడు... ఇన్నాళ్ళులేని ఆప్యాయతకు కారణం- ఇదా! బహుశా నన్ను చెడామడా తిడుతున్నప్పుడు రాని కులాల అనుబంధం ఇప్పుడు గుర్తుకురావడం విచిత్రమే' అనుకున్నాడతడు. ఈ అకస్మిక పరిణామాలకు కారణం ఏమిటో స్పష్టంగానే తెలుస్తుంది.

డబ్బు!

ఈ డబ్బును మనిషి సృష్టించాడు. కాని ఆ డబ్బు మనిషిని సృష్టించలేదు. అయితే- ఆ డబ్బు మనుష్యులను ఆట ఆడేలా చేయగలదు. మనిషిలోని మనసులని తారుమారు చేయగలదు. మనసులలోని మృగాలను వెలుపలికి తీయగలదు.

నాస్టీ మనీ... బట్ ది కాస్ట్‌లీ మనీ!... గో టు హెల్ విత్ దిస్ బ్లడీ మనీ!... మనీ... మనీ... మనీ... ఎవ్విరీవేర్ మనీ... మనీ ఈజ్ ది గ్రేట్!

బట్... మనసులో ఏదో అసంతృప్తి. అతడికే అర్థంగాని మనస్థితి. బుద్ధుడు రాజత్యాగం చేయబోయే ముందు కూడా ఇలాంటి మానసికస్థితే కలిగి ఉండొచ్చు బహుశా.

★ ★ ★

ఉదయాన్నే ఇంటిముందు రిక్షా ఆగితే, ఎవరా అని తొంగిచూసింది కామేశ్వరి.

రాజేశ్వరి, గంగాధరం రిక్షా దిగుతూ కనుపించారు. ఓ పదిరోజులక్రితం వారలా తనింటికి వచ్చి ఉంటే ఆమె ఆనందంతో పొంగిపోయి ఉండేది. కాని ప్రస్తుతం పరిస్థితి వేరు. నిన్నటిరోజు తాము నిరుపేదలు ఉన్నప్పుడు ఏమాత్రం బంధుత్వాన్ని గుర్తుకు తెచ్చుకోని ఆమె, ఈరోజు ఆ బంధుత్వాన్ని



ఆసరా చేసుకుని ఆ ఇంటికి వచ్చింది. నిన్న-తాము ఆమెకంటే రెండు మెట్లు దిగువున ఉన్నారు. ఈరోజు తాము ఆమెకంటే పదిమెట్లు పైన ఉన్నారు. ఒకప్పుడు ఎదుటి మనిషి అంతస్తుల తారతమ్యం చూపించి, దూరంచేస్తే, ఈరోజు ఆ అంతస్తుల తారతమ్యంతోనే ఆమెను దూరంగా ఉంచాలన్నది ఆ క్షణమే కామేశ్వరమ్మలో కలిగిన భావం. ఇది పగ సాధింపుకాదు. ఒక రకమైన కసి. ఎదుటివారికి గతం గుర్తుకు తెచ్చి- కనువిప్పు కలిగించాలన్న దుగ్ధ.

రిక్షా దిగిన రాజేశ్వరి వదినను చూసి పలకరింపుగా నవ్వింది. కామేశ్వరి కూడా బలవంతంగా నవ్వి "రండి, రండి" అంది ఎదురెళుతూ.

"ఇప్పుడేనా రావడం?"

"అవును వదినా! బస్సు దిగి తిన్నగా ఇక్కడికే రావడం".

రాజేశ్వరికి భర్త తరుపు బంధువులు ఇద్దరు ముగ్గురు ఆ ఊళ్ళోనే ఉన్నారు. ఒక్కొక్కసారి వాళ్ళిళ్ళకు వెళ్ళి, తర్వాత రావడం అలవాటే '... ఈసారి అలా కాదన్నమాట!...' అనుకుంది కామేశ్వరి.

ముగ్గురూ ఇంటిలోపలికి నడిచారు.

అత్తామామలను చూసిన సునీల్ వారిద్దరినీ పలకరించాడు.

"ఏమోయ్ సునీల్! ఎలా ఉన్నావు?" అడిగాడు గంగాధరం.

"బాగున్నాను మామయ్యా" జవాబిచ్చాడు సునీల్.

వారి మాటలకు వంటగదిలోనుండి బయటకు రాబోయిన నీరజ వాకిట్లోనే వారిద్దరినీ చూసి, ఎందుకో ఎదుటపడేందుకు మనసు రాక నిశ్శబ్దంగా పక్కకు తప్పుకుంది.

సత్యనారాయణ బాత్‌రూమ్‌లోంచి ఇవతలకు వచ్చాడు. చెల్లెల్ని బావను చూసి "ఇప్పుడేనా రావడం" అంటూ అడిగాడు

తలూపారు వారు. అతడు వారి ఎదురుగా కూర్చుని క్షేమసమాచారాలు అడగసాగాడు.

మాట్లాడుతూనే రాజేశ్వరి ఆ ఇంట్లో కొత్తగా చేరిన ఆడంబరాల వంక చూడసాగింది.

కామేశ్వరి హంగుల కోసం బాగానే ఖర్చు చేసింది. నియోరిచ్‌లు ఎవరైనాసరే, తమకు కొత్తగా ఏర్పడిన స్థితిని ప్రదర్శించేందుకు లేనిపోని ఆర్భాటాలు చేస్తుంటారు. తమ ఇంటిని, వంటినీ ఖరీదైన వస్తువులతో నింపి ప్రదర్శిస్తారు.

రాజేశ్వరికి ఆ ఇంటిలోని ఖరీదైన వాతావరణం చూస్తుంటే, సంతోషమే వేసింది. 'ఫర్వాలేదు. అన్నయ్య స్థితి హఠాత్తుగా భలే మారిపోయింది....ఇప్పుడు కూతురి కట్నకానుకల కోసం ఎంతయినా ఖర్చుపెట్టగలడీయన'. అనుకుందామె.

ఆరోజు శలవుదినం కావడంతో సత్యనారాయణ ఇంటిలోనే ఉండిపోయాడు.

కొద్దిసేపటి తర్వాత, రాజేశ్వరి తను వచ్చిన విషయం కదిలించింది. "అదేనన్నయ్యా! మన నీరజ గురించి మాట్లాడుదామని వచ్చాను" నసుగుతూ అంది రాజేశ్వరి.

సత్యనారాయణ చెల్లెలి ముఖం వంక అదోలా చూశాడు. ఆ చూపులలోని భావం అర్థమయిందో - లేదో గాని రాజేశ్వరి తల దించుకుంది.

లాటరీలో తనకు ఏడులక్షలు వచ్చిన విషయం రాజేశ్వరికి తెలుసు....తనకు డబ్బు ఉంది కాబట్టి బెల్లం చుట్టూ ఈగల్లా మెల్లగా ముసురుకునే ప్రయత్నం ఇది...పాపం! పదిరోజుల క్రితం వరకూ గుర్తురాని బంధాలు అనుబంధాలు, అభిమానాలు - ఆప్యాయతలు అన్నీ ఒక్కసారిగా - తన డబ్బు చూడటంతోనే వచ్చినట్టున్నాయి....'

మరోపక్క కామేశ్వరి భర్త ఏం మాట జారుతాడోనని కాసుకు కూర్చుని ఉంది. నీరజను ఆ ఇంటి కోడలుగా చేయటం ఆమెకేమాత్రం ఇష్టం లేదు.

సత్యనారాయణ కొద్దిసేపు నిశ్శబ్దం పాటించి, తర్వాత మెల్లగా గొంతువిప్పాడు. "మా నీరజకు ఒక లక్ష రూపాయలు కట్నం ఇచ్చి, ఏ డాక్టరుకో, ఇంజనీరుకో ఇవ్వాలనే ఉద్దేశంతో ఉన్నాను కాబట్టి....'

కామేశ్వరి ముఖం మతాబులా వెలిగిపో




యింది. రాజేశ్వరి ముఖం ముడుచుకుపోయింది.

మెల్లగా తేరుకుని "అదికాదన్నయ్యా! ఆరోజు నువ్వు దంపూరుకి వచ్చి నీరజను నీ మేనల్లుడికి ఇవ్వాలన్నట్లుగా అన్నావుగా... అందుకని"

"కాని మీరేగా, మా సంబంధం ఇష్టంలేక, కట్నకానుకలు ఇచ్చుకోలేమని కాబోలు - వారు ఈ కాలం కుర్రాళ్ళు, మనం ఫలానా అమ్మాయిని చేసుకో అంటే వారు వినరు. వారి మనసుకు నచ్చితేనే గదా... అని ఎన్నో మాటలు చెప్పారు. అప్పుడు నచ్చని మా అమ్మాయి ఈ రోజు అతగాడికి ఎలా నచ్చింది?..."

అంటూ మరేదో చెప్పబోతుంటే, రాజేశ్వరి మధ్యలోనే అందుకొని అంది. "ఆరోజు మాత్రం నచ్చలేదని ఎవరన్నారు? నీరజ మాకెప్పుడో నచ్చింది."

"మరి మర్నాడే జాబు వ్రాస్తాం అన్నవారు, రెండు నెలలు వరకూ ఆ ప్రస్తావనే ఎత్తకపోతే మేము మా అమ్మాయి, మీకు నచ్చిందనుకోవాలా? నచ్చలేదనుకోవాలా?... నచ్చనప్పుడే కదా అవతలివారు అలా నాన్చడం జరిగేది."

ఆ మాటకు రాజేశ్వరి కాస్త ఇబ్బంది పడింది. గుక్కతిప్పుకోవడం కష్టం అయింది. "అప్పట్లో ఏదో, రేపు రాద్దాం - ఎల్లుండి రాద్దాం అని అనుకుంటూ అలాగే రోజులు దొర్లిపోయాయి."

సత్యనారాయణకు కోపం వచ్చింది. "అబద్ధాలు చెప్పకు రాజేశ్వరీ! డబ్బు శాశ్వతం కాదు. ఈ రోజు ఉంటుంది. రేపు ఉండకపోవచ్చు. కాని మనిషి అన్న మాట మాత్రం అలాగే నిలచిపోతుంది... మాకు డబ్బు లేనప్పుడు మా సంబంధం చేసుకోవడం నీకేమాత్రం ఇష్టం లేదు. అందుకే మాటనూటిగా చెప్పలేక తాత్సారం చేశావు. ఇప్పుడు మావెనుక లక్షలు చేరడంతో అభిమానం ప్రదర్శిస్తూ ఇలా వచ్చావు. నిజం కదూ?"

ఆ మాటకు రాజేశ్వరికి రోషం వచ్చింది. "నన్నునవసరంగా అపార్థం చేసుకుంటున్నారన్నయ్యా! డబ్బు వచ్చాక మీరు పూర్తిగా మారిపోయారు." అంది ఒకింత వ్యంగ్యం మిళితం చేసి.

రాజేశ్వరి మాటలతో సత్యనారాయణ పూర్తిగా బరస్ట్ అయ్యాడు. కుర్చీలో నుండి విసురుగా పైకి లేచాడు. "రాజీ! నేను డబ్బును చూసి ఏనాడూ మారలేదు డబ్బుకే మారేవాడినయితే, నా స్థితి అంత అధ్వాన్నంగా ఏనాడూ ఉండి ఉండదు....డబ్బును చూసి మారేది మీరు. డబ్బున్నవాడి మీదనే అభిమానాలు ఆప్యాయతలు ప్రదర్శించి, అలాంటివారితోనే బంధుత్వం కలుపుకోవాలని ప్రయత్నిస్తారు. అసలు డబ్బు మనుష్యులు మీరు. డబ్బు తప్ప మరేదీ ఆలోచించరు. డబ్బు...డబ్బు...డబ్బు... మీకు కావలసింది అదొక్కటే....అంతే....అంతే" ఆవేశపడుతూ అన్నాడాయన.

అతనిలో అలాంటి ఉద్రేకం ఏనాడు చూడని రాజేశ్వరి తత్తరపడింది. జంకిపోయి మెల్లగా "అయితే ఇప్పుడేమంటావు?" అంది.

చెప్పానుగా! "నా కూతురికి లక్షరూపాయలు కట్నం ఇచ్చి డాక్టరుకో, ఇంజనీరుకో ఇచ్చి పెళ్ళిచేస్తానని."

మారుమాట్లాడలేక పోయింది రాజేశ్వరి. "మీ ఇష్టం అన్నయ్యా" అని మాత్రం అంది.

ఆ సాయంత్రమే వారు ఊరెళ్ళిపోయారు.



"నాన్నా! నాకు స్కూటర్ కావాలి"

సత్యనారాయణ కొడుకు వంక ఎగాదిగా చూశాడు- "ఇప్పుడు నికు స్కూటర్ ఎందుకురా?"

సునీల్ అదోలా నవ్వాడు- "ఎందుకేమిటి నాన్నా!... నా వయసువాళ్ళంతా ఎందుకు

కొనుక్కుంటున్నారు- జస్ట్ ఎంజాయ్''

"ఎంజాయ్ చేయొచ్చు కాదనను. ఏ వయసులో ఎంజాయ్ చేయాలో ఆ వయసులోనే ఎంజాయ్ చెయాలన్నది కూడా నాకు తెలుసు. కాని... మన స్థితి నిన్నటి మన స్థితిని దృష్టిలో పెట్టుకుంటే- ఈరోజు ఇలా వృధా ఖర్చులు పెట్టాలంటే మనసొప్పుతుందా?... ఆలోచించి వస్తువును కొనుక్కోవచ్చు. అయితే అది ఎంత వరకూ మనకు ఉపయోగమో ఆలోచించు. అనవసరమైన లగ్జరీస్ వద్దు... కావాలని పట్టుబడితే... నీ ఇష్టం- కొనుక్కో..."

సునీల్ తలొంచుకున్నాడు. ఇద్దరిమధ్యా కొద్దిసేపు గాఢమైన నిశ్శబ్దం. రెండు నిమిషాల తర్వాత సత్యనారాయణ తలెత్తి కొడుకువంక చూస్తూ అడిగాడు- "అది సరే... అప్పుడేదో హైస్కూల్‌లో ఉద్యోగం ఉందనీ, కమిటీ మెంబర్లకు తలా ఐదువేలు సమర్పించుకుంటే ఉద్యోగం వస్తుందనీ అన్నావు... ఇప్పుడా ఉద్యోగం ఏమయిందీ?"

"ఇంకా ఫిలప్ చేయలేదు- ఖాళీగానే ఉంది"-

"అయితే నువ్వు ట్రై చేయకూడదూ?! ఇప్పుడు మనం పాతికవేలు కాకపోతే ముప్పయ్‌వేలు అయినా లంచం ఇవ్వగలం కదా?"

క్షణం ఆగి సునీల్ అన్నాడు- "నాకిప్పుడు ఉద్యోగం చేయాలని లేదు నాన్నా" త్రుళ్ళిపడ్డాడు సత్యనారాయణ. "అదేమిటి!" అన్నాడు విస్మయంగా.

సునీల్ చెప్పాడు- "మనకి ఒకప్పుడు డబ్బు లేదు. అందుకే చిన్న ఉద్యోగంద్వారా బతుకుతెరువు సంపాదించుకోవాలనుకున్నా. కాని- ఇప్పుడు మనకు డబ్బు ఉంది. కాబట్టి బతుకుతెరువుకోసం ప్రాకులాడాల్సిన పనిలేదు. ఇప్పుడు మనకు లభించిన ఈ డబ్బుని మరింతా- మరింతా పెంచాలి. నాకు మొదటి నుండీ మన పేదరికంమీద పెద్ద అసహ్యం. ఈ దరిద్రాన్ని వదిలించి లక్షలు- కోట్లు సంపాదించాలని అనుకునేవాడిని. బట్- అప్పుడు తగిన పెట్టుబడిలేక, ఆ పెట్టుబడి ఎలా సంపాదించాలో తెలియక ఊరకుండిపోయాను. కాని నేడు- ఆ దేవుడు నా ఆశలు తీర్చేదానికే కాబోలు లాటరీ రూపంలో ఇంత డబ్బు ఇచ్చాడు. ఆయన ఇచ్చిన ఈ అవకాశాన్ని సద్వినియోగం చేస్తాను. నేను వ్యాపారం చేస్తాను... నాకో లక్షరూపాయలివ్వండి నాన్నా! రెండు మూడేళ్ళు తిరిగేసరికి ఆ డబ్బుని ఎంతగా అభివృద్ధి చేస్తానో మీరే చూద్దురు".

సత్యనారాయణ అప్రతిభుడై చూస్తుండిపోయాడు. కిటికీనుండి దూసుకువచ్చి పడుతున్న వెన్నెలకాంతి, ట్యూబ్‌లైట్ వెలుతురు ముందు వెలవెలబోతుంది.

అతడికి కొడుకు మనసులో డబ్బుమీద ఉన్న 'కసి' స్పష్టంగా అర్థమయింది. పేదరికంలోనూ, నిరుద్యోగంలోనూ చాలాకాలం జీవితసమస్యలతో బాధపడిన యువకునికి, ఈ వ్యవస్థమీద- ఈ వ్యవస్థను ఆడించే కీలక పదార్థం, డబ్బు మీద ఆమాత్రం 'కసి' ఉండడం సహజమే. కాని... కాని... తన భయం తనది!. వ్యాపారం చేస్తే లాభనష్టాల అవకాశం సమంగా ఉంటుంది. అదే ఉద్యోగంలో అయితే ఎలాంటి భయంలేదు. స్థిరత్వం ఉంటుంది.

తన భయం కొడుకు ముందు బయటపెడితే, సునీల్ పకపకా నవ్వేశాడు.

"మీది అనవసరమైన భయం నాన్నా! బిజినెస్‌లో లాభానికి- నష్టానికీ, రెండింటికీ అవకాశం ఉందనుకో. కాని తెలివిగా, వ్యాపారంలోని లోతుపాతులు క్షుణ్ణంగా తెలుసుకుని దిగి, చాకచక్యంగా నడిపితే ఏ బిజినెస్‌లోనూ నష్టంరాదు. నష్టానికి భయపడితే, ప్రపంచంలో బిజినెస్‌మాన్ అనేవాడు ఎవరూ ఉండరు. అందరూ గవర్నమెంట్ ఉద్యోగాలకోసం ఎగబ్రాకి ఉండేవారు. అప్పుడు ఈ వ్యవస్థ ఎలా ఉండేదో ఆలోచించు నాన్నా! వాస్తవానికి సమర్థుడయినవారికి బిజినెసే సరయినది... నా సమర్థత మీద మీకు నమ్మకముంటేనే నాకు పెట్టుబడికి డబ్బులివ్వండి. లేకుంటే... మీరు చూపించిన ఉద్యోగంలోనే చేరిపోతాను... చెప్పండి"

సత్యనారాయణ ఆలోచనలో పడ్డాడు. సునీల్ సమర్థతమీద తనకెంతో నమ్మకం. తను చాలా తెలివైనవాడు. లోకజ్ఞానం తెలిసినవాడు. ఏ పనిలోనయినా చాకచక్యంగా నెగ్గుకురా




గలదు. కాబట్టి నమ్మి లక్షరూపాలివ్వడంలో తెలివితక్కువేం కాదు.

"ఇంతకీ నువ్వేం వ్యాపారం చేయాలనుకుంటున్నావు?" సునీల్ అప్పటికే ఏదో బిజినెస్ గురించి ఆలోచించి ఉంటాడనీ, అందులోని లోతుపాతులు తెలునుకుని ఉంటాడనీ అతడికి తెలును.

సునీల్ చెప్పాడు "రియల్ ఎస్టేట్ బిజినెస్ నాన్నా! ఆ బిజినెస్‌లో చాలా లాభాలున్నాయి. ముఖ్యంగా మన పెట్టుబడి దెబ్బతినే అవకాశం ఏమాత్రంలేదు. మనం పొలాన్నో స్థలాన్నో కొని వదేస్తాం. తర్వాత ఫ్లాట్స్‌చేసి, ఫ్లాట్స్ గానో లేదా బిల్డింగ్స్ కట్టించో తిరిగి అమ్మేస్తాం. ఒకవేళ ఫ్లాట్స్ అమ్ముడుపోలేదనుకో- మన పెట్టుబడి సురక్షితంగా స్థలం రూపంలో పడి ఉంటుంది. కాకపోతే జస్ట్ ఇంట్రస్ట్ లాస్ కావచ్చు. లేదా వడ్డీకి తగినంతగా ఆ స్థలం రేటు పెరగనూవచ్చు... అందులో ఇప్పుడు జనాలకు స్వంత ఇళ్లమీద మోజు విపరీతంగా ఉంది.

ఊరికి పది కిలోమీటర్ల అవతలున్నా సరే ఫ్లాట్ కొనేస్తే, తర్వాత పదేళ్లకయినా ఆ ప్రాంతం జనసమ్మర్దం అవుతుంది కదా - అన్న ఆలోచన జనాలలో పెరిగిపోయింది. కాబట్టే సంపాదన ఉన్నప్పుడే కొడుకుకు, కూతురుకు, పుట్టబోయే మనవడికి అందరికీ తలా ఒక ఫ్లాట్ తీసేస్తున్నారు జనాలు. అందువలన ఫ్లాట్స్‌కి డిమాండ్ లేదనుకోవడం పొరపాటు... సో! కలిసొస్తే ఈ వ్యాపారంలో లక్షలు సంపాదించొచ్చు. కలసిరాకపోయినా నష్టపోయేదేమీలేదు..."

కొడుకు చెప్పినదానివల్ల సంతృప్తుడయ్యాడు సత్యనారాయణ. అయినా అన్నివైపులా ఆలోచించాలి కాబట్టి నిశ్శబ్దంగా ఆలోచనలలో మునిగాడు.

తండ్రికి తనమీద ఇంకా నమ్మకం కుదరలేదని సంశయించిన సునీల్ మెల్లగా అన్నాడు- "నాన్నా! మీకంతగా అయిష్టంగాఉంటే అలాగే ఉద్యోగంలో చేరుతాను. కాని - ఒక్కటి ఆలోచించండి నాన్నా! గుమాస్తాగిరిగానీ, బడి పంతులుద్యోగంగానీ, గానుగెద్దులాంటి జీవితం. ఎప్పుడూ అదే ఆఫీసు - అవేఫైళ్ళు లేదా అదే బడి, ఆ పిల్లలే... ఒకప్పుడు కాకపోయినా మరొకప్పుడయినా లైఫ్ బోర్‌గా అనిపిస్తుంది. గుమాస్తాగిరి చేస్తున్నమీకు ఈ విషయం ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఉద్యోగ జీవితం ఎప్పుడూ రొటీన్ బతుకు. ఒక థ్రిల్లు పాడూ వుండదు. జీవితంలో ఎలాంటి ఛాలెంజ్‌లూ ఎదుర్కోవలసిన అవసరం ఉండదు... చెప్పండి నాన్నా! నాకూ ఆ గానుగెద్దు జీవితమే అంటగడతారా?..."

ఆమాట అతడి గుండెలోతులలో ఎక్కడో తాకింది. సునీల్ అన్న మాటలలోని వాస్తవం అర్థమయింది. తనూ అనుకునేవాడుగా - తనదీ ఒక బతుకేనా - కుక్కలా నక్కలా ఆఫీసులో ఈ గుమస్తా బ్రతుకు... అని! మరి ఇప్పుడు కొడుకు ఆ గానుగెద్దు జీవితం వద్దనుకోవడంలో విచిత్రమేముంది! అందులోనూ చేతిలో డబ్బు ఉంది కాబట్టి - జీవితంలోని థ్రిల్ కాస్త అనుభవించాలనుకుంటున్నాడు.

సత్యనారాయణకు ఆ క్షణం మరో నిజం తెలిసినట్లనిపించింది. జీవితంలో మరే ఆధారంలేనినాడు మనిషి స్థిరత్వంకోసం ప్రాకులాడుతాడు. స్థిరత్వం అన్నది ఏర్పడిన మనిషి తన జీవితంలో థ్రిల్ కావాలనీ కోరుకుంటాడు.

ఉద్యోగం స్థిరత్వాన్నిచ్చేదయితే, డబ్బు సంపాదించాలనుకోవడం నిజంగా థ్రిల్ కలిగించే విషయం. థ్రిల్‌లో కష్టసుఖాలు రెండూ ఉండొచ్చు.

అందుకే అతడు తన కొడుకు జీవితం గానుగెద్దులా తయారుచేయకుండా అనల్రైన ఆనందం అందుకునేలా చేయాలనుకున్నాడు. సునీల్ సూచనకు అంగీకారంగా తలూపాడు సత్యనారాయణ.

వరంధామం ఈమధ్య సత్యనారాయణతో అతి చనువుగా మసలుకుంటున్నాడు. వారి ఇంటి విశేషాలు అడిగి తెలునుకుంటున్నాడు. కేంప్‌లు, టూర్‌లు తగిలినవుడు అతడిని వెంట తీసుకువెళ్తుంటాడు. ఇప్పుడు సత్యనారాయణ సీటు కూడా మారింది. మరీ అంతగా పనివత్తిడిలేని సీటు అది. అలాగే - అతడి ప్రమోషన్ కోసం పై అధికారులకు రిపోర్ట్‌ఫైల్ కూడా సంతకంచేసి పంపిఉన్నాడు.

అయితే సత్యనారాయణ ఇవన్నీ నిమిత్తమా





త్రుడిలా మౌనంగా భరిస్తూవస్తున్నాడు. అయినా మంచే జరుగుతున్నప్పుడు భరించ డమేమిటో? సంతోషమే అది. కాని పరంధామం అదంతా ఎందుకు చేస్తున్నాడో తెలిసినవాడు కాబట్టి భరించడమే అయింది.

పరంధామం ముఖ్యంగా సునీల్ విషయం గురించి బహు క్యూరియాసిటీ ప్రదర్శించేవా డు. సునీల్ ఉద్యోగం కాదు, బిజినెస్ చేస్తానన్న ప్పుడు అది నిజమేనోయ్ సత్యం! ఇంట్లో సకలసౌకర్యాలు ఉన్నా ఉద్యోగం అంటే అదో గానుగెద్దు జీవితమే! ఆకాశానికెక్కాలన్నా అధఃపాతాళానికి వెళ్లాలన్నా బిజినెస్‌లోనే అది సాధ్యం. కాబట్టి నీ కొడుకు ఆలోచనకు నేను హర్షిస్తున్నానోయ్'' అన్నాడు.

'ఈయనగారి అభినందలు ఎవరికి కా వాలీ!' - అని మనసులోనే అనుకుని, నవ్వి ఊర కుండిపోయాడు సత్యనారాయణ.

ఓనెల గడిచిన తర్వాత పరంధామ మనసు లోనిమాట బయటపెట్టాడు. "ఏమోయ్ సత్యం! మన స్నేహితాన్ని బంధుత్వంగా మార్చుకుంటే బాగుంటుంది కదూ"

సత్యనారాయణ సమయస్ఫూర్తిగా నవ్వా డు. "మీలాంటివారితో వియ్యమందాలని నా మనసులో కూడా ఉంది. కానీ.... వారు ఈ కాలం పిల్లలు. వారి మనసులలో ఎలాంటి కోరికలున్నాయో మనం ఊహించలేం. మనం చూపించిన అమ్మాయిని చేసుకోమంటే వారు చేసుకోనూవచ్చు - తిరస్కరించనూవచ్చు'..." ఆ మాటలు అనేప్పుడు అతడికి చెల్లెలు గుర్తొచ్చింది. రాజేశ్వరి కూడా అచ్చం ఇలాగే మాట్లాడింది. తనతో ఆరోజు... అంటే డబ్బుతో పాటు తనకూ సమయస్ఫూర్తిగా తప్పించుకునే లక్షణాలు అలవడుతున్నాయా?

పరంధామకు అలాచెప్పడం అతడికి ఏమా త్రం ఇష్టంలేదు. కాని అలా చెప్పక తప్పడంలే దు. పరంధామం నిన్నా మొన్నటి వరకూ తనను ఎంతో నీచంగా ట్రీట్‌చేసిన వ్యక్తి. ఈరోజు తనను గౌరవిస్తున్నాడంటే కారణం తనమీద ప్రేమాభిమానాలు కాదు, కేవలం వెనుకచేరిన డబ్బుమాత్రమే. ఆయనిచ్చే గౌ రవం, ఆప్యాయతలలో స్వార్థంఉంది... మరి అలాంటి వ్యక్తికి అవసరార్థం ఉపయోగప డటం అసమర్థతే అవుతుంది... అసమర్థత!... అంటే తనిప్పుడు సమర్థుడా!... అంతేగా మరి! సమర్థవంతంగా, సమయస్ఫూర్తిగా సమాధానా లిచ్చి చాకచక్యంగా తప్పించుకోగలుగుతున్నా డు.

తనలో ఒక్కసారిగా సమర్థత, సమయస్ఫూ ర్తి, చాకచక్యం రావడానికి కారణం ఏమిటి... అతనికి తోచింది వెంటనే.

డబ్బుంటే కొన్ని ప్రత్యేక లక్షణాలు ఆటోమేటి గ్గా వచ్చేస్తాయి కాబోలు అనుకున్నాడతడు.

సత్యనారాయణ సమాధానానికి పరంధామం చాలా సంతృప్తుడయ్యాడు. "అదీ నిజమేననుకో... అయినా నువ్వొకసారి అడిగి చూడరాదూ? వీలయితే ఆ అబ్బాయిని ఒక సారి మాఇంటికి కూడా తీసుకురా"!

తలూపాడు అతడు. ఆ తర్వాత ఓ వారంరో జులపాటు మౌనంగా ఉండిపోయాడు సత్యనా రాయణ. ఎనిమిదోరోజు పరంధామం అతడిని తన రూమ్‌లోనికి పిలిపించుకుని— "ఏం సత్యం! ఏమిటి విశేషం - మీ అబ్బాయిని పెళ్ళి విషయం అడిగావా?..'' ప్రశ్నించాడు.

సత్యనారాయణ నిలువుగా తలూపుతూ— "అడిగాను" అన్నాడు.

"ఏమన్నాడు" ఆత్రుతగా ప్రశ్నించాడు పరంధామం.

అతడు బాధపడుతున్నట్టుగా ఒక నిమిషం నిశ్శబ్దం పాటించి, తర్వాత చెప్పాడు— "బిజి నెస్‌లో ఒక స్టేజ్‌కి వచ్చేవరకూ పెళ్ళిచేసుకోద లచుకోలేదట... అంటే మరో రెండేళ్ళపాటు పెళ్ళి ప్రస్తావన తీసుకురావద్దన్నాడు" అదంతా అబద్ధమే! కాని అతడికి అలాగే చెప్పాలనిపించింది.

పరంధామంకి మెత్తటి చెప్పుతో కొట్టినట్టని పించింది. మరేం మాట్లాడాలో అర్థంకాలేదు. అరనిమిషంపాటు ఆ తర్వాత మెల్లగా గొంతు పెగుల్చుకుని "ఈ సంబంధం చేసుకోకపోతే ఆస్తి ఇవ్వనని - ఇంట్లోనుండి తరిమేస్తానని బెదిరించకూడదు'' అన్నాడు.

సత్యనారాయణ సాలోచనగా తలూపుతూ అలా అనొచ్చు కాని... "అని ఆగి..." వాడి మాటలలో కూడా చాలా రీజన్ ఉంది. వాడిప్పు



డు తన ఏకాగ్రత అంతా వ్యాపారంమీద చూపిస్తున్నాడు. అందులో డెవలప్ అయ్యేందుకు విపరీతంగా శ్రమపడుతున్నాడు. వాడికిప్పుడు పెళ్ళిచేస్తే తన కాన్సన్ట్రేషన్ దెబ్బతింటుంది. ఎక్కువగా కృషిచేయక పోవచ్చు. దానివలన లేనిపోయిన రిస్కులు ఎదుర్కోవలసి రావచ్చు... అందుకే వాడి మాటలలోని నిజాన్ని గ్రహించి నేనే ఎక్కువ బలవంతంపెట్టలేదు.

మరో నిమిషం నిశ్శబ్దం!

"పోనీ మరో రెండేళ్ల తర్వాతయినా మీ అబ్బాయి - మా అమ్మాయినే పెళ్ళిచేసుకుంటాడేమో కనుక్కో" చివరి ఆశగా అడిగాడు పరంధామం.

సత్యనారాయణ తల అడ్డంగా ఆడించాడు. "మరో రెండేళ్ళ తర్వాత విషయంకోసం ఇప్పుడే మాటివ్వడం చాలా పిచ్చిపని. మాటిస్తే నిలబెట్టుకోవాలి. వాడు ఒకవేళ నా బలవంతంమీద 'సరే'నని అన్నా ఆమాట నిలబెట్టడం విషయంలో నాకే అనుమానంగా ఉంది. కాలం మనిషిలో ఎన్నో మార్పులు తీసుకువస్తుంది. ఏవేవో ఊహించని సంఘటన్లు జరుగుతాయి. కొత్తకొత్త పరిచయాలు ఏర్పడుతాయి. మన మనసు చలించవచ్చు. అప్పుడు మాట ఇచ్చినందుకు బాధపడొచ్చు. మాట తప్పేందుకు కూడా అవకాశం ఉంది కాబట్టి ఎప్పుడో జరగబోయేందానికి ఇప్పుడే మాటివ్వడం చాలా తప్పు. ఆ తప్పును నేనూ సమర్థించను"

తన పైఅధికారిముందు తనంత ధైర్యంగా ఎలా మాట్లాడగలిగాడో తనకే అర్థంకాలేదు. బహుశా డబ్బు మహిమ కావచ్చు ఇది. డబ్బు తెగువ, ధైర్యం కూడా ప్రసాదిస్తుందనుకుంటా.

పరంధామంకు సత్యనారాయణమీద కోపంవచ్చింది. దాంతోపాటే అనుమానం కూడా వచ్చింది. అసలు ఇతడు కొడుకును సంప్రదించకుండానే మొత్తం తనే చెపుతున్నాడేమోనని . అందుకే అతడిని బెదిరించాలకున్నాడు. "తనలాంటి ఆఫీసరు అడిగితే, తిరస్కరించడమా"... కానీ ఏమని బెదిరించగలడు తను. డి ప్రమోషన్‌చేసేందుకు తనకు అధికారం చాలదు. సీటును మార్చొచ్చు దాని వలన తనకే చెడ్డపేరు వస్తుంది. నిన్నటి వరకూ భుజానికి ఎత్తుకుని తిరిగిన అతడివట్ల తక్కువ చూపుచూస్తే, ఉద్యోగులందరూ తననే అసహ్యించుకుంటారు. విషయం అందరికీ తెలుస్తుంది. అతగాడి కూతుర్ని వివాహం చేసుకుంటారని నెత్తినపెట్టుకు తిరిగాడు. చేసుకోరని తెలియగానే కక్ష ఈ విధంగా తీర్చుకుంటున్నాడని చిలవలుపలవలుగా చెప్పుకుంటారు. అందుకే అది సరయిన పద్ధతికాదు. ఇక మునుపటిలా గదిలోనికి పిలిచి చెడామడా తిడుతూ తన కక్ష తీర్చుకోవచ్చు. అయితే ఈ సత్యంగాడు మునుపటిలాంటి మనిషికాదే! మునుపు అంటే అతడికి మరే ఆధారంలేదు. తనను ఎదిరిస్తే ఏదయినా కీడు జరుగుతుందేమోనని తలదించుకుని ఉండేవాడు. ఇప్పుడు అతడి పరిస్థితి అదికాదు. కావలసినంత డబ్బుఉంది. కాబట్టి తనను ఎదిరించి మాట్లాడగలడు. అవసరమైతే పెద్దగా పోట్లాడగలడు. ఇంకా మించితే తన ముఖాన ఉమ్మేసి, రాజీనామా విసిరికొట్టి వెళ్లగలడు సో! అతడిని తనిప్పుడేమీచేయలేడు అనలేడు షిట్! ఈ లాటరీ డబ్బుతో ఈ సత్యంగాడు ఊహించనంత స్థాయికి ఎదిగిపోయాడు కదా!... మనసులోనే వ్యధపడ్డాడు పరంధామం.

సత్యనారాయణ, పరంధామం మనసులోని భావాలు సరిగానే చదవగలుగుతున్నాడు. డబ్బు తనను ఎలాంటి అందలంలో నిలిపిందో అతడికి అర్థమవుతూనే ఉంది. ఈ పరిస్థితిలో తనకా డబ్బేలేకుండా ఉంటే పరంధామం తననెలాంటి ఆటలు ఆడించి ఉండేవాడో ఊహించటం కష్టం!... అఫ్‌కోర్స్! అప్పుడు అసలు పెళ్ళి ప్రస్తావనే వచ్చిఉండదనుకో!

అతడు 'డబ్బు' అనే పదార్థానికి గల మరో కోణాన్ని సందర్శించగలిగాడు. డబ్బు గలవాడిని చూసి అందరూ ఎందుకు భయపడతారో అతడికి అర్థమయింది?

'మనీ! ది గ్రేట్' మనసులోనే అనుకున్నాడు.

పరంధామం గదిలోనుండి ఇవతలికి రాసాగాడు. వస్తుండేప్పుడు అతడి పెదాలుమీద





నన్నపాటి చిరునవ్వు కదలాడింది.

ఆ నవ్వుకు అర్థం ఇంతకాలం తనను హింసించిన పరంధామంను సరయిన దెబ్బకొట్టగలిగానని కావచ్చు! లేదా తనిప్పుడు, ఎంతటి గొప్పవాడో ఆ క్షణమే తనకు తెలియడంతో ఏర్పడిన మందహాసం కాచ్చు. ఏమయితేనేం - అదో తృప్తి!

★ ★ ★

పనికట్టుకుని పరాత్పరరావు ఇంటికెళ్లాడు సత్యనారాయణ. వాకిట్లోనే ఎదురుపడి ఆప్యాయంగా ఆహ్వానించాడు పరాత్పరం "రావోయ్ సత్యం! రా... తమరిప్పుడు లక్షాధికారులుకదా- బిజీ పనులలో మేము గుర్తు ఉంటామో ఉండమో!.... మొత్తానికి ఎలా అయితేనేం గుర్తు చేసుకుని మరీ వచ్చావు"

"నేర్మయ్‌వేయ్!" మిత్రుడిని మెత్తగా కసురుకున్నాడు సత్యనారాయణ సన్నగా నవ్వుతూ.

ఇద్దరూ ఇంట్లోకి నడిచి సోఫాలో కూర్చున్నారు పక్కపక్కనే.

నీరజకు పెళ్లిసంబంధాలు చూస్తున్న విషయం, సునీల్ బిజినెస్‌లో నెగ్గుకువస్తున్న విషయం అడిగి తెలుసుకున్నాక, పరాత్పరరావు అడిగాడు.

"రేయ్ సత్యం! పుష్కలంగా డబ్బు, రత్నాల్లాంటి బిడ్డలూ- అన్నీ ఉన్నాయని ఒకప్పుడు నువ్వు నన్నుచూసి అసూయపడేవాడివి. 'ఇక నీకేమోయ్ నిశ్చింత' అనేవాడివి. ఇప్పుడు నీకూ కావలసినంత డబ్బు సమకూరింది. బిడ్డలూ మంచివారే. బాధ్యతలు కావాలనుకుంటే ఒక్కరోజులో తీర్చేసుకోగలవు. అంటే ప్రధాన సమస్య- డబ్బు సమస్య! అది నీకిప్పుడు లేదు.... మరి ఆ డబ్బు రావడంతోనే నీకు నిశ్చింత ఏర్పడిందా?... మానసిక శాంతి లభించిందా...?"

పరాత్పరరావు ప్రశ్నలకు సమాధానంగా ఆలోచనలో పడ్డాడు అతడు. 'తనకు ఒక్కసారిగా పెద్దమొత్తంలో డబ్బు వచ్చింది. అదొక ఊహాతీతమైన విషయంలాగే అనిపిస్తుంది తనకిప్పుడు అయితే... ఆ వచ్చిన డబ్బుతో తన సమస్యలెన్నో తీరిపోయాయి. జీవితం సుఖంగా సాగుతుంది. నిన్న తనను అవమానించిన వారందరూ, నేడు తనచేతనే అవమానింపబడుతున్నారు. తనను మానసికంగా హింసించినవారిమీద కసి తీర్చుకునే అవకాశం తనకిప్పుడు లభించింది. ఇదంతా డబ్బు కారణంగానే!... అలాగే అదే డబ్బు తనకు మరికొన్ని నిజాలను తెలిపింది. 'ఈలోకంలో ఏమనిషికీ 'వ్యక్తి'గా ప్రత్యేక గౌరవంలేదు. చివరికి కట్టుకున్న భార్యయినాసరే, భర్త వెనుక స్థితిగతులనుబట్టే ప్రేమాభిమానాలు కురిపిస్తుంది... అదిగో ఆ ఒక్కటే అతడిలో నన్నపాటి అసంతృప్తిని కలిగిస్తుంది. కామేశ్వరి తనమీద చూపించే ప్రేమాభిమానాలలో ఏదో కృత్రిమత్వం కనిపిస్తోంది.... బట్! ఆ అసంతృప్తి ఇంకా తీవ్రస్థాయికి చేరుకోలేదు... మనసులో ఏదో చిన్న అసంతృప్తిభావం మెదలాడుతున్నా దానిని మిత్రుడిముందు బయటపెట్టడం ఇష్టంలేకపోయింది.

సత్యనారాయణ అన్నాడు "డబ్బువలన నాకు చాలా సమస్యలు తీరిపోయాయి. జీవితం సుఖంగా గడుస్తోంది.... ఇక మనసులో తృప్తి విషయం అంటావా!... గుండె లోతుల్లోనికి తొంగిచూసుకుంటే- ఎక్కడో ఏదో అసంతృప్తి బయటపడుతూనే ఉంటుంది. అందుకే నేను మనసు లోతులలోనికి తొంగి చూసుకోదలచుకోలేదు. నాకు కావలసింది- సమస్యలులేని జీవితం. ప్రస్తుతం 'డబ్బు'వలన నా జీవితం ఎలాంటి సమస్యలు లేకుండా సాఫీగా సాగుతూనే ఉంది.... నాకీ జీవితం చాలు...."

పరాత్పరరావు మనసులోనే నవ్వుకున్నాడు. ఒకప్పుడు తనూ అలాగే భావించుకున్నాడు. కాని- మనసులోని అసంతృప్తి అన్నది వెలుతురు పురుగును గుప్పెట్లో దాచడంలాంటిది. ఎంతగా దాచినా అది అప్పుడప్పుడు మెరుస్తూనే ఉంటుంది. దాని కాంతి వేళ్ల సందుల నుండి బయటపడుతూనే ఉంటుంది. అంతేకాదు డబ్బుకూడా కొత్తపెళ్లాం మోజులాంటిది. మొదట మొదట ఆ డబ్బు ఆనందాన్నిమాత్రమే చూపిస్తుంది. ఆతరవాత పాతపెళ్లాం రాచిరంపాన పెట్టినట్టు, మనలను హింసించడం మొదలుపెడుతుంది. తనకోసం మరింతా ప్రాకులాడేలా చేస్తుంది. తన స్థిరత్వంకోసం మనిషి అష్టకష్టాలు పడేలా





చేయిస్తుంది. ఈలోపు మనిషి అప్పుడప్పుడూ రియలైజ్ అవుతుంటాడు. భార్యాబాధితుడు 'ఈ పెళ్లాంకోసం నేనింతగా ఎందుకు కష్టపడుతున్నానని' ఆలోచించినట్టు, డబ్బు మోజున్న వ్యక్తి అప్పుడప్పుడూ 'ఈ డబ్బుకోసం నేనింతగా ఎందుకు ప్రాకులాడుతున్నాను, సంపాదించే ఈ డబ్బును నేనేం చేయాలి?' అన్న ఆత్మశోధన మొదలవుతుంది. అయితే పెళ్లాం ఇచ్చే ఆ 'రెండు క్షణాల సుఖం' తాలూకూ మైకం పొరలానే, డబ్బుద్వారా వచ్చే సుఖాల మైకపుపొర మనిషిని మత్తులోనికి నెట్టేస్తుంది. దాంతో ఆత్మశోధన, తన ఉనికిపట్ల జిజ్ఞాస అన్నీ ఆమడదూరం వెళ్లిపోతాయి. వేదాంతుల భాషలో చెప్పాలంటే ఇదో 'మాయ' కాబట్టే చాలామంది జనం ఒక వయసు వచ్చాక వేదాంతపరంగా ఆకర్షింపబడుతారు. వేదాంతం అంటే మరేమిటో కాదు ఈ విశాలవిశ్వంలో తన ఉనికి ఏమిటో తెలుసుకోవడమే.

తన మనసులోని భావాలను సత్యనారాయణతో పంచుకోవాలనిపించలేదు. వరాత్సరరావుకు. మనిషిలో శోధన మొదలవడమే అసంతృప్తికి కారణం. అసంతృప్తి మనిషిని బాధిస్తుంది. అందుకే డబ్బు మోజులోనయినా మిత్రుడు మరికొంతకాలం సంతృప్తిగా బతకాలని కోరుకున్నాడు. అది అజ్ఞానమే కావచ్చు- కాని సంతృప్తిగా బతకాలని కోరుకోవడంలో తప్పులేదు. జ్ఞానం ఇచ్చే అసంతృప్తి గొప్పదా?- అజ్ఞానం ఇచ్చే సంతృప్తి గొప్పదా?- అనే తర్కానికి ఇక్కడ స్థానంలేదు.

అయితే అప్పటికే సత్యనారాయణలో అసంతృప్తి బీజాలు నాటుకుని ఉన్నాయని వరాత్సరరావు ఊహించలేకపోయాడు.

ఆతర్వాత చర్చ వసుంధరమీదికి మళ్లింది.

వసుంధర మరోసారి కనిపిస్తే బాగుండుననే అభిలాష వ్యక్తంచేశాడు సత్యనారాయణ.

"అంతగా చూడాలని తాపత్రయం ఉంటే ఒకసారి మద్రాసు వెళ్లి కనిపించిరాకూడదూ?" అన్నాడు వరాత్సరరావు.

సత్యనారాయణ కూడా నవ్వి ఊరుకున్నాడు.

మిత్రుడిచ్చిన ఫలహారం పుచ్చుకుని ఇంటిముఖంపట్టాడు సత్యనారాయణ.



సత్యనారాయణకు లాటరీ తగిలి అప్పటికి సంవత్సరం గడిచింది. నీరజకు తగిన సంబంధంకోసం వెతుకుతూ ఉన్నారు. ఆమెకిప్పుడు ఇరవైఏళ్లు వచ్చాయి. అంతమాత్రానే తొందరపడాల్సిన అవసరమేమీలేదు. కారణం తమకు కావలసినంత డబ్బు ఉంది. నీరజ పెళ్లి పెద్ద సమస్యేంకాదు. చేయదలచుకుంటే, ఒక వారంరోజులు కష్టపడి మంచి సంబంధమే తీసుకొచ్చి చేయగలరు. కాని...తమకు ఎలాగూ డబ్బు సమస్య లేదు కాబట్టి, చేయొచ్చులే అన్న ధీమా, నిర్లక్ష్యంతో రోజులు గడుపుతున్నారు.

మరోవైపు- సునీల్ రియల్ ఎస్టేట్ బిజినెస్‌లో బాగా నిలదొక్కుకున్నాడు. మొదటిసారి ప్లాట్స్ వేసినపుడే నలభైవేలవరకూ ఆదాయం వచ్చింది. రెండోనెలలోనే మరో కాలనీకి ప్లాట్స్ తయారుచేశాడు.

ఊరికి ఇరవై కిలోమీటర్ల దూరంలో వెంకటాచలసత్రం అనేచోట అతడి ప్లాట్స్ వ్యాపారం జరుగుతోంది. ఈ వ్యాపారంలో కంటికి అగుపించని లాభాలు ఉంటాయి. ఈ బిజినెస్ చేసేవారు ముందుగా టౌన్‌కి పదీ- ఇరవై కిలోమీటర్ల పరిధిలోని భూములను గుర్తిస్తారు. అవి సాధారణంగా వ్యవసాయానుకూలంకాని బీడుపడ్డ నేలలయి ఉంటాయి. అవి పొలం స్వంతదారులకు ఎలాగూ ఉపయోగం ఉండవు. వీరు వాటిని అవసరాన్నిబట్టి లేదా అవతలపార్టీ డిమాండునుబట్టి ఎకరాకు పది

వేలనుంచి లక్ష రూపాయలవరకూ కొనుగోలు చేస్తారు. అయితే- పొలం స్వంతదారుకు పూర్తి మొత్తం చెల్లించరు. ఏ రెండువేలో- ఐదువేలో ఎకరాకు అడ్వాన్సుగా ఇచ్చి, మిగతాది రెండు, మూడు వాయిదాలలో చెల్లించేలా కాగితం వ్రాయించుకుంటారు. అంటే యాభైవేలు ఇచ్చి వదెకరాల పొలం కొనుగోలు చేస్తారు.

ఇక రెండోవైపునుండి ప్రకటనలు గుప్పించడం మొదలుపెడతారు. "మీకో సొంత ఇల్లు కావాలనుకుంటున్నారా?- అయితే మమ్మల్ని సంప్రదించండి. మిమ్మల్ని మా ఆఫీసు కారులో తీసుకెళ్లి స్థలం చూపించగలము...."







ఈరోజులలో స్వంత ఇంటిని ఏర్పరచుకోవాలని ప్రతి వ్యక్తీ తహతహలాడుతున్నాడు. 'ఫిట్ ఫీవర్'లా 'హౌస్‌ఫీవర్' జనాలలో పెరిగిపోయింది. అందుకే జనం ఈ ఫ్లాట్స్‌కోసం ఎగబడుతున్నారు.

ఈ రియల్ ఎస్టేట్ బిజినెస్‌లో నెల తిరిగేసరికల్లా కోటీశ్వరులయినవారున్నారు. ఒకప్పుడు దీనిలో లాభాలశాతం జాస్తి. ఇప్పుడు ఒకవేళ కాంపిటేషన్ పెరిగి లాభాల పర్సంటేజ్ తగ్గి ఉండొచ్చుగాని, కాస్త తెలివిగా బిజినెస్ చేయగలిగితే ఈ వ్యాపారంలో ఇప్పటి

కీ అత్యధిక లాభాలున్నాయి.

పదెకరాల పొలాన్ని ఎకరం లక్ష రూపాయ లచొప్పున కొంటే, మొత్తం స్థలం కొనుగోలు పదిలక్షలు. అయితే వ్యాపారి లక్ష రూపాయల లోపు పెట్టుబడితోనే రంగంలోనికి దిగుతాడు. యాభైవేలు పొలం సొంతదారుకి అడ్వాన్సు, పదివేలు అడ్వర్‌టేజ్‌మెంట్‌మీద ఖర్చు పెడ తారు. ఆఫీసు, టాక్సీలీజు తదితర ఖర్చులు మరో పదివేలవుతాయి.

ఇక పొలాన్ని ప్లాట్స్‌గా విభజన జరుగు తుంది. ఎకరానికి అయిదొందల అంకణాలులె క్కన మొత్తం ఐదువేల అంకణాలు. రోడ్లు, పార్కులు లాంటికిపోను సుమారుగా వంద ప్లాట్స్ అవుతాయి. అప్పుడు ఒక్కో ప్లాట్ సుమా రుగా పన్నెండువేలనుండి పదిహేనువేలవ రకూ అమ్ముతారు. అంటే టోటల్‌గా పన్నెండు- పదిహేనులక్షలమధ్యన మొత్తం సమకూరు తుంది. ఇందులో పదిలక్షలు పొలం సొంతదా రుకు- మధ్యవర్తులకుకొంత- తమ ఖర్చులకు కొంత- అంతా పోనూ సుమారుగా లక్ష రూపా యలనుండి మూడులక్షలవరకూ మిగులు ఉంటుంది.

మరి ఇక తెలివైనవాడు కోటీశ్వరుడు కావ డంలో ఆశ్చర్యం ఏముందని... అందుకే కొంద రు అంటారూ- బలహీనుడిని, బలవంతుడు- తెలివితక్కువవాడని, తెలివిగలవాడు దోచు కునే దోపిడీ వ్యవస్థ ఇది అని.... అందులో ఎంతో నిజముంది- అర్థం చేసుకోగలిగితే! కానీ ఈ దేశంలోని మూర్ఖులకు తామెలా దోపిడీ చేయబడుతోందీ- ఎంత చెప్పినా అర్థంకాదు. దోపిడీకి ప్రత్యామ్నాయం చూపించినా ప్రయో జనంలేదు... ఈ వ్యవస్థ ఇలా సాగాల్సిందే!

ఎలా అయితేనేం- సునీల్ ఈ బిజినెస్‌లో ఈ సంవత్సరంకాలంలో రెండులక్షలవరకూ సంపాదించాడు. అతగాడి సామర్థ్యం గు ర్తించిన ఒకరిద్దరు ప్రముఖులు సునీల్‌కి తమ ఆడపిల్లలను ఇస్తామని ముందుకు వచ్చారు. అవైవు అలా సాగుతూ ఉంది.

కొడుకు ప్రయోజకుడై, లక్షలు సంపాదిస్తు న్నా సత్యనారాయణ తన ఉద్యోగాన్ని వదలలే దు. అప్పటికీ అతడి భార్యా, కొడుకు "ఇంకా ఎందుకు మీకీ శ్రమ! హాయిగా రెస్ట్ తీసుకోకూ డదూ" అంటే నవ్వేసి ఊరుకునేవాడు.

సునీల్ తన సంపాదనతో మంచి ఇల్లు కొనుగోలు చేయడంతో, ఈమధ్యనే వారు ఆ కొత్త ఇంట్లోనికి మారారు. ఫ్రిజ్, కలర్ టి.వి. ఇంట్లో వచ్చి చేరాయి. సునీల్ సొంతగా స్కూ టర్ కొనుక్కున్నాడు. ఈ సంవత్సరకాలంలో లాటరీ డబ్బు సద్వినియోగం చేయడంవల్ల ఆస్తి మరింతగా పెరిగింది. కుటుంబసభ్యుల ముఖాలలోకి కొత్త మెరుపు వచ్చి చేరింది.

ఇంత జరుగుతున్నా సత్యనారాయణ మన సు లోతులలో ఎక్కడో ఏదో అసంతృప్తి. అది రోజురోజుకూ పెరుగుతోంది. ఆ అసంతృప్తికి కారణం ఏమిటంటే- తను సరిగా వివరించలే కపోవచ్చు. ఒక పదార్థంయొక్క రూప, గుణ విశేషాలను ప్రేక్షకుడు సరిగా వివరించలేకపో యినంతమాత్రాన అసలా పదార్థమే లేద నడం భావ్యంకాదు కదా!

అన్నీ ఉన్నవాడికి అసంతృప్తి ఎందుకు?- అని ఎవరైనా ప్రశ్నిస్తే, ఈ లోకంలో 'నేను తృప్తిగా ఉన్నాను' అని ఏ మానవుడూ అనలే డు. వేల కోట్ల రూపాయలు ఉండే టాటా, బిర్లాలయినా ఏదో అసంతృప్తితో బాధపడు తూనే ఉంటారు. మనిషి పుట్టుకే ఒక అసంతృ ప్తి.

ఆరోజు టౌన్‌హాల్లో స్వామి సుందర చైతన్యా నంద ఉపన్యాసం ఉండడంతో పరాత్పరరావు వచ్చి అతడిని పిలుచుకువెళ్లాడు.

ఆరు గంటలకు ఆయన ఉపన్యాసం ప్రా రంభమయింది. ఆయన మంచి వక్త. తను మాట్లాడుతున్నంతసేపూ జనాలు హిప్నటైజ్ చేయబడినట్లుగా ప్రశాంతంగా వింటుంటారు. ఆరోజు ఆయన 'మాయ' అనే విషయం గురించి శ్రోతలకు వివరిస్తున్నాడు.

"... మన చుట్టూ ఉన్నదే 'మాయ'. నా తల్లి, నా చెల్లి, నా భార్య, నా బిడ్డలు... అంతా ఆ మాయ ప్రభావమే! ఈ మాయకు అసలు మూలం నేను!... ఐ... నేను... ఎప్పుడైతే నేనూ అన్న పదం వచ్చిందో, అప్పుడే నా చుట్టూ కొన్ని బంధాలు ఆటోమేటిగ్గా ఏర్పడుతాయి. నేను- అంటే ఇక నా భార్యా, నా బిడ్డలు అందరూ ఉండాలి. అందుకే అంటారు- "అహం బ్రహ్మాస్మి". నేను అన్నది అహం. ఆ





అహాన్ని వదిలేయగలిగితే- ఈ లోకమంతా ఆనందమే. నేను అన్న పదమే లేదు కాబట్టి, ఎదుటివాడి గురించి నీవు ఆలోచించగలుగుతావు. ఎదుటివాడు తింటే ఆనందిస్తావు... అందుకే నేను అన్న అహం వదిలేయాలి... అసలు నువ్వెవరివి?... నువ్వే నిమిత్తమాత్రుడివి. గీతలో కృష్ణభగవానుడు చెపుతాడూ-

*శక్నోతీ హైవ యస్సోఢుం ప్రాక్పరీరవిమోక్షణాత్!*
*కామక్రోధోద్భవం వేగం సయుక్తస్స సుఖీ నరః!!*

ఎవడు యీ దేహమును విడుచుటకు ముందే ఈ లోకమునందు కామక్రోధముల వలనపుట్టిన వేగమును సహించుటకు సమర్థుడగుచున్నవాడో ఆ మనుష్యుడు, ఇంద్రియ నిగ్రహము, సుఖము గలవాడగును.

అహాన్ని వదిలేయడం ద్వారానే మనిషి కామక్రోధములు విడిచిపెట్టగలడు. కామక్రోధములతోపాటే స్వార్థమూ నశించిపోతుంది. స్వార్థము నశించిననాడు ఆత్మ చైతన్యవంతమవుతుంది. చైతన్యవంతమయిన ఆత్మ మోక్షం పొందగలుగుతుంది.

ఆయన ఉపన్యాసం ఒక గొప్ప అనుభూతి!

"ఈయన ఇంత గొప్పగా ఉపన్యసించగలడని నేను ఊహించలేదు" పరాత్పరరావుతో అన్నాడు సత్యనారాయణ-

"ఈయన బోధనలకోసం చాలా గొప్పవారు కూడా, పనులన్నీ వదులుకుని వస్తుంటారు" చెప్పాడు పరాత్పరరావు.

అందులో ఏమాత్రం అబద్ధం లేదని తెలుస్తూనే ఉంది.

ఆయన ఉపన్యాసం వింటున్నంతసేపు, లోకం గురించి అంతా తెలిసినట్టుగానే అనిపించింది. అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్టుగా, మనిషి తృప్తిగా బతకాలంటే ఏం చేయాలో స్పష్టంగా చెప్పాడు ఆయన. ఆయన చెప్పినట్టుగా 'అహం'ను వదిలేసి బతకగలిగితే... ఆనందమే! కాని... 'మాయ'లో పుట్టి 'మాయ'లో పెరిగి 'మాయ'లో బతికే మానవునికి ఆ 'మాయ'ను వదిలించుకోవడం అంత తేలికేంకాదు.

వారిద్దరూ హాలులోనుండి బయటకు వచ్చారు. బయట పెద్ద సంఖ్యలో సైకిళ్ళు, స్కూటర్లు, కార్లు. వచ్చినవారిలో ఎక్కువమంది నలభై పైబడినవారే. 'వీరంతా తనలాగే అసంతృప్తితో బాధపడుతున్నారా?' తనలో తనే ప్రశ్నించుకున్నాడు సత్యనారాయణ. అయివుండవచ్చు... వయస్సులో ఉన్నప్పుడు మనిషికి ఏదీ తెలిసిరాదు. నేను అన్న 'అహం' ఎక్కువగా ఉంటుంది. నేను తలచుకుంటే ఏమయినా చేయగలను. కొండలు పిండిచేయగలను. కోట్లు సంపాదించగలను. అని తనను తాను తృప్తిపరచుకుంటాడు. కాని కొంతకాలం గడిచాక భార్య నిరాదరణవలనో, బిడ్డల వలన కలిగిన బాధవలనో ఆ వ్యక్తిలో రియలైజేషన్ కలుగుతుంది. "నేను ఎవరిని? ఎందుకు బతుకుతున్నాను? నా బతుకుకు పరమార్థం ఏమిటి? నేను సాధించిందేమిటి? నేను సాధించినదాని ద్వారా నేను పొందినదేమిటి? అన్న ఆత్మపరిశీలన మొదలవుతుంది. దాంతో ఎక్కడో అసంతృప్తి!

ఇక మనిషి తన అసంతృప్తికి కారణాలు వెతుక్కోవడం మొదలుపెడుతాడు. ఆత్మతృప్తికై ప్రయత్నాలు ప్రారంభిస్తాడు. కాబట్టే పాతికేళ్ల వయసులో హేతువాది, నాస్తికులు అయిన వ్యక్తి కూడా నలభై ఏళ్లొచ్చేసరికి దేవుడిని నమ్మడం మొదలుపెట్టి ఆధ్యాత్మిక ఉపన్యాసాలు వినడం ప్రారంభిస్తాడు. నాస్తికుడు- ఆస్తికుడుగా మారడానికి కారణాలు దేవుడిపట్ల భయం, పాపభీతి మొదలైనవే కాదు. మనిషిలోని ఆత్మపరిశీలన, అసంతృప్తి కూడా ఆధ్యాత్మికం వైపు ఆకర్షింపబడేలా చేస్తుంది. అయితే సగటు మానవుడు జీవిత సమస్యల గురించి నిరంతరం ఆలోచిస్తూ, తన సమస్యలు గట్టెక్కించమని ఆ దేవుని ప్రార్థిస్తుంటాడు గాని, ఆ మనిషిలో ఆత్మపరిశీలన, తన అసంతృప్తికి మూలకారణం వెతుక్కోవాలన్న జిజ్ఞాస ఉండవు. పాపం! తన చిక్కుసమస్యలను గురించి ఆలోచించుకోవడానికే తనకు సమయం సరిపోతుంది.

అదే ధనవంతుడికి ఒకానొక స్టేజీలో పూర్తి విశ్రాంతి లభిస్తుంది. కొడుకులు వ్యాపార బాధ్యతలు నెత్తికెత్తుకోవడంతో, వారు ఇక దేని

గురించీ ఆలోచించాల్సిన అవసరం కలగదు. అప్పుడే వారిలో ఆత్మపరిశీలన మొదలవుతుంది. 'తాము ఇంతకాలం ఎందుకోసం-ఎవరికోసం కష్టపడవలసివచ్చింది' అనే ప్రశ్నలు మదిలోజనిస్తాయి. దానితో మదిలో అసంతృప్తి మొదలవుతుంది. ఆ అసంతృప్తికి కారణాలు వెతుక్కోవడం మొదలవుతుంది.

కాబట్టే- దేవుడి దగ్గరగాని, ఆధ్యాత్మికవాదుల దగ్గరగాని ధనవంతులే ఎక్కువగా ఉంటారు. నేడు దేవుడిని పోషించేది ధనవంతులే. ఆధ్యాత్మికవాదులను ఆదరించేది ఆ ధనవంతులే. వారిలోని ఆ అసంతృప్తే వారికి ఈ పనులన్నీ చేయించేలా చేస్తుంది.

మరి తనలోని అసంతృప్తికి కారణం ఏమిటి?

భార్యాపిల్లలు అందరూ తనను గౌరవిస్తూనే ఉన్నారు. అప్యాయంగా, ఆదరణగా చూసుకుంటూనే ఉన్నారు. కాని తనలో అసంతృప్తి... కారణం?

బహుశా-కొద్దికాలంక్రితం వరకూ డబ్బులేక అందరి చీత్కార ధూషణలకు గురయిన తను, ఇప్పుడు ఒక్కసారిగా డబ్బు, తద్వారా ఏర్పడిన గౌరవాభిమానాలు తట్టుకోలేకపోతున్నాడు. వ్యక్తిగా నేను అనుకున్న వ్యక్తికి అసలు గౌరవంలేదని, ఆ గౌరవమంతా డబ్బుకేనని తెలియటంతో అసంతృప్తి మొదలయింది. ఆ అసంతృప్తి ఆత్మపరిశీలనకు దారితీసింది....అందుకే ఈ అన్వేషణలూ!

ఇద్దరూ నడుస్తుండగా వరాత్పరరావు అడిగాడు- 'ఎలాఉంది ఆయన ఉపన్యాసం'

''వింటున్నంతసేపు మరో లోకంలో ఉన్నట్టు, విని బయటకు వచ్చాక తిరిగి ఈ లోకంలోని కష్టాలలో వచ్చిపడ్డట్టుగా ఉంది''

''చెప్పాడుగా అదే మాయ అని''

ఓ వీధి మలుపులో ఇద్దరూ ఆగారు ''నేను వెళ్ళొస్తాను'' చెప్పాడు వరాత్పరరావు.

తలూపాడు సత్యనారాయణ.

''మళ్ళీ ఎప్పుడు కలుస్తావు?''

''వీలు చూసుకుని మీ ఇంటికి వస్తాను''





ఎవరిళ్ళవైపు వారు నడవసాగారు.

నడుస్తుంటే సత్యనారాయణలో ఓ ప్రశ్న కదలాడింది క్షణంపాటు. 'నాస్తికత్వం గొప్పదా? ఆస్తికత్వం గొప్పదా? -అంతలోనే అతడు అనుకున్నాడు 'మనిషికి తృప్తిని ఇవ్వగలిగినది ఏ తత్వమైనా ఒకటే!'

ఇల్లు చేరేసరికి మరో పదినిమిషాలు పట్టింది.

పెద్ద ఇల్లు ఇంటికి మూడురెట్లున్న ఖాళీ స్థలం కాంపౌండ్‌వాల్ మధ్య అందమైన పూల మొక్కలు. ఇంటిముందు కట్టేసిఉన్న బొచ్చు కుక్కపిల్ల.

సత్యనారాయణ ఇంట్లోకి అడుగుపెట్టాడు.

కామేశ్వరి నవ్వుతూ ఎదురొచ్చి ''ఇంతసేపు ఎక్కడికెళ్ళారు?'' అంది ఆరాగా.

''ఏదో ఉపన్యాసం జరుగుతుంటే వరాత్పరంతో కలిసి అలా వెళ్ళాను''

''రండి భోంచేద్దురు'' ముందుకు నడుస్తూ పిలిచిందామె.

ఆమె వెనుకే నడుస్తూ భార్యవంక పరిశీలనగా చూశాడతడు. 'కామేశ్వరి ఈ మధ్యకాలంలో బాగా వళ్ళుచేసింది. ఛామనఛాయ రంగయినా ఎప్పుడూ కట్టెలపొయ్యి ముందు పడి ఉండటంతో పొగచూరిన కట్టెలా ఉండేది. ఇప్పుడు గ్యాస్‌స్టౌ, తోడుగా పనిపిల్ల ఉండటంతో పనిభారం తగ్గింది. దాంతో రంగుతేలింది. అందుకుతగ్గట్టుగా మంచి పళ్ళు, ఫలాహారాలు తినడం, మరే చీకూ చింత లేకుండా ఉండటంతో కాస్త కండబెట్టింది. ఆమెకు నలభైఏళ్ళుంటాయి. కాని ప్రస్తుతం చూస్తుంటే ముప్పయ్‌ఐదేళ్ళులా కనిపిస్తుంది. అంతా డబ్బు మహిమ!

ఇద్దరూ నడిచి డైనింగ్‌టేబుల్ దగ్గరకు వెళ్ళారు. అతడు ఓ కుర్చీలో కూర్చున్నాడు.

కామేశ్వరి పక్కకు తిరిగి ''నీరజా'' అంటూ పిలిచింది.

అందుకు జవాబుగా ''వస్తున్నానమ్మా'' అని వినిపించింది నీరజ గదిలో నుండి.

రెండు నిమిషాల తర్వాత నీరజ వచ్చి అతని పక్కనే కూర్చుంది. ఖరీదైన దుస్తుల్లో నీరజ రెట్టింపు అందంతో కనిపిస్తోంది.

''ఎక్కడికెళ్ళారు నాన్నా'' అడిగింది నీరజ.

చెప్పాడు అతడు-

కామేశ్వరి నిశ్శబ్దంగా భోజనం వడ్డిస్తోంది ఇద్దరి ప్లేట్లలో.

అతడు భోంచేస్తూ కూతురి వంక చూశా డు-ఓరగా. నీరజకు పెళ్ళి చేయాలని సంవత్సరం క్రితమే తను సంబంధాల కోసం కాళ్ళరిగేలా తిరిగాడు. ఇంట్లో ఆడపిల్ల ఉందని, అప్పట్లో తనకు అర్ధరాత్రికూడా నిద్రపట్టేది కాదు.

ఇప్పుడు కూడా ఆ అమ్మాయి తన ఇంట్లోనే ఉంది. 'సంవత్సరం క్రితమే తొందరపడిన తను ఇప్పుడు తొందరపడటంలేదు. నిర్లక్ష్యంగాదుగాని, చేయొచ్చులే అన్న ధీమా! తమకు ఎలాగూ డబ్బుంది కాబట్టి, ఈరోజు కాకపోయినా రేపయినా చేసేయగలరు పెళ్ళి... కార్యం పూర్తికాకపోయినా, డబ్బుంటే అదో నిశ్చింత.

భోజనం మధ్యలో నీరజ తలెత్తి తల్లిని అడిగింది "అన్నయ్య ఇంకా రాలేదా ఇంటికి?"

"ఈరోజు ఆఫీసులో ఏదో పనిఉందని లేట్‌గా వస్తానని చెప్పాడమ్మా మధ్యాహ్నం... ఏమిటో ఈ మధ్య వాడికి క్షణం తీరిక లేకుండా పోతోంది. ఉదయం లేచి బయటకు వెళితే, ఏ అర్ధరాత్రికో ఇంటికి తిరిగివస్తున్నాడు..." విసుక్కుంటూ అంది కామేశ్వరి.

"అదంతేనే! డబ్బు మనిషిని ఒకచోట నిలవనీదు. క్షణం ప్రశాంతంగా నిద్రపోనివ్వదు' మనసులోనే అనుకున్నాడు సత్యనారాయణ.

నీరజ మాత్రం- 'ఆడపిల్లను పక్కనేనుకుని తిరగటం మొదలుపెడితే, అర్ధరాత్రేం?- తెల్లారికూడా అవుతుంది' అనుకుంది మనసులో. ఆమె ఈ మధ్య నాలుగయిదుసార్లు సునీల్ మరో అమ్మాయితో కలసి తిరగటం చూసింది...ఆ విషయం పెద్దలతో చెప్పాలని అనిపించినా, ఈరోజో-రేపో, ఎలాగూ బయటపడబోయే విషయాన్ని ముందుగా తనే ఎందుకు బయటపెట్టాలా అనుకుని ఆగిపోయింది.

భోజనాలు పూర్తయ్యాయి. ఆ ఇద్దరూ లేచి వాష్‌బేసిన్‌లో చేయికడుక్కున్నారు. కామేశ్వరి వారు తిన్న ప్లేట్‌లు సింక్‌లో వడేసి, తనూ భోజనానికి కూర్చుంది.

సత్యనారాయణ తన గదిలోనికి వెళ్ళాడు. ఆ ఇంట్లో చేరిన తర్వాత ఒక్కొక్కరికి ఒక్కోగది కేటాయించబడింది. కామేశ్వరి, సత్యనారాయణలు ఒక గదిలో పడుకుంటే, సునీల్, నీరజలు చెరో గదిలో పడుకుంటారు. అంతా సౌకర్యంగా ఉంది.

అతడు బెడ్‌మీద వాలి తిరిగే సీలింగ్‌ఫ్యాన్ వంక చూడసాగాడు. ఫ్యాన్‌గాలి చల్లగా, మెల్లగా అతడి శరీరాన్ని తాకుతోంది. ఆ గాలికి అతడి జుట్టు అదోలా కదలాడుతోంది.

అలా ఎంతసేపు గడిచిందో తెలియదు.

"ఏమిటలా దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?"

ఉలికిపడి అటుగా చూశాడు సత్యనారాయణ. కామేశ్వరి తలనిండా పూలు తురుముకుని, అందంగా అలంకరించుకుని - ప్లేట్ పట్టుకుని నిలబడి ఉంది. ఆమధ్య ఆమెకు అలంకరణ మీద అంతగా ధ్యాసలేదు. గత ఆరునెలలుగానే ఆమె శరీరంపట్ల శ్రద్ధ చూపిస్తోంది. అలంకరించుకోవడమే కాదు, అలరించడంకూడా నేర్చుకుంది.

"ఏమీలేదు" తల తిప్పుకుంటూ అన్నాడు అతడు.

ఆమె అతడికి దగ్గరగా మంచంమీద కూర్చుంటూ, చేతిల్లోని ప్లేట్ టీపాయ్ మీద పెట్టింది. అందులోని మంచినీళ్ళ జగ్ తీసి కిందపెట్టింది.

అతను నిశ్శబ్దంగా ఉన్నాడు.

ఆమె మాటలు కలుపుతూ "ఎవరిదీ ఉపన్యాసం" ప్రశ్నించింది.

చెప్పాడు అతడు-

రెండుమాటలు అవీ ఇవీ మాట్లాడాక, ఆమె అడిగింది. సునీల్ కోసం ఆ చీఫ్ ఇంజనీర్ సంబంధం వచ్చింది కదా! ఆ సంబంధం మనకు అన్నివిధాలా సరిపోయేట్టుంది. లక్ష రూపాయలు కట్నం ఇస్తారట, అమ్మాయి అందంగా ఉందట. డిగ్రీవరకూ కూడా చదువుకుంది. ఇంకా ఆలస్యం ఎందుకు?"

"వాడితో ఒకమాట చెప్పి, ఆ తర్వాత తీరిక చూసుకుని మనం వెళ్ళిచూసి వద్దాం"

"అలాగే" అని ఆగి "మరి నీరజకు?"

అంది.

"నీరజకు ఈ సంవత్సరం ఎట్టి పరిస్థితిలోనూ పెళ్ళి చేసేద్దాం. మొన్న వరాత్పరం ఒక సంబంధం చెప్పాడు. అబ్బాయి హౌస్ సర్జన్ చేస్తున్నాడట. చాలా చిన్న కుటుంబం వారిది. ఇంటికి ఆ అబ్బాయే పెద్దవాడు. ఆ అబ్బాయి తర్వాత మరో ఇద్దరు మగపిల్లలు, ఇద్దరాడ పిల్లలు. తల్లిదండ్రులు సంపాదన ఇంటి ఖర్చులకే సరిపోతుంది. ఆస్తిపాస్తులేమీ లేవు కాబట్టి తమ్ముళ్ళ చెల్లెళ్ళ బాధ్యత ఆ అబ్బాయిదే "

"మరి అటువంటి బాధ్యతలున్న అబ్బాయా ఎంత ఒకవేళ డాక్టర్ అయితే మాత్రం "కాస్త అసంతృప్తి ప్రకటించింది.

"చూద్దాం" విషయాన్ని తేల్చివేశాడు సత్యనారాయణ.

ఇక తరువాత కార్యక్రమం అన్నట్టుగా కామేశ్వరి పక్కకు తిరిగి ప్లేట్‌లోని తమలపాకులు తీసుకుని చిలకలు చుట్టి అతడి నోటికి అందివ్వసాగింది.

పది నిముషాల తర్వాతఅతడు ఆమెను దగ్గరగా తీసుకున్నాడు. కామేశ్వరి భర్త వక్షంమీదకు నవ్వుతూ తలవాల్చింది. ఒకరిలో ఒకరు ఒదిగిపోయారు.

సమయం వేగంగా గడిచింది. ఆ గదిలో గాలి వేడిగా నిట్టూర్చింది. తమలపాకుల చిలకల పర్పస్ నెరవేరింది.

మరో అర్ధగంట తర్వాత కామేశ్వరి పక్కకు పత్తిగిలి పడుకుని గాఢంగా నిద్రపోసాగింది.

అతడిది యధాస్థితే! వెల్లకిలా పడుకుని తిరిగి సీలింగ్ ఫ్యాన్ వంక చూడసాగాడు. ఎప్పటిలానే గత, వర్తమానాల బేరీజు వేసే ఆలోచనలు. గతంలో తనకిలాంటి, శారీరక సుఖం అంతగా దొరికేది కాదు. పెళ్ళయిన ఒకటీ రెండేళ్ళు కాస్త తాదాత్మ్యత అనుభవించినా, ఆ తర్వాత దానిమీద అంతగా ఇంట్రెస్ట్ లేకపోయింది. కారణం సుఖపడాల్సిన సమయంలో కూడా సమస్యలు గుర్తుకు రావడం. పగలంతా ఆఫీసులో బండచాకిరీ చేసి వస్తే, ఇంటికి వచ్చాక రకరకాల సమస్యలతో బుర్ర వేడెక్కేది. దాంతో శారీరకంగానూ, మానసికంగానూ అలసిపోయేవాడు. ఇక మరే కోరికా ఉండేది కాదు. ఒకవేళ కోరిక కలిగి కామేశ్వరి దరి చేరినా అలసటతోనో- తనపట్ల విసుగుతోనో ఆమె చీత్కరించుకునేది. ఆవేశాన్ని అణచుకునేవాడు తను.

అలా రోజులు గడిచాయి. పిల్లలకు కాస్త ఊహ తెలిశాక, ఉన్నది ఒకే గది కావడంతో పిల్లలు నిద్ర మధ్య లేస్తే, తమ కక్కుర్తిపని బయటపడుతుందేమోనని కోరికను అణచిపెట్టుకోవడం జరిగేది అలా మెల్లిగా శారీరక సుఖం పట్ల ఇష్టం తగ్గిపోయింది.

కాగా ఇప్పుడు ఏకాంతం దొరకడం, మరే ఇతర సమస్యలు లేకపోవడంతో అణచిపెట్టుకున్న కోరికలు తిరిగి పైకి లేచాయి. అందుకే ప్రతిరాత్రి వసంతరాత్రిలా సాగుతుందీ మధ్య.

ఆలోచనల మధ్యనే అతడికి నిద్రపట్టింది.

నిద్రలో అతడికి వసుంధర కనిపించింది. ఆమె ఆప్యాయంగా తనతో అంటుంది 'చూశావా సత్యం! భార్యతో శారీరకసుఖంకూడా డబ్బుమీద ఆధారపడి ఉంది. మరి డబ్బు గొప్పది కాదంటావా? అలా అయితే 'నీ సంగతేమిటని?' నన్ను ప్రశ్నిస్తున్నావా? ప్రతిదానికీ కొన్ని ఎక్సెప్షన్స్ ఉంటాయి. నాది అలాంటి కేసే '

ఆమె అతడి దగ్గరగా వచ్చింది. నుదుట మీద గాఢంగా ముద్దుపెట్టుకుంది. అతడి చుట్టూ చేతులు బిగించింది. ఒకింత తటబడి, అతడూ ఆమె నడుము చుట్టూ చేతులు వేశాడు. మరింత దగ్గరకు తీసుకుంటున్నాడు.

"ఐ లవ్ యూ సత్యం"

"ఐ టూ లవ్ యూ"

"బట్ మనీ మేక్స్ అజ్ డిఫరెంట్"

"ఇట్స్ ట్రూ"

"వాట్ కెన్ యూ డు ఫర్ మీ?"

"ఐ కెన్ ఎర్న్ మచ్ మనీ—బై ఆల్ మీన్స్—ఐ ఎర్న్ మనీ— అంతే! ఆమె హఠాత్తుగా అదృశ్యమయిపోయింది. ఆమె స్థానంలో పరాత్పరరావు ఉన్నాడు. ఆయన తన భుజం తడుతూ "డబ్బు సంపాదన అన్నది తీరని దాహం. దాని వెనుక ఎన్నో బాధలు,




అనంతృప్తులు వద్దు మనకు డబ్బువద్దు''

'నిజమే! డబ్బు వెనుక చాలా అనంతృప్తి ఉంది. అందుకే—'

''వద్దు వద్దు నాకు డబ్బు వద్దు'' నిద్రలోనే గొణుగుతున్నాడు సత్యనారాయణ.

★ ★ ★

కొడుకుతో మాట్లాడాలని తన గదికి రమ్మని చెప్పాడు సత్యనారాయణ.

సమయం ఉదయం ఎనిమిదిన్నరయి ఉంటుంది.

కొద్దిక్షణాల క్రితమే వారిద్దరూ కలసి టిఫిన్ చేశారు. ఆ ఇంజనీరు సంబంధం గురించి మాట్లాడేస్తే సరిపోతుందని, సునీల్‌ని రమ్మన్నాడు.

సునీల్ తండ్రిని అనుసరించి అతడి గదిలోనికి వెళ్లాడు.

''కూర్చో'' అన్నాడు సత్యనారాయణ.

కూర్చున్నాడు సునీల్. తనూ మంచంమీద కూర్చున్నాడు.

ఇద్దరి మధ్యా అరనిముషంపాటు నిశ్శబ్దం.

''ఎందుకు నాన్నా పిలిచారు?'' అడిగాడు సునీల్.

''అదే ... నీపెళ్లి విషయం మాట్లాడుదామని''

సునీల్ కొద్దిగా కంగారుపడ్డాడు. వెంటనే స్థిమితపడుతూ ''నా పెళ్లికి ఇప్పుడే ఏం తొందరొచ్చింది. ముందు నీరజ పెళ్లి కానివ్వండి'' చెప్పాడు.

''నీరజకు సంబంధాలు చూస్తున్నామనుకో ... నీకూ ఒక మంచి సంబంధం వచ్చింది. చీఫ్ ఇంజనీరు కూతురు. లక్ష రూపాయలవరకూ కట్నం. చదువు, అందం, అణకువ అన్నీ ఉన్నాయి. ఆయన ఇంజనీరు కాబట్టి, భవిష్యత్‌లో నీకు వ్యాపారపరంగా కూడా సహాయంగా ఉంటాడు. మీ అమ్మకు, నాకు ఈ సంబంధం ఎంతో నచ్చింది. ఇక నువ్వు 'ఊఁ' అంటే మిగతా ప్రయత్నాలు ప్రారంభమవుతాయి''

సునీల్ కొద్దిసేపు మౌనంగా ఉండి, ''సారీ నాన్నా! నాకిప్పుడే పెళ్లిచేసుకోవాలని లేదు''

అతడు కొడుకు వంక వింతగా చూశాడు. ''అదేమిటి?! ... అప్పుడు బిజినెస్‌లో సెటిల్ అయ్యేవరకూ పెళ్లి వద్దన్నావు. అంతవరకూ బాగానే ఉంది. మరిప్పుడు వ్యాపారంలో బాగా నిలదొక్కుకున్నావు. ఇక పెళ్లి చేసుకునేందుకేం?''

కొద్దిగా విసుగ్గా ముఖం పెట్టాడు సునీల్. ''నా మాట వినండి నాన్నా! ముందు నీరజకు పెళ్లి చేయండి. ఆ తర్వాత నా గురించి ఆలోచిద్దురు ... అసలు నాగురించి మీరేం ఆలోచించనవసరంలేదు. నా విషయం నేను చూసుకుంటాగా'' అని తండ్రి ముఖం వంక పరీక్షగా చూశాడు.

సత్యనారాయణకు ఆ మాటలలోని శ్లేష అర్థంకాకపోవడటంతో ''సరే. నీ ఇష్టం. నీకు ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడే పెళ్లి చేసుకో. ముందు దాని పెళ్లిచేసి నెత్తిన బరువు తగ్గించుకుంటే ... ఆ తర్వాత నీ విషయం ఎలాఉంటే అలా జరుగుతుంది'' అన్నాడు.

''ఆ పని చేయండి నాన్నా'' అంటూ ఆ గదిలో నుండి ఇవతలకు వచ్చేశాడు సునీల్.

మరు నిముషం అతడి స్కూటర్ స్టార్ట్ అయి గేటులోనుండి రోడ్డెక్కింది.

సత్యనారాయణ ఆఫీసుకు బయలుదేరాడు.

అతడికిప్పుడు ఆఫీసులో ఎలాంటి చీకాకులు లేవు. బిజీలేని సీటు. సుభావంగా ఉండటమే తప్ప బెదిరించలేని ఆఫీసరు, గౌరవంగా చూసి వందా, యాభై బదులు పుచ్చుకునే కొలీగ్స్ ... ఆఫీసు పని ఆనందంగా ఉంది.

కృష్ణారావుని పలకరించి తన సీట్లో కూర్చున్నాడు సత్యనారాయణ.

ఫైల్స్ తిరగేస్తుంటే మధ్యలో పరంధామం నుండి పిలుపు వచ్చింది. ఫైల్స్ తీసుకుని రూమ్ లోనికి వెళ్లాడు. పరంధామం అతడిని విష్‌చేసి, కుర్చీ చూపెట్టాడు. కూర్చున్నాడు సత్యనారాయణ. అతడి చేతిలోని ఫైల్స్ అందుకుని తిరగేసి, ఒకటీ - రెండూ తప్పులుంటే తనే సరిదిద్దుకుని సంతకాలుచేసి ఇచ్చేశాడు పరంధామం.

ఆ గదిలోనుండి బయటకు వచ్చేశాడు.

సాయంత్రం వరకూ ఆఫీసులో గడిపి, ఆఫీసు క్లోజ్ అయ్యాక తిన్నగా పరాత్పరరావు ఇంటికెళ్లాడు. "రేయ్ పరాత్పరం! గూడూరులో గంగిశెట్టి వారి సంబంధమేదో చెప్పావు - అబ్బాయి హౌస్ సర్జన్ చేస్తున్నాడనీ, బాధ్యతలు ఎక్కువనీ ... ఆ సంబంధాన్ని ఒకసారి చూసి వద్దామా?"

"అలాగే! ముందుగా ఆ అబ్బాయిని ఒకసారి రేపు చూసి వద్దాం ... ఎలాగూ ఇక్కడి హాస్పిటల్‌లోనేగా ఉండేది."

తలూపాడు సత్యనారాయణ.

మర్నాడు పరాత్పరరావు, అతడు, సునీల్ ముగ్గురూ కలసి హాస్పిటల్‌లోకి వెళ్లి ఆ అబ్బాయిని కలుసుకున్నారు. ఆ అబ్బాయిపేరు శివకుమార్. ఐదున్నర అడుగుల ఎత్తు, ఛామనఛాయ, అందంగానే ఉన్నాడు.

ఏదోపనిఉండిఅటుగావచ్చినట్టు ఆ అబ్బాయితో రెండు మాటలు మాట్లాడితే చక్కని సంస్కారవంతుడిలానే అగుపించాడు.

అబ్బాయికీ తండ్రీ కొడుకులు నచ్చారు.

మంచిరోజు చూసుకుని ఐదుగురు వ్యక్తులు కలసి గూడూరు వెళ్లారు. సంప్రదింపులు జరిగాయి. అబ్బాయి అమ్మాయిని ఇష్టపడితే తమకెలాంటి అభ్యంతరం లేదన్నారు అబ్బాయి తల్లితండ్రులు. వీళ్లు ఇస్తామన్న కట్నకానుకలు వారికి నచ్చాయి కూడా.

ఆ తర్వాత అబ్బాయి వచ్చి, అమ్మాయిని చూసుకున్నాడు. వధూవరులు ఒకరినొకరు నచ్చారు. దాంతో తాంబూలాలు పుచ్చుకుని, నిశ్చితార్థం చేసుకున్నారు.

ఇక పెళ్లి ప్రయత్నాలు మొదలయ్యాయి.

* * *

శుభలేఖలు తన చేతికి వచ్చిన క్షణాన అతడికి కలిగిన మొదటి ఆలోచన 'ఈ పెళ్లికి వసుంధరను పిలిస్తే ఎలా ఉంటుంది?' అని.

అదేమాట పరాత్పరరావుతో అంటే 'వయసు పెరిగేకొద్దీ నీలో ప్రేమ కూడా పెరుగుతున్నట్టుంది. మరి అనుమానం ఎందుకు? - పెళ్లి పిలుపు. పెద్ద వయసులు కాబట్టి, స్నేహితులమని చెప్పుకున్నా ఇరుపక్షాలవారికి పెద్దగా అనుమానమేమీరాదు ... ప్రొసీడ్"

మిత్రుడిచ్చిన ప్రోత్సాహంతో వెడ్డింగ్‌కార్డ్స్ పట్టుకుని మద్రాసు రైలెక్కేశాడు సత్యనారాయణ. వసుంధర అంతకుమునుపు ఇచ్చిన అడ్రసు తన దగ్గరే చాలా జాగ్రత్తగా ఉంది.

ఆ అడ్రసు పట్టుకుని ఇల్లు కనుక్కోవడం పెద్ద కష్టమేం కాలేదు.

ఆటోలోనుండిదిగి గేటు ముందుకు వెళితే, ఆల్సేషన్ కుక్క గొంతెత్తి పెద్దగా అరవసాగింది.

లాన్ పక్కగా కారు పక్కన నిలబడి ఉన్న వ్యక్తి బహుశా కారు డ్రైవర్ కాబోలు తనను చూసి గేటు దగ్గరగా వచ్చి "ఎవరు కావాలి"? అన్నాడు తమిళంలో.

"వసుంధరగారు" చెప్పాడు తను.

గేటు తీసి, లోపలికి రమ్మని సైగచేసి, అరుస్తున్న కుక్కను కసురుకుంటూ లోపలికి తీసుకెళ్లాడు డ్రైవర్. ఇంట్లో తిరుగాడుతున్న పనిమనిషికి తమిళంలో ఏదోచెప్పి బయటకు వెళ్ళిపోయాడు.

పనిమనిషి అతడిని కూర్చోమనిచెప్పి, మిద్దె మెట్లెక్కింది. ఓ నిముషం తర్వాత వసుంధర మెట్లుదిగి వచ్చి అతడిని చూసి ఆశ్చర్యపోయింది.

"వాటే సర్‌ప్రయిజ్! ... ఎవరో అనుకుని వినుక్కుంటూ దిగాను ...

ఏమిటీ విశేషం? ... అనుకోకుండా ఊడిపడ్డారేంటి? ... మా ఇల్లు వెతుక్కుని మరీ వచ్చారంటే పెద్ద విశేషమే ఉంటుంది?ఏమిటో...?"

అతడు చిన్నగా నవ్వాడు. "ఒక్కసారిగా అన్ని ప్రశ్నలడిగితే జవాబులు ఎలా చెప్పగలను? ... ముందు నువ్వు కూర్చో ... తర్వాత విషయాలన్నీ! ... అన్నట్టు మీవారు ఇంట్లో లేరా?"

"లేరన్నట్టుగా" తలూపి, నవ్వుతూ అతడికి ఎదురు సోఫాలో కూర్చుందామె.

"ఇప్పుడు చెప్పు విశేషాలేమిటో?"

"విశేషమంటే ..." అనీ ఆగి క్షణం తర్వాత





"నా కూతురికి పెళ్లి నిశ్చయమైంది. ఆ పెళ్లికి నిన్ను పిలవాలని, ఇలా వచ్చాను"

ఆమె ముఖంలో క్షణకాలం మెరుపుమెరిసి మాయమైంది. "పెళ్లికి పిలిచేందుకు వచ్చారా?" అంది విస్మయంగా.

"అవును"

"అరే! నా కోసం చాలా రిస్కు తీసుకుని మరీ వచ్చినట్టున్నారు ... ఏమిటో నామీద అంత అభిమానం" ఓరగా చూస్తూ ప్రశ్నించింది వసుంధర.

అతడు వెంటనే జవాబు చెప్పలేదు కింది పెదవి పైపంట నొక్కి పక్కచూపులు చూడటం మొదలుపెట్టాడు.

అతడి ఇబ్బందిని గమనించిన ఆమె నన్నగా నవ్వి, "పోనీలే ఏ భావమయితేనేం, నన్ను పెళ్లికి ఆహ్వానించాలనిపించింది ... పిలిచావు ... ఇంతకీ కాబోయే అల్లుడు చేసే ఉద్యోగమేమిటో?" అడిగింది.

"డాక్టర్"

ఆమె కళ్లు విస్ఫారితాలయ్యాయి. "డాక్టరా? ... అంటే యం.బి.బి.యస్.యేనా?" అనుమానంగా అడిగింది.

"అవును"

"బంధువా?"

"కాదు పరాయి సంబంధమే!"

"కట్నం ఏ మాత్రమేమిటి?"

"వరకట్నంగా లక్ష రూపాయలు. ఆ తర్వాత లాంఛనాలూ, అవీ ఇవీ అన్నీ కలిపి లక్షన్నర అవుతుందనుకుంటున్నాము"

ఆమె నమ్మలేనట్టుగా చూసింది. తాలూకా ఆఫీసులో పదమూడు వందల రూపాయల గుమస్తా, ఎన్నో బాధ్యతలుమోసి, అప్పులపాలయి ఉన్నవ్యక్తి తన కూతురికి లక్షన్నర ఖర్చుపెట్టి పెళ్ళిచేస్తున్నాడంటే ... మొత్తానికీ బాగానే సంపాదిస్తున్నట్టుంది. అదే మాట అడిగేసిందామె "అయితే బాగా సంపాదిస్తున్నారన్నమాట" నవ్వుతూ.

సత్యనారాయణ తల అడ్డంగా ఆడించాడు. "సంపాదించింది కాదు. అదృష్టం తీసుకొచ్చి ఇచ్చింది"

"అంటే?" ప్రశ్నార్థకంగా చూపులు విసిరింది.

"అదృష్టం లాటరీ రూపంలో ఏడు లక్షలు పొందేలా చేసింది. నన్ను హఠాత్‌గా లక్షాధికారిని చేసింది"

అతడు గుర్తించలేదుగాని, తను లక్షాధికారి నయిన విషయం ఆమెకు చెప్పాలని మనసు లోతులలో మెదలాడే కోరిక ఇప్పుడు బయటపడింది. అంతర్గత కోరికను తొలిసారిగా గుర్తించాడు అతడు.

వసుంధర విస్మయపడింది. కొద్దిక్షణాల తర్వాత ఆశ్చర్యం నుండి తేరుకుని ఆనందం వ్యక్తం చేసింది. "యూ ఆర్ లక్కీ! ... అనుకోకుండా మీరు నేను ఊహించనంత ఎత్తుకు ఎదిగిపోయారు. ఐ కంగ్రాట్స్ యూ"

అదిగో ... అలాంటి మెచ్చుకోలు పదమే అతడు ఆమె నుంచి ఆశించింది. 'ఓ మై డార్లింగ్! ఒకప్పుడు నువ్వు డబ్బులేదని తీసిపారేసిన గుమస్తాపీనుగే, ఈనాడు లక్షాధికారిలా నీ ఎదుట నిలచాడు. నీలాగే ఉన్నత స్థితిలో ఉన్నాడు ... చెప్పు! ఒకప్పుడు నువ్వు చేసింది తప్పు కదూ!' మనసులోని మాటలవి.

అర్ధగంట వరకూ డబ్బు గురించిన చర్చ. వచ్చిన డబ్బు రియల్ ఎస్టేట్ బిజినెస్‌లో పెట్టడం, అందులో కలసిరావడం, కొత్తగా ఇల్లు కొనడం ... అన్నీ ఆమెకు వివరించి చెప్పాడు అతడు. అలా వివరిస్తుంటే అదో మానసికానందం. తన స్థితి గుర్తించవలసినవారు గుర్తించేప్పుడు మనిషికి అదోలాటి ఆనందం కలుగుతుంది.

కొద్దిసేపటి తర్వాత అతడు లేచేందుకు సిద్ధమయ్యాడు. "వెళ్ళొస్తాను"

"మధ్యాహ్నం భోంచేసి వెళ్లండి" అర్థిస్తున్నట్టుగా అన్నదామె.

కాదనలేకపోయాడు సత్యనారాయణ.

"మీవారు" సందిగ్ధంగా అంటే "ఆయన వస్తే నీకేం? ... ఇద్దరికీ పరిచయం చేస్తాను. ఆయనకూ నీలాంటి ధనవంతులతో స్నేహం చేసేందుకు ఎలాంటి అభ్యంతరం ఉండదు ... అయినా ఆయన అర్ధరాత్రిలోపు ఎట్టి పరిస్థితిలోనూ రాడులే..."





మధ్యాహ్నం తన కోసం స్పెషల్‌గా వండించింది వసుంధర. డైనింగ్ టేబుల్ దగ్గర పక్కపక్కనే కూర్చుని ఆమె వడ్డిస్తుంటే తినడం ... మనసంతా ఉద్విగ్నంగా అయింది. "ఈ మేడ లోనికి అడుగుపెట్టగలిగిన ధైర్యం, చొరవ తనకు డబ్బు ద్వారా వచ్చినవే కదా" అనుకున్నాడు సత్యనారాయణ. 'ఏమయినా డబ్బు ద్వారా చాలా ఆనందాలు పొందవచ్చు' అనిపించింది అతడికి.

ఆ సాయంత్రం టాక్సీ ఎక్కి తిరిగి రైల్వేస్టేషన్ చేరుకున్నాడు సత్యనారాయణ.



పెళ్ళికి ఆహ్వానింపబడినవారంతా వచ్చారు.

వరాత్పరరావు, కృష్ణారావు, పరంధామం, సునీల్ స్నేహితులు చాలామందే వచ్చారు.

వసుంధర పెళ్ళికి వస్తుందో, రాదో అని ఊగిసలాడే సత్యనారాయణ మనసు, ఆమె పెళ్ళిటయిముకు ఒక గంటముందుగానే ఆటోలో దిగడం చూసి హాయిగా నిట్టూర్చాడు.

ఆమె అలా దిగడం చూసి, వరాత్పరరావు సత్యనారాయణకేసి అదోలా చూసి కన్నుగొట్టాడు నవ్వుతూ. సత్యనారాయణ మిత్రునిచూసి సిగ్గుగా నవ్వాడు.

అటుగా వెళ్ళి ఆమెను పలకరించాడు. "రావేమోననుకున్నాను" అంతే "అయ్యబాబోయ్! రాకపోతే మీరు జీవితాంతం పలకరేమో కదా!" అంది నవ్వుతూ.

"ఇంతకీ మీవారు"

"మీరు చెప్పింది నాకేగాని, ఆయనకు కాదుగా. అయినా ఆయనకు ఇలాంటి పెళ్ళిళ్లకు రావాలంటే చాలా విసుగు"

"మరి ఎవరి పెళ్ళికని చెప్పివచ్చావు?"

"ఆయనకు అవన్నీ చెప్పాల్సిన అవసరంలేదు. పెళ్లికి నెల్లూరు వెళ్లాలంటే అలాగే, వెళ్ళిరా అంటాడు అంతే"

నవ్వాడు అతడు. ఆమెను వెంటబెట్టుకుని వెళ్ళి ఓ కుర్చీలో కూర్చోబెట్టి 'మళ్ళీ కలుస్తాను' అని ఇవతలకు వచ్చేశాడు.

వారిద్దరూ నవ్వుతూ మాట్లాడుకోవడం చూసిన కామేశ్వరి ఆరాగా అడిగింది. "ఎవరావిడ?"

"కాలేజీలో స్నేహితురాలు" జవాబిచ్చి అవతలకు వెళ్లాడు. కామేశ్వరి రెట్టించలేదు.

వరాత్పరరావు పక్కన నిలబడితే "మొత్తంమీద నీమాటకు చాలా విలువుందోయ్. నీ పాత ప్రేయసి నీకోసం మద్రాను నుండి పరిగెత్తుకొచ్చిందంటే ఈ వయసులో కూడా నీ ఆకర్షణ శక్తి ఏమాత్రం తగ్గిపోలేదన్నమాట" ఆటపట్టిస్తూ అన్నాడు.

అతడూ పైకి నవ్వాడు. మనసులో మాత్రం "ఈ ఆకర్షణశక్తి నాకీమధ్య కొత్తగా వచ్చింది. మొదట నుండీ ఆకర్షణశక్తే ఉంటే ఆనాడు, నేను ప్రేమించిన అమ్మాయి నన్ను వదలి మద్రాను ఎందుకు వెళుతుంది... నాకు కొత్తగా వచ్చిన ఆకర్షణ శక్తికి మూలకారణం డబ్బు" మనసు బాధగా నిట్టూర్చింది. మనసులోని వ్యధ బయటకు కనుపించదుగా!

పెళ్లిపనులు చాలావరకూ వరాత్పరరావే నెత్తిన వేసుకున్నాడు. కృష్ణారావు ఆయనకు పనులలో సహాయపడుతూ ఉన్నాడు. పరంధామం పెళ్ళికి వచ్చినా ముఖం గంటు పెట్టుకునే ఉన్నాడు. పావం! అతగాడి బాధ అతడిది. ఎవరేం చేయగలరు. తన చూపులన్నీ సునీల్‌మీదే ఉన్నాయి కాని సునీల్ తనకు అందనంత ఎత్తులో ఉన్నాడని కూడా తెలుస్తోంది.

సత్యనారాయణ కొలిగ్స్ అందరూ ఒకపక్క చేరి సమస్యలు చర్చించుకుంటుంటే, సునీల్ స్నేహితులందరూ మరోపక్క కబుర్లాడుకుంటున్నారు.

అటుగా వెళ్తున్న సత్యనారాయణకు వారి కబుర్లమధ్య ఇంటరెస్టింగ్ టాపిక్ దొరికిన

ట్లుగా అనిపించి ఆ చోటనే ఆగిపోయాడు.

ఇద్దరు మిత్రులు 'డబ్బు' అనే దానిమీద చర్చించుకుంటున్నారు.

"ఈలోకంలో అన్నింటికంటే విలువయింది డబ్బేరా. డబ్బుంటే చాలు ఈ ప్రపంచంలో ఏదయినా పొందొచ్చు"

నన్నగా ఉన్నాడు ఆ కుర్రాడు. పాతికేళ్ళుంటాయేమో! కళ్ళు తీక్షణంగా, చురుకుగా ఉన్నాయి. బహుశా ఈ వయసులోనే జీవితంలో చాలా ఎదురుదెబ్బలు తిన్నాడేమో లోకంతీరు చాలావరకూ అర్థంచేసుకున్నట్టుంది.

పక్కనున్న కుర్రాడికి కూడా అదే వయసుంటుంది. ఒకింత బొద్దుగా, తెల్లగా అటు పొట్టి ఇటు పొడవుకాకుండా మధ్యస్థంగా ఉన్నాడు. ముఖంలో ఇంకా అమాయకత్వం కలదలాడుతోంది. పుట్టుకతోనే ధనవంతుడేమో ఏ బాధలూ లేకుండా పెరగటంమూలానా "నేను మంచివాడిని ఈ లోకమంతా మంచిదే" అనే స్థాయిలోనే ఉన్నాడు ఇంకా.

"డబ్బుంటే చాలు ఏదయినా పొందొచ్చు అనుకోవడం వట్టి అమాయకత్వంరా భాను! లోకంలో డబ్బుకు దొరకనివి చాలా ఉన్నాయి"

"ఏమిటో అవి?" భాను గొంతులో ఒకింత వ్యంగ్యం.

"ప్రేమ, ఆప్యాయత, అభిమానం... ఇలాంటివి కేవలం డబ్బుద్వారానే పొందగలమనుకోవడం చాలా పిచ్చితనం"

"నీకు ఎవరి ప్రేమ కావాలి. బ్రూక్‌షీల్డ్స్‌ది కావాలా? బోడెరెక్‌ది కావాలా? లేకపోతే ఇండియన్ గర్ల్ శ్రీదేవి ప్రేమ కావాలా?— లేక పమెల్లా బోర్డ్సది కావాలా? ఓ వంద మిలియన్ల డాలర్లు నీదగ్గర ఉంచుకో... ఈ ప్రపంచంలో ఎవరి ప్రేమ కావాలంటే వారి ప్రేమ తప్పక దొరుకుతుంది. కాకపోతే ఒక్కొక్కరి ప్రేమ— ఆప్యాయతలకు ఒక్కో రేటు ఉంటుంది. రోడ్డు పక్క చిలకమ్మ ప్రేమ కావాలంటే పాతిక రూపాయలు. పమెల్లా ప్రేమ కావాలంటే ఫైవ్ థవుజండ్స్ పౌండ్స్. అంతే తేడా! ఈ లోకంలో డబ్బుంటే దొరకనిదంటూ ఏదీ లేదు. మైండిట్... మైడియర్ ఫ్రెండ్ మధూ"

మధు ముఖం కాస్త ఎర్రగా కందిపోయింది. "నేను చెప్పేది రూపాయల కమ్ముడుపోయే మనస్తత్వం ఉన్న ఆడవారి సంగతి కాదు... స్వచ్ఛంగా, నీతిగా బతికే మనుష్యుల ప్రేమాభిమానాల గురించి" ఒకింత కోపంగా అన్నాడు.

"నీతి, స్వచ్ఛత అనేపదాలు నాకు తెలియవు. అలాంటి విశేషణాలున్న వ్యక్తులు ఈ లోకంలో ఉన్నారో లేదో కూడా నాకు అనుమానమే... కాకపోతే సాధారణ మానవులలో ఇంచుమించుగా అందరూ ఆ డబ్బుకు లొంగిపోయేవారే! ప్రతీ మనిషి, మనిషిని లొంగదీసుకుకోవడంలో కొంత వ్యత్యాసం చూపించవలసి వస్తుంది. భార్యామణి ప్రేమ, అభిమానం పొందాలనుకున్నావనుకో ఆమెకు ఓ కొత్తచీర బహుకరించాలి. లేకుంటే ప్రేమించే ప్రియురాలి నుండి దూషణ ఛీత్కారాలు ఎదుర్కోవలసి వస్తుంది... అలాగే అందరూ. సో! కట్టుకున్న భార్యనే చీర అనే లంచం ఇవ్వవలసి వచ్చినపుడు... ఆలోచించు ఇక ఇతరుల గురించి. అసలు నిస్వార్థంగా ప్రేమ ఆప్యాయతలన్నవి ఊహకందని విషయాలు"

"అంటే తల్లి ప్రేమ కూడా స్వార్థంతో కూడుకున్నదేనని నీ ఉద్దేశమా"

"తల్లి ప్రేమను స్వార్థానికి ముడిపెట్టడం ఒప్పుకోతగిందికాదు. కాని... చాలావరకూ తల్లి ప్రేమ కూడా డబ్బు సంబంధిత స్వార్థ చట్రంలో ఇరుక్కుపోతుంది. చిన్న వయసున్న పిల్లలందరిమీద సాధారణంగా ఒకేవిధంగా ఉంటుంది. ఒకవేళ బలవంతుడు, బలహీనుడు అని వ్యత్యాసాలు గమనించి బలహీనుడికి ఒకింత ఆహారం ఎక్కువ పెట్టొచ్చేమోగాని, ప్రేమమాత్రం తన పిల్లలందరికీ సమంగా పంచి ఇస్తుంది. అయితే ఆ పిల్లలు పెరిగి పెద్దయ్యాక ఏ బిడ్డయితే ఎక్కువ సంపాదించడమో లేదా తనను పోషించడమో చేస్తే ఆ బిడ్డమీద కాసింత ఎక్కువ ప్రేమ చూపించడం సర్వసాధారణమయిన విషయం... అదేమని ప్రశ్నిస్తే 'పాపం! ఆ బిడ్డ కష్టపడుతున్నాడమ్మా' అంటూ జాలి చూపిస్తుంది. 'అమ్మ' అన్నది చాలా పవిత్ర పదం. కానీ ఆమె అయినా లోకానుగుణ్యంగా నడుచుకోకతప్పదు లేకపోతే ఆమెకూ స్థిరత్వం ఉండదు... ఇది ఏ





# ఏరిన ముత్యాలు

★ త్యాగం చెయ్యండని ప్రజలకు బోధించడం వట్టిదగా, సామాన్య ప్రజలు త్యాగం చెయ్యాల్సిందేముంది- ప్రాణాలు తప్ప.

— గోర్కీ

★ విత్తనం మహావృక్షంగా మారటానికి మొదట భూమిలో తన శరీరాన్ని నశింపజేసుకుంటుంది. అట్లే స్వార్థపరిత్యాగం చేతనే మనకు కార్య విజయం చేకూరుతుంది.

— స్వామి రామతీర్థ

★ అన్నిసద్గుణాల్లోనూ దయకు మొట్టమొదటి స్థానం లభిస్తుంది.

— గాంధీజీ

★ పాపులు, వృద్ధులు, దుఃఖితులయెడ దయచూపనివాన్ని నేను మానవునిగా తలంచను, వాడు కేవలం రాక్షసుడే.

మార్కండేయ పురాణం

★ మూగవాళ్లు పలికే భాష, చెవిటివాళ్లు విని అర్థం చేసుకోగలిగే భాష దయ.

— బోవీ

★ వయసుమళ్లినవారికి అందుబాటులో ఉండే సుగుణమే దయ. తెల్లవెంట్రుకల పెద్దలకు అదే అలంకారం.

— ఫేయూల్

★ మనిషిలో మార్దవం ఎంత తక్కువగా ఉంటే అంత ఎక్కువగా దానిని ఇతరులనుండి ఆశిస్తాడు.

— పెర్కిలస్

★ ఈశ్వరుని దయకోసం ప్రార్థించే ముందు మనం ఇతరులపై దయచూపడం నేర్చుకోవాలి.

— షేక్స్‌పియర్

★ దయలేనివాడిలో ఏ సద్గుణం ఉండదు.

— హజరత్ మహమ్మద్

★ బలహీనులపై దయచూపనివాడు తనకంటే బలమైనవారి అత్యాచారాలను సహించవలసి వస్తుంది.

— షేఖ్‌సాది

★ ప్రపంచాన్ని సంస్కరించదలిస్తే, ఆ పని తల్లులదగ్గర నుండే ప్రారంభం కావాలి.

—సిమ్మన్స్

★ ఒక మంచి తల్లి వందమంది ఉపాధ్యాయులతో సమానం.

★ తల్లిమేలు కోరని తనయులుండవచ్చు కాని, కొడుకుల మేలుకోరని తల్లి ఉండదు.

— శంకరాచార్య

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

తల్లికయినా తప్పనిసరి పరిస్థితి....''

ఎంత విపులీకరించినా, అవతలివారి వాదనలో నిజముందని గ్రహించినా, తన వాదనను వదులుకోవడం మధుకు ఇష్టంలేదు. ''నీవు చిన్నప్పటినుండీ ప్రేమ, అభిమానాలు ఎరుగవు కాబట్టి, వాటిని గురించి తక్కువచేసి మాట్లాడుతున్నావు. ఈ విషయంలో నువ్వు 'అందని ద్రాక్షపళ్లు...' అనే సామెతను నిజం చేస్తున్నావు. అయితే ఒక్కసారి- జీవితంలో కనీసం ఒక్కసారి ప్రేమ, అభిమానం, ఆప్యాయతలను రుచి చూసినవాడెవడూ, ప్రేమకన్నా డబ్బు విలువయినదంటే ఎట్టి పరిస్థితిలోనూ ఒప్పుకోడు... యు ఆర్ ఎ మెటీరియలిస్ట్. నీకు ప్రేమ, ఆప్యాయతల విలువ ఏమాత్రం తెలియదు....''

మధు మాటలకు భాను హర్ట్ అయినట్టుగా కనిపించలేదు. విరక్తిగా నవ్వాడు. ''ప్రేమ, ఆప్యాయతలు డబ్బుకన్నా విలువయినవి. ఒక్కసారి ఆ అపురూప భావనలు రుచిచూస్తే, వాటిముందు డబ్బు తుచ్ఛమయినది అని అనిపిస్తుంది అన్నదే నీ నమ్మకమయితే, అలాగే కానివ్వు. దానిని కాదనే హక్కు నాకు లేదు. ఎవరివైపు వాదన వారివైపు ఉంటుంది. అయితే నాకు తెలిసిన నిజం మనీ ఈజ్ ఓన్లీ ది గ్రేట్. అందుకు మరొక రుజువు, జాక్వెలిన్ కెనెడీ. అమెరికన్ ప్రజలు కెనెడీ దంపతులను ఎంతగానో ప్రేమించారు, ఆదరించారు, ఆప్యాయత కురిపించారు. అంటే అమెరికన్ ప్రజల ప్రేమ, ఆదరాభిమానాలు పొందింది జాక్విలిన్. అయితే కెనెడీ మరణానంతరం ఆమె ఒనాసిస్ అనే ఓ ధనవంతుడిని పెళ్లాడింది. ఆమెకు తెలును- అమెరికన్స్ ఎంత విచ్చలవిడి మనస్తత్వాలు కలిగినా, తమ నాయకులు, వారి భార్యలు పవిత్రంగా ఉండాలని కోరుకుంటారని. కాబట్టే అక్కడ మన ఇండియాలోలాకాకుండా, నాయకుల రహస్య కార్యకలాపాలు ఏమాత్రం బయటపడినా పత్రికలకెక్కి రాజీనామావరకూ దారితీస్తుంది. ఇక అమెరికన్ ప్రజల ప్రేమ, ఆప్యాయత చవిచూసిన జాక్విలిన్, ఆ ప్రేమ, ఆప్యాయతలకోసమే జీవించి ఉండకూడదూ? తమ ప్రజలు అసహ్యించుకుంటారని తెలిసికూడా డబ్బున్న మరో మనిషిని ఎందుకు పెళ్లాడింది? ఆమెకు తెలియదా- డబ్బుకన్నా ప్రేమ, ఆప్యాయతలు చాలా గొప్ప భావనలనీ?... ఆవేశపడకు! సావధానంగా ఆలోచించు!... ఈ ప్రపంచం దేనిచుట్టూ తిరుగుతుందో నీకే అర్థమవుతుంది.....''

సత్యనారాయణ ఆ యువకునివైపు అభినందనపూర్వకంగా చూశాడు.... 'అచ్చం తన మనసులోని భావాలే ఆ యువకుని నోట పలికాయి. తన భావాలకు ప్రతిరూపంలా ఉన్నాడు... పాపం! ఇలాంటివారు హిపోక్రసీ లేకుండా లోకంతీరు సూటిగా చెపుతారు. కాని హిపోక్రసీ బతుకులు బతికే ఈ జనం ఆ దారుణ వాస్తవాలను విని తట్టుకోలేరు. అలాంటి మనిషిని 'మెటీరియలిస్ట్'లు అని అంటారు...'

ఎవరో పిలవడంతో అతడి ఆలోచనలు ఆగాయి. తల తిప్పుకుని అటుగా వెళ్లాడతను.

పురోహితుడు పెళ్లిపీటలమీదున్న వధూవరులముందు కూర్చుని ఏదో వస్తువు అవసరపడి తనను పిలిచాడు. ఆ వస్తువును తెమ్మని మరొకరిని పురమాయించాడు సత్యనారాయణ.

పెళ్లిపీటలమీద కూర్చుని ఉన్న వారిద్దరి వంకా చూస్తే, అతడి మనసు తృప్తిగా నిట్టూర్చింది. వారిద్దరూ చక్కని జోడీ. చిలకా గోరింకల్లాగున్నారు. చక్కని అల్లుడిని సంపాదించుకోగలిగినందుకు అందరూ అతడిని అభినందించినవారే.

శివకుమార్ లేచి నీరజ మెడలో తాళి కడుతున్నాడు... జరిగిపోయింది. తను జరపలేననుకున్న ఒక కళ్యాణం జరిగిపోతుంది. అతడి మనసు ఉద్విగ్నతకు లోనయింది.

పెళ్లి జరిగిపోయింది.!

వసుంధర 'నేనిక వెళ్తాను' అంటే, 'ఉండమని' బలవంతపెట్టాడు సత్యనారాయణ. తన కొత్త ఇల్లు చూసి వెళ్లమన్నాడు. ఆమెను కారులో తీసుకువెళ్లి తన ఇల్లంతా చూపించాడు.

'అబ్బో! చాలా పెద్ద ఇల్లే... మా ఇంటికన్నా కూడా బాగుంది.' ఆ మాటతో అతడి 'ఈగో' తృప్తిపడింది.





అతడు ఆమెను కారులోనే వారి బంధువు లింట దించిరమ్మని డ్రైవర్నిచ్చి పంపాడు. కారు కదిలేముందు డోర్‌లోనుండి తలపెట్టి "అప్పుడప్పుడూ వస్తుండు వసుంధరా" అన్నాడు జాలి గొంతుకతో.

ఆ మాటకు వసుంధర తలూపింది. కారు కదులుతుంటే ఇద్దరి మనసులు బరువెక్కాయి. "మళ్లీ ఎప్పుడో, ఎక్కడో కదా అని నిట్టూర్చాడు సత్యనారాయణ.

అంతలోనే మరో ఆలోచన. ఈ లోకంలో అన్నిటికంటే డబ్బే ముఖ్యమయినది అనుకుంటే- మరి తన మనసులో ఈ భావనలేమిటి?... ఈ క్షణంకూడా 'వసుంధరకోసం ఏదయినా త్యాగం చేయగలను' అన్న 'మానసిక బలహీనతకు' కారణం ఏమిటి? ఇదేనా ప్రేమంటే?!... మరి వసుంధర ప్రేమకోసం ఏదయినా త్యాగం చేయగలననుకుంటే- అంటే డబ్బుని కదా!... సో! ప్రేమకోసం డబ్బునికూడా త్యాగం చేయొచ్చా! దట్ మీన్స్- డబ్బుకన్నా ప్రేమ గొప్పదా? ఏమో?!

అవసరందృష్ట్యా, కాలానుగుణంగా మనసుకు ఒక్కొక్కసారి ఒక్కోటి ప్రాధాన్యతకలదిగా కనిపిస్తుంటుంది.

★ ★ ★

సునీల్ రియల్ ఎస్టేట్ బిజినెస్‌లో బాగా సంపాదించడంతో, ఆ డబ్బుతో బిల్డింగ్ కాంట్రాక్టులు తీసుకోవడం మొదలుపెట్టాడు. ఫస్ట్‌క్లాస్ కాంట్రాక్టర్‌గా రిజిస్ట్రేషన్ చేయించుకున్నాడు. అందుకు కావలసిన సాల్వెన్సీ, తదితర సర్టిఫికేట్స్ అన్నీ డిపార్ట్‌మెంట్‌కు అందించాడు ఆర్ & బి, పి.డబ్ల్యు.డి., ఇరిగేషన్- అన్ని డిపార్ట్‌మెంట్స్‌లో రిజిస్ట్రేషన్ జరిగింది.

కాంట్రాక్టు పనులలోకూడా మంచి లాభాలే రావడం మొదలుపెట్టాయి. ఇక కొడుకుకు పెళ్లి చేసేస్తే తన చివరి బాధ్యత తీరిపోతుందనుకున్నాడు సత్యనారాయణ.

ఆరోజు కొడుకు కొత్తగా కొన్న కారులో ఆఫీసుకు బయలుదేరుతుంటే తనూ వస్తానని వెంట కదిలాడు అతడు.

కారు నల్లనిరోడ్డుమీదమెల్లగా సాగిపోతోంది. అతడు తలతిప్పి కొడుకువంక చూసి చెప్పాడు- "సునీ! నాకింకొక్క బాధ్యతే మిగిలి ఉందిరా. అదొక్కటి తీర్చేసుకుంటే... నాకు చాలా నిశ్చింత"

"ఏ విషయం నాన్నా మీరు మాట్లాడేది?" దృష్టిని రోడ్డుమీదనుండి మరల్చకుండానే అడిగాడు సునీల్.

"నీ పెళ్లి విషయం"

సునీల్ పెదవులు బిగపట్టాడు. క్షణం నిశ్శబ్దం.

"నా పెళ్లికి అప్పుడే ఏంతొందరొచ్చింది నాన్నా"

"నీరజ పెళ్లికి ముందుకూడా ఇలాగే అన్నావు, నీరజ పెళ్లయినతర్వాత ఆలోచిద్దామన్నావు".

ఎదురుగా వస్తున్న మారుతికారు, వారి అంబాసిడర్‌ను దాటుకుని వేగంగా ముందుకు వెళ్లిపోయింది. సునీల్ తన ఏకాగ్రతనంతా డ్రైవింగ్‌మీద కేంద్రీకరించాడు. ఆలోచనలుమాత్రం తండ్రికి చెప్పాల్సిన సమాధానంగురించే సాగుతున్నాయి.... ఎలా చెప్పాలి!... నాన్నకు ప్రసూన విషయం ఎలా చెప్పాలి? కులంకాని కులానికి చెందిన తన డియర్ గురించి ఆయనకు ఎలా వివరించాలి? తన ప్రేమ ఎలా విపులీకరించాలి?

ఆలోచనలమధ్య సమాధానం చెప్పలేకపోయాడు. సునీల్ ఇంతలో సత్యనారాయణ తన ప్రశ్నను మరోసారి రెట్టించాడు. ఇక చెప్పకతప్పలేదు సునీల్‌కు "నాన్నా! నేను పెళ్లిచేసుకుంటాను కాని.... మీరు చూపించిన అమ్మాయిని కాదు, నాకు నచ్చిన అమ్మాయిని"

సత్యనారాయణలో మొదటిసారిగా లీలగా ఏదో అనుమానం ప్రవేశించింది.

"నచ్చిన అమ్మాయంటే....?"

మునుగులో గుద్దులాట అనవసరమనుకున్నాడేమో, సునీల్ మొదట తటపటాయించినా, తర్వాత సూటిగానే చెప్పాడు- "నేనూ, ప్రసూన అనే అమ్మాయి ప్రేమించుకుంటున్నాం నాన్నా.. పెళ్లి చేసుకోవాలనికూడా అనుకుంటున్నాం... ప్రసూన చాలా మంచి అమ్మాయి. ఆమెను ఒక్కసారి చూస్తే నా

సెలక్షన్ తప్పుకాదని మీరే అంటారు...."

కొద్ది క్షణాలవరకూ అతడి మెదడు పనిచేయలేదు. తన కనులముందు తలెత్తి సూటిగా మాట్లాడలేని కొడుకు, ఇప్పుడు తన పెళ్లిగురించి అంత సూటిగా మాట్లాడటం ఆశ్చర్యమనిపించింది. అంతలోనే 'ఎంతయినా వాడిప్పుడు సంపాదనాపరుడయ్యాడు. సంపాదన మనిషికి ఎక్కడాలేని ధైర్యం కలిగిస్తుంది' మనసులోనే అనుకున్నాడు అతడు.

ఇంతలోనే మరో ఆలోచన! చాలా ఆందోళన కలిగించే ఆలోచన? 'ఆ అమ్మాయి కులం ఏమిటి?'

ఆ ప్రశ్నకు సునీల్ గుటకలు మింగాడు. మరోసారి రెట్టిస్తే అప్పుడు చెప్పాడు ప్రసూన కులమేమిటో!

అది వినడంతోనే, ఈదురుగాలికి కంపించే చిగురుటాకులా వణికిపోయాడు సత్యనారాయణ.

కులాంతర వివాహం!

'సమాజం మారింది. విద్యాధికుల సంఖ్య పెరిగింది. ప్రతిదానికీ రీజన్ తెలుసుకోవాలని కోరడంతో మూఢనమ్మకాలు పటాపంచలవుతు



న్నాయి. కులాలు, మతాలు మానవ నిర్మితాలనీ, వాటివలన మనుష్యులకు ఎన్నో వేదనలు కలుగుతున్నాయని తెలుసుకుంటున్నారు జనం. కాని... మనిషి తనచుట్టూ పేరుకుని ఉన్న అజ్ఞానపు పొరను చీల్చుకుని వచ్చేందుకు ఏమాత్రం ప్రయత్నించడంలేదు. కులాల, మతాల అడ్డుగోడలు తమలో తమకు కలహాలు కలిగిస్తున్నాయని తెలిసినా, ఆ అడ్డుగోడ పడగొట్టలేకున్నారు. సమాజం ఎంత ఆధునికత నంతరించుకున్నా ప్రాచీనకాలపు అవశేషాలు కులం, మతాల ప్రాధాన్యత కొంత కూడా తగ్గలేదు. ఇలాంటి కులాధిక్యత ఉన్న సమాజంలో... కులాంతర వివాహం అంటే....' తన ఇంట్లో రగులుకోబోతున్న కొత్త చిచ్చు గురించి తీవ్రంగా మథనపడసాగాడు సత్యనారాయణ.

ఓరగా రోడ్డువంక చూస్తూనే, మరోవంక తండ్రి ముఖంలోని భావాలను గమనించసాగాడు. ఆయనలోని సంఘర్షణ అర్థమయింది.

"నాన్నా... కులాంతర వివాహం అంటే మీరంతగా బాధపడవలసిన అవసరంలేదు. కాలంమారింది. మనుష్యులలో కులాలపట్ల ఏవగింపు మొదలయింది. ఆ అడ్డుగోడలను పడగొట్టాలని యువతరం ప్రస్తుతం ప్రయత్నిస్తోంది. అయినా... మీరూ ఆలోచించండి నాన్నా! ఈ కులాలు, మతాలు అన్నవి ఏమిటి? ప్రతి మనిషిలోనూ ప్రవహించేది ఆ ఎర్రని నెత్తురేకదా!.... ఒక మనిషిని ఎదురుగా నిలబెడితే అతడిది ఏ కులమో మీరు చెప్పగలరా?... చెప్పలేరు. అడిగి తెలుసుకోవాలి. అయినా కులాలు అడిగి తెలుసుకోవలసిన అవసరం ఏముంది? మనకు కావలసింది మనిషి ప్రవర్తన, తెలివితేటలు మొదలైనవికాని, కులం కాదుగదా! అసలు 'కులం' అన్న సృష్టియొక్క విలువేమిటి? దాని ప్రత్యేకత ఏమిటి?..."

మరో సందర్భం అయిఉంటే కొడుకుయొక్క ఆవేశానికి, ఆదర్శానికి ఆనందించిఉండి ఉండేవాడు. కాని ఆ ఆవేశం, ఆదర్శాలు తన కొంపలో చిచ్చు పెడతాయని తెలుస్తూంటే ఎలా సంతోషించగలడు?... తన ఉద్దేశంలో తనెంతో ఆదర్శవంతుడు. ఈ లోకంతీరువట్ల బాధపడుతుంటాడు. కుల, మత విద్వేషాలవలన జరిగే ఘోరాలపట్ల చలించుకుపోతుంటాడు. ఈ కులమతాలు లేకుండాపోతే బాగుండునని అనుకుంటాడు... అటువంటి తను?!.... మనిషిలో ఏమిటీ విపరీత ధోరణి? బహుశా ప్రతి మనిషిలో ఏమూలో ఆదర్శాలుంటాయి. కాని మనుష్యుల్లో సాహసప్రవృత్తి తక్కువ. ఎవరుకూడా జీవితానికి ఎదురీదాలనుకోరు. అందరూ వాలుకు అనుగుణంగా సాగిపోయేవారే. మరి తన బిడ్డ సమాజానికి ఎదురీది కష్టాలు కొని తెచ్చుకోవడం ఏ తండ్రిమాత్రం అంగీకరించగలడు?

అతడు చెప్పాడు- "సునీల్....నీ నిర్ణయాన్ని నేను హర్షించలేకపోతున్నాను. కాలం మారి ఉండొచ్చుకానీ కొన్ని విషయాలలో మనుష్యులలో ఏమాత్రం మార్పులేదు. మరో గ్రహంమీద కాలు మోపబోతున్న ఈరోజుల్లోకూడా ఈ భూమ్మీద కులమహాసభలు జరుగుతున్నాయి. మతం పేరుతో మారణహోమాలు సృష్టించబడుతున్నాయి. అసలు కులాలు, మతాలే దేశస్థితిగతులను శాసిస్తున్నాయి.... మనుష్యులలో కులాలపట్ల ఏవగింపు ప్రారంభమయిందని అన్నావు. నిజమే అయి ఉండొచ్చు! అయితే, ఈ దేశంలో ఏటా ఎన్నివేల కులాంతర, మతాంతర వివాహాలు జరుగుతున్నాయో చెప్పు చూద్దాం.... అది చాలా చిన్న సంఖ్య. ఎవరో నీలాంటి ఆవేశపరులు లక్షకొక్కరు చేసే అనవసర ప్రయత్నం అది. దానివలన ముందుముందు ఏదో మార్పు వస్తుందనుకోవడం పిచ్చితనమే అవుతుంది. అంతేకాదు అలా కులాంతర వివాహం చేసుకున్నవారు కూడా తర్వాత ఏదో కులంలోనికి అడ్జస్ట్ అయిపోతున్నారు. 'కులం' అన్నదానికి ఒక ప్రత్యేకత లేకపోయినా ప్రస్తుతం సమాజంలో అది ఒక పవర్‌ఫుల్ రోల్‌ను పోషిస్తోంది. కాబట్టే- కులాంతర వివాహం చేసుకున్నవారిని సమాజం ఒకింత చిన్నచూపు చూస్తుంది. వారిమీద జాలి కూడా కురిపిస్తుంటుంది ఒక్కోసారి.... అందుకే చెపుతున్నా! ఎందుకీ అనవసరమైన రిస్కులు ఎదుర్కొంటావు?.... జీవితం సాఫీగా సాగిపోయేలా చేస్తాను.... నా మాట విను"

"నాన్నా! నాకు జీవితం సాఫీగా, రొటీన్‌గా





జరగటం ఏమాత్రం ఇష్టం ఉండదు. లైఫ్‌లో థ్రిల్, వెరైటీ కోరుకునేవాడిని నేను. కాబట్టే సాఫీగా సాగే ఉద్యోగంకాకుండా, ఒడిదుడుకులతో కూడుకున్న బిజినెస్ మొదలెట్టాను. అలాగే ఈ కులాంతర వివాహంకూడా... ఈ విషయంలో నన్ను వెనుకడుగు వేసేలా చేయొద్దు ప్లీజ్! నన్నర్థం చేసుకోండి''

''ఈ విషయం తెలిస్తే మీ అమ్మ బాధపడుతుంది''

''ఆమె బాధకు అర్థంలేదు. అందుకు నేనేం చేయను? అప్పటికీ నా పెళ్లివలన చెల్లెలి భవిష్యత్‌కేమైనా భంగం కలుగుతుందేమోనని, ముందుగా ఆమె పెళ్లి జరిగేలా చూశాను. తప్పో ఒప్పో ఈ ఒక్క నిర్ణయంతప్ప, మిగిలినదంతా మన కుటుంబాన్ని దృష్టిలో పెట్టుకునే చేస్తూ వచ్చాను. ఈ ఒక్క విషయంలో నన్ను మీరంతా అర్థంచేసుకోగలిగితే.... అంతే చాలు''

కారు ఆఫీసుముందు ఆగింది. సునీల్ కారు దిగి ఆఫీసులోనికి నడిచాడు ఠీవిగా. గుమస్తాలు, ఆఫీస్‌బాయ్ ''గుడ్‌మార్నింగ్ సర్'' అంటూ విష్‌చేశారు.

సత్యనారాయణ కొడుకును అనుసరిస్తూ వెళ్లి, ఆఫీసుగదిలో ఒక కుర్చీలో కూర్చున్నాడు.

ఒక ముఖ్యమైన సమస్యను బయటపెట్టేయడంవలన అతగాడికి ఒకింత ఉత్సుకతగా ఉంది. ఈ సమస్య తనను ఏ దారులలోనికి నడిపిస్తుందోకదా అని ఆందోళనగా ఉంది. ఫైల్స్ తీసుకుని అటుఇటు తిరగేయసాగాడు. ఇంతలో ప్లాట్స్ విషయం మాట్లాడేందుకు ఒకరిద్దరు వస్తే వారితో కొద్దిసేపు మాట్లాడి పంపించాడు. ఆ తర్వాత- వరుసగా అకౌంటెంట్, ఏజంట్‌లు, వర్క్‌ఇన్‌స్పెక్టర్‌లు, డిపార్ట్‌మెంట్‌కి సంబంధించిన జె.ఇ. వచ్చారు. వారితో మాటలతోనే రెండుగంటలయిపోయింది.

సత్యనారాయణ ఆ ఆఫీసుకు ఎప్పుడూ రాలేదు. అతడి తిరుగుడంతా ఇల్లు, ఆఫీసు మధ్యనే ఉండేది. ఈరోజయినా ఆఫీసుకు రావడానికి కారణం- పెళ్లి విషయం తేల్చుకుందామనే. కాని ఆ పెళ్లి విషయం ఓ కొత్త సమస్యను తెచ్చిపెట్టింది. తన ముందు ఆలోచనలు మధ్యనే అతడు తన కొడుకు ఆఫీసు కార్యకలాపాలు నిర్వహించే తీరు గమనిస్తూ ఉన్నాడు.

''నిన్న మొన్నటివరకూ నిరుద్యోగిగా ఉన్న అతడిలో నేడు 'ఠీవి'వచ్చి చేరింది. మాటలలో ఒకవిధమైన ప్రత్యేక ఆకర్షణ, జనాలను ఇంప్రెస్ చేయగలిగేలా చేయటం నేర్చుకున్నాడు.... మొత్తంమీద తన కొడుకు ఎంతో సమర్థుడు. కాని... ఈ కొత్త సమస్య తెచ్చిపెట్టాడేమిటి?.....''

భోజనం వేళ కావడంతో సునీల్ సీట్లోనుండి లేచి అతడి దగ్గరగా వచ్చాడు. ''నాన్నా! భోజనానికి వెళ్దామా?''

సత్యనారాయణ నిశ్శబ్దంగా తలూపి పైకి లేచాడు. ఇద్దరూ బయటకు నడవసాగారు.

సరిగ్గా అప్పుడే ఆ ఆఫీసుముందు ఓ బ్లూ కలర్ మారుతి కారు ఆగింది.

అందులో నుండి ఇరవైరెండేళ్ల అందమైన అమ్మాయి కిందికి దిగింది.

ఆమె సునీల్‌ను చూసి చిన్నగా నవ్వింది.

సునీల్ మాత్రం ఆ అమ్మాయిని చూడటంతోనే కొద్దిగా తడబడ్డాడు. తండ్రివంక చూసి బలవంతంగా నవ్వాడు.

ఆమె అతడి దగ్గరగా వచ్చి అదే చిరునవ్వుతో అడిగింది- ''ఏమిటీ ఇంటికా?''

సునీల్ పళ్ళు బయటపెట్టి- ''అవునూ! నాన్న వస్తే... ఇద్దరం కలసి ఇంటికి వెళ్తున్నాం'' అన్నాడు.

''అలాగా'' అని ఆగి, అప్పుడే మెదడు పనిచేసినట్లు ఉలిక్కిపడి ''ఈయన ... ఈయన మీ నాన్నగారా?'' అంది కంగారుగా - అతడి వంక చూస్తూ.

తలూపాడు సునీల్.

వెంటనే ఆమె రాని నవ్వును పెదాల మీదకు రప్పించి ''నమస్తే... నమస్తే అంకుల్'' చేతులు జోడిస్తూ చెప్పింది.

''నమస్తే'' అతడూ చెయ్యెత్తాడు.

ఆమె చప్పున సునీల్ వంక తిరిగి ''వస్తాను... మళ్లీ కలుస్తాను'' చెప్పి, తుర్రుమని పరిగెత్తింది. అర నిముషం గడవక ముందే కారు కనుమరుగయింది.



వారిద్దరూ నిశ్శబ్దంగా నడిచి కారెక్కారు. సునీల్ కారు కదిలించాడు.

కారు కొద్దిదూరం సాగాక సత్యనారాయణ "ఎవరా అమ్మాయి?" అన్నాడు.

"అదే... నేను ఉదయం చెప్పాను కదా! ఆ అమ్మాయే."

"పేరు?"

"ప్రసూన"

"వాళ్ళ నాన్నగారు?"

"ఆయన పేరు పురుషోత్తమరావు. ఫేమస్ క్రిమినల్ లాయర్. ఆయనకు ప్రసూన ఒక్కటే కూతురు"

ఆ తర్వాత ఇంటి వరకూ వారిద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు.

ఇంటి దగ్గర భోంచేసిన తర్వాత సునీల్ తిరిగి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

తన గదిలో తీరిగ్గా కూర్చుని ఉన్నప్పుడు, కామేశ్వరి వచ్చి అతడిని అడిగింది "పెళ్ళి విషయం ప్రస్తావన తెస్తానని అబ్బాయితో కలసి వెళ్ళారుగా! ఇంతకీ ప్రస్తావించారా?"

"ఆఁ! ప్రస్తావించాను" అన్యమనస్కంగా అన్నాడు అతడు.

"ఏమన్నాడు సునీల్?"

"పెళ్ళి చేసుకుంటానన్నాడు. కాని.... మన కులం అమ్మాయిని కాదు."

"ఏమిటీ?" నోరు తెరిచింది కామేశ్వరి. ఆ మాటతో గుండెవేగం పెరిగిందేమో, అది తగ్గేందుకు అర నిముషం పట్టిందామెకు.

ఇక నోరు విప్పి దండకం ప్రారంభించింది. "...కులం తక్కువ పనులు మన ఇంటా-వంటా లేదు. నిప్పులాంటి వంశం మనది. ఇంకో కులం పిల్లను ఈ ఇంటికోడలుగా చేసుకుంటే బంధువులంతా నవ్వరా! వారిక మన ఇంటికి రాకపోకలు సాగిస్తారా?.... ఈ పెళ్ళే జరిగితే మన కుటుంబం మర్యాద నలుగురిలోనూ నవ్వులపాలు అవుతుంది. కాబట్టి నా ప్రాణముండగా నేను ఈ పెళ్ళికి ఒప్పుకోను"

రాత్రి వరకూ ఆమె సణుగుడు సాగుతునే ఉంది.

సునీల్ ఆ రాత్రి చాలా పొద్దుపోయేవరకూ రాలేదు - ఇంటికి.

సత్యనారాయణ రాత్రి భోజనం పూర్తిచేసుకుని మంచం మీదకు ఒరిగాడు. మనసు కొత్తగా వచ్చిన ఆ సమస్య గురించే ఆలోచించడం మొదలయింది. ఈ మధ్యకాలంలో ఏ సమస్యా లేదు.... డబ్బుతోనే సమస్యలన్నీ ముడిపడి ఉంటాయనుకుంటే అది తప్పు. డబ్బుకు వెలుపల కూడా కొన్ని సమస్యలున్నాయన్నమాట. అయితే.... ఇంతకీ ఇప్పుడు తన ఎదుట నిలిచిన సమస్యను ఎదుర్కోవడం ఎట్లా?

'సునీల్ పెళ్ళి ప్రసూనతో జరిగేందుకు అంగీకరించడమా?.... ఊహుఁ! మనసు అంగీకరించడం లేదు కులాంతర వివాహమంటే. అందువలన భవిష్యత్‌లో చాలా చిక్కులు ఎదురవుతాయి. ఆవేశంలో సునీల్ ముందు జరగబోయే జీవితాన్ని ఊహించడం లేదు. వయసు వేడి....' అతని ఆలోచనలు చప్పున పక్కకు మళ్ళాయి.... సునీల్‌ది వయసు వేడి అని ఎందుకనుకోవాలి? అది ప్రేమయి ఉండకూడదా! మరుక్షణం అతడికి వసుంధర గుర్తుకు వచ్చింది. ఆమె ప్రేమ కోసం తానెంతగా పరితపించింది, జీవిత భాగస్వామిగా చేసుకోవాలని మరెంతగా కోరుకున్నదీ మదిలో మెదలాడింది. ఆ రోజులలో తన ప్రేమ కోసం ఎంత గొప్ప పనయినా సరే చేయాలనుకోవడం జ్ఞప్తికి వచ్చింది. అఫ్‌కోర్స్! ఆ తర్వాత వసుంధరే తనను మృదువుగా తిరస్కరించడం తన దురదృష్టం.

దురదృష్టవంతుడయిన తను మరో జంట ప్రేమికులను విడదీయడమా? కాని... తండ్రిగా, తన కొడుకు ఇలాంటి సాహసం చేయడం అంగీకరించలేకపోతున్నాడు... వయస్సు పైబడే కొద్దీ మనిషి భావాలు కుచించుకుపోతాయిఎందుకని? బహుశా పోరాడే శక్తి తగ్గి మనిషిలో పిరికితనం ప్రవేశించడమే ఇందుకు కారణం కాబోలు.

ఏదేమయినా ఇప్పుడు తను తీసుకోవలసిన నిర్ణయం ఏమిటి? అంగీకారమా, అనంగీకారమా?




ఎంతసేపు ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేకపోయాడు అతడు.

ఊహుం! ఈ సమస్యను నేను పరిష్కరించ లేను. వరాత్పరాన్ని అడిగి అతడి సలహా తీసుకోవలసిందే అనుకున్నాడు.

అర్ధరాత్రివేళ సునీల్ కారు వచ్చి ఆగిన చప్పుడయింది. అప్పటివరకూ అతడు మేలు కునే ఉన్నాడు.

పక్కనే పడుకుని ఉన్న కామేశ్వరి లేచి వెళ్ళి తలుపుతీసింది. వెంటనే తిరిగొచ్చి తిరిగి బెడ్ ను అలకపాన్పుగా మార్చింది.

ఓహెూ! కొడుకు మీద నిరసనవ్రతం పాటించడం మొదలయింది కాబోలు అనుకు న్నాడు అతడు.

డైనింగ్‌టేబుల్ దగ్గర చప్పుడు కాలేదు. అంటే సునీల్ కూడా భోంచేయకుండానే వెళ్ళిపడుకు న్నట్టుంది.

ఆ క్షణం అతడికి సునీల్ మీద జాలేసింది 'పాపం సునీల్!...ప్రేమించటం తప్పుకాదు. ప్రేమించిన ప్రియురాలిని భార్యగా తెచ్చుకోవా లనుకోవడంలో చెడు లేదు. అందులో మంచి తనంపాలే ఎక్కువ. మరి ఆ మంచిని హర్షించ లేకపోవడం...ఈ సమాజం తప్పు. తప్పుచేసే సమాజానికి మనం భయపడటం ఎంత వింత...'

ఆలోచనల మధ్య అతడికి ఆ రాత్రి నిద్రప ట్టలేదు.



''నాకో కొత్త సమస్య వచ్చిపడిందోయ్ పరా త్పరం''

''జీవితం అంటూ ఉంటే పాత సమస్యలు నమసిపోయి, కొత్త సమస్యలు పుట్టుకురావడం చాలాసహజం. ఈ జీవితమే సమస్యలమయం నాయనా!...చెప్పు ఇంతకీ నీ సమస్య ఏమిటో చెప్పు''

పరాత్పరరావు ఈమధ్య ఆధ్యాత్మిక ఉపన్యా సాలకు చాలా ఎక్కువగా హాజరు అవుతున్నా డు. కాబట్టి మాటలు కూడా ఉపన్యాసధోరణిలో రావడం మామూలయింది.

''సునీల్ పెళ్లి విషయంరా పరాత్పరం. వాడి పెళ్లి వలన లేనిపోని ఇబ్బందులు ఎదురయ్యేలా ఉన్నాయి'' దిగులుగా చెప్పా డు సత్యనారాయణ.

''ఏమయింది?''

''వాడు ఇంటర్‌కేస్ట్ మేరేజ్ చేసుకోవాలని పట్టుబడుతున్నాడు''

''ఇంటర్‌కేస్ట్ మేరేజా?!...ఎవరా అమ్మాయి?''

'' ఆ అమ్మాయి పేరు ప్రసూన- నేనూ చూశానా అమ్మాయిని. చదువుకున్నదానిలానే ఉంది. అందంగా ఉంది. మాటలలో సంస్కారం కూడా కనిపిస్తుంది...కులం అన్న అడ్డులేకపోతే, వంక పెట్టేందుకు కూడా వీలు లేనంత చక్కగా ఉందా అమ్మాయి'' చెప్పి దీర్ఘంగా నిశ్వసించాడు సత్యనారాయణ.

''ఆ అమ్మాయి తల్లిదండ్రుల వివరాలేమ యినా తెలుసా నీకు?''

''ఆఁ! తెలును...ప్రసూన తండ్రి ఫేమస్ క్రిమినల్ లాయరట. పేరు పురుషోత్తమరావు అన్నట్టు గుర్తు''

''వ్వాట్! క్రిమినల్ లాయర్ పురుషోత్తమ రావు కూతురు ప్రసూననా మీ వాడు పెళ్లిచేసు కోవాలనుకుంటుండేది?!... వాటే లక్కీ ఫె లో...సత్యం! నువ్వింకేమీ ఆలోచించకు వారిద్ద రూ ఇష్టపడితే, పురుషోత్తమరావు అంగీకరిస్తే కాదనకుండా పెళ్లి జరిపించేయి'' పరాత్పర రావు హుషారుగా అన్నాడు.

''అదేమిటి?!'' ఆశ్చర్యపోయాడు సత్యనారా యణ.

''అదంతే'' నవ్వుతూ అన్నాడు పరాత్పర రావు.

''అనవసరంగా టెన్షన్ పెంచక, వివరమే

మిటో చెప్పి ఏడువు'' మెత్తగా కసురుకున్నాడు అతడు.

పరాత్పరరావు గలగలా నవ్వి, తర్వాత చెప్పాడు- ''సత్యం! మీ సునీల్ ఆ అమ్మాయిని గురించిన పూర్తి వివరాలు తెలిసి ప్రేమించాడో, తెలియకనే ప్రేమించాడో- అతగాడి ప్రేమ వెనుక స్వార్థం ఉందో, నిస్వార్థతే ఉందో నాకు తెలియదుగాని, ఈ ప్రేమ ద్వారా అతగాడికి గొప్ప అదృష్టమే కలిసొస్తుందోయ్...'' ఆగాడు.

''వివరంగా చెప్పు'' విసుక్కున్నాడు అతడు.

''చెపుతున్నానోయ్. మరీ అంత తొందరపడితే ఎలా?...ఆఁ!...ఇక వివరాలేమిటంటే- ఆ పురుషోత్తమరావు ఈ ఊళ్లో పేరున్న క్రిమినల్ లాయరు. ఆయనకు ఈ మధ్యే భార్యావియోగం కలిగింది. పోతే, ఆయనకు ప్రసూన ఒక్కతే కూతురు. ఆస్తి సుమారుగా పది-పదిహేను లక్షల మధ్య ఉంటుంది. ఆ ఆస్తి మొత్తం ఆ అమ్మాయికే చెందుతుంది సో! మీరు లక్షాధికారుల నుండి కోటీశ్వరుల య్యేందుకు మార్గం సుగమం అవుతుంది. ఇక ఆలోచించకుండా ఈ పెళ్లి జరిపించెయ్యి...జరిగేదంతా నీ మంచికే అనుకో' ఆగి మిత్రుడి ముఖంలోనికి చూస్తే అతడి ముఖం నిస్తేజంగా ఉంది.

అంత ఆస్తి కలిసి వస్తున్నందుకు ఆనందపడాల్సిన అతడు, అలా నిరుత్సాహంగా ఉండడం ఎందుకో పరాత్పరరావుకి అర్థంకాలేదు. అదే అడిగాడు. ''ఏం సత్యం! నేను చెప్పిన విషయం నీకు ఆనందం కలిగించలేదా?''

''ఎలా కలుగుతుంది ఆనందం. ఒకవేళ ఎంత ఆస్తి కలిసివచ్చినా కులాన్నిదాటి అవతలికి వెళ్లడం అంత మంచిగా అనిపించుకోలేదు''

పరాత్పరరావు ముఖం సీరియస్‌గా మారింది. ''ఏమిటీ!... కులందాటి అవతలకి వెళ్ళడం మంచిదికాదనా నువ్వనేది... కులం! కేస్ట్!... నువ్వు గొప్పగా చెప్పే ఆ కులం ఒకప్పుడు నువ్వు కష్టాలలో ఉంటే నీ కష్టాలలో పాలుపంచుకుందా? నువ్వు చాలామంచివాడివని కులం విలువ పోగొట్టని నీతిపరుడవని తెలిసి నీ కులస్తులెవరయినా నీ కూతురు నీరజను కట్నం లేకుండా పెళ్లి చేసుకునేందుకు అంగీకరించారా? నీకేమేలూ చేయని నీ కులం కోసం నువ్వెందుకు ప్రాకులాడుతావు? ఈ కాలంలో అప్లికేషన్స్ మీద కోట్ చేసేందుకు తప్ప కులాలకు ఒక ప్రత్యేక ప్రాధాన్యత అంటూ లేదు. ఒకవేళ పల్లెటూర్లలో కులాభిమానంతో మనిషి చనిపోతే, సాటి కులస్తుందరూ దహనసంస్కారాలకు హాజరవుతారేమోగాని, ఈ మహాపట్టణాలలో సాటివాడి కులమేమిటో తెలియని జనారణ్యంలో అంతిమయాత్రకు కులస్తులు కాదు హాజరయ్యేది- మిత్రులు, పరిచయస్తులు, బంధువులు మాత్రమే. కాబట్టి కులం గురించి మరీ ఎక్కువగా ఆందోళనపడవలసిన అవసరం ఏమాత్రం లేదు''.

సత్యనారాయణ అప్పటికే నసిగాడు. ''నువ్వెంతగా వాదించినా, కులం వదులుకోవడం మనిషికి అంత శ్రేయస్కరం కాదు. ఎంత కాదన్నా నేడు కులం ప్రాధాన్యత చాలా ఎక్కువగానే ఉంది''

దాంతో పరాత్పరరావుకు చాలా కోపం వచ్చింది. ''కులం ప్రాధాన్యత ఎక్కువగా ఉంది అంటే, ఎందుకుండదూ?- నీ తోటివాడు, నాతోటివాడు ముందడుగువేసే యువతరాన్ని అడ్డుకొట్టినంతకాలం ఈ కులాల ప్రాధాన్యత ఇలాగే ఉంటుంది. ఇందుకు ఎవరినో ఆడిపోసుకోవడం కాదు, మనలాంటి ముసలి ముండాకొడుకులంతా ఒక్కసారిగా ఆత్మహత్యా చేసుకుంటే చాలు. ఈ కులాల గొడవ ఒకేసారి సమసిపోతుంది. కులం అట కులం.... కులం.... కులం.... కులం! ఏమిటో ఈ కులాల వలన మనకు ప్రయోజనం?! ఈ కులాల పేరుమీద బాగుపడేది మనం కాదు- స్వార్థపర రాజకీయ శక్తులు. ఓట్లకోసం వారు కులం పేరున జనాలను రెచ్చగొడుతారు. మనమీద కులం మత్తుమందు చల్లి తాము ఓట్లు పొంది అందలం ఎక్కి, తమ స్వార్థం చూసుకుంటారు.... కులంకోసం ప్రాకులాడే మనం నిజమైన పిచ్చివాళ్లం....''

''కులాన్ని నమ్మడం పిచ్చితనమే కావచ్చు. ఆ కులాన్ని ఎదిరించటంద్వారా సాహసం





చేయొచ్చు. సాహసంచేసిన మనలను ఈ సమాజం ఏమీ చేయలేదు కాని.... రేపు అతడికి పుట్టబోయే పిల్లలు- ఏ కులానికి చెందినవారని, జనం అసహ్యించుకుంటూ, వారి పెళ్లి మనకో ప్రాబ్లమ్ అయితే....''

అతడి మాటలు మధ్యలోనే కట్ చేశాడు పరాత్పరరావు. "ఎట్టి పరిస్థితులలోనూ కాదు.... డబ్బున్నవాడికి పిల్లలు కులంతప్పినా, గుణం తక్కువయినా- వారి పెళ్లి ఎట్టి పరిస్థితులలోనూ ప్రాబ్లెమ్‌కాదు.... ఇక్కడ నువ్వో విషయం గమనించాలి. ప్రస్తుతం సమాజంలో కులాన్ని- డబ్బు, అధికారం డామినేట్ చేస్తున్నాయి. చాలాకాలంక్రితం విషయమేమోగాని, గత కొద్ది దశాబ్దాలుగా డబ్బు, అధికారం ముందు కులం, మతం వెలవెలబోతున్నాయి. నిజానికిది బ్రిటీష్‌వాళ్ల రాకతోనే మొదలయింది. అందుకే అత్యధికంగా డబ్బు కలిగినవాడుగాని, మంచి అధికారంలో ఉన్నవాడుగాని ఈ కులాలు, మతాలు గురించి ఆలోచించటంలేదు. వారి దృష్టి మరింతా డబ్బు సంపాదించడమో లేదా మరింతా గొప్ప అధికారం సంపాదించటంమీదో ఉంటుంది. వారు ఇష్టపడితే ఏ మతంలోనయినా, లేదా విదేశస్తులయినా పెళ్లి చేసుకోగలరు. అలాగే తమ పిల్లలు ఎలాంటివారిని కోరుకుంటే అలాంటి వారితో పెళ్లి జరిపించేయగలరు. వారి భావాలు మనలా సంకుచితమయి ఉండవు. వారిది విశాల దృక్పథం... వారి దృష్టిలో కులాంతర, మతాంతర, జాత్యాంతర వివాహాలు సర్వసాధారణం. వారు అలాంటివాటినిగురించి పట్టించుకోరు. మన మతం మారిపోతుందే అని బాధపడరు. వారి ఏకాగ్రత అంతా తమ పైమెట్టుమీదనే.... మనలాంటి మధ్యతరగతి ధనవంతులు- కులం, మతంకోసం ప్రాకులాడతారు. రేపు పిల్లల భవిష్యత్తేమిటో- అని ఆందోళన పడుతుంటారు. డబ్బు, అధికారం ఈ వ్యవస్థను నడిపించినంతకాలం ఆ రెండు మహాయుధాలు మన దగ్గరుంటే తద్వారా జరగనిదంటూ ఏమీ ఉండదు.... ఫర్ ఎగ్జాంపుల్! 'జె.ఆర్.డి. టాటా' తండ్రి రతన్‌జీ ఫ్రెంచి మహిళ అయిన సుజానే బ్రెయిరేని పెళ్లి చేసుకున్నాడు. మరి 'జె.ఆర్.డి' తనకు పెళ్లి జరగదేమోనని ఏనాడూ వర్రీ అయి ఉండడు. కారణం ఆయన వేరువేరు జాతులకు సంబంధించిన తల్లిదండ్రులకు జన్మించినా, ఆయన వెనుక కోట్లాది ఆస్తి ఉంది. అలాంటి ఆస్తిపరుడిని పెళ్లి చేసుకోవాలని ఏ ఆడపిల్లమాత్రం అనుకోకుండా ఉండగలదు! అలాంటి వ్యక్తిని అల్లుడిగా చేసుకోవాలని ఆడపిల్లల తల్లిదండ్రులు వెంపర్లాడి ఉండరా? సో! ఈరోజు కాదు, ఎనభైఏళ్లక్రితంనుండే ఈ కుల, మత వ్యవస్థను డబ్బు డామినేట్ చేయడం మొదలుపెట్టింది.

అలాగే ఈ సమాజముచేత సలాములు కొట్టించుకునే మరో మహత్తర శక్తి- అధికారం... అధికారం చేతిలో ఉన్నవాడికి పిల్లల పెళ్లిళ్లు ఎట్టిపరిస్థితులలోనూ- ఏవిధంగానూ సమస్యకాదు. అంతెందుకు- నెహ్రూ కుటుంబంలో గత రెండు తరాలుగా జరిగిన పెళ్లిళ్లు చూడు. మనలాంటి ఛాందస కుటుంబాలు ఆ స్థాయిలో ఆలోచించాలంటే, ఇంకా ఎన్ని పదుల సంవత్సరాలు పడుతుందో! అలాంటి విశాల దృక్పథంతో తన పెళ్లి చేసుకున్న రాజీవ్‌గాంధీ- తన బిడ్డలు- రాహుల్, ప్రియాంకల పెళ్లిళ్ళు జరుగుతాయో, జరగవో అని భయపడుతున్నాడా? ఆలోచించేందుకే సిల్లీగా ఉందా ప్రశ్న!... చూడు సత్యం! మన తరానికి కనిపించని విశాల ప్రపంచం ఒకటి నిర్మితమవుతూ వస్తుంది. ఆ విశాల ప్రపంచాన్ని డబ్బు అధికారం నడిపిస్తూ ఉండి ఉండొచ్చు. కానీ కుల, మత, ఛాందస భావాలకన్నా ఆ రెండూ అంత ఘోరమయినవికావు. సమ్‌థింగ్ బెటర్. నేటి యువతరం ఆ విశాల ప్రపంచంవైపు పరుగుతీస్తోంది.... వాళ్లని ఆపకు, వెళ్లనివ్వు, నువ్వో నేనో మనసులలో పెట్టుకుని చేయలేని ఆ సాహసకార్యం వారినయినా చేయనివ్వు....''

"నువ్వు చెప్పదలచుకున్నది నాకర్థమయింది. డబ్బు అన్న పదార్థం మన దగ్గర ఉంటే- మనం కులంతప్పినా- డబ్బుకు ఆశపడే ఏ లోభి వెధవలో మన పిల్లలను పెళ్లాడేందుకు ముందుకు వస్తారు- అంతేకదూ''

"డబ్బుకు ఆశపడటం లోభితనమవుతుందేమోగాని, కులాంతర వివాహం చేసుకోవడంమాత్రం ఘనకార్యమే అవుతుంది.... ఆ

ఘనకార్యం చేస్తానన్నవారిని వెనకకు లాగటం అంత మంచిపనికాదు''

సత్యనారాయణ మాట్లాడలేదు. దీర్ఘాలోచనలో మునిగిపోయాడు.

"ఆలోచించు సత్యం! ఈ పెళ్లివలన మీకు అర్థం, పరమార్థం రెండూ దొరుకుతాయి. కొడుకు అభిప్రాయాన్ని గౌరవించినట్టుగా కూడా ఉంటుంది.... నా ఉద్దేశం అంగీకరించటమే మేలని''

తలూపాడు అతడు "అలాగే" అని మాత్రం అనలేదు.

పైకి లేచి ఇవతలకు వచ్చేశాడు- ఏ సమాధానం తేల్చకుండానే-

ఆరాత్రి భోజనం చేశాక తన గదిలో కూర్చుని కొడుకు రాకకోసం ఎదురుచూడసాగాడు.

అతడి మనసంతా గజిబిజిగా ఉంది. 'తన దృష్టిలో ప్రేమ నిస్వార్థమయింది. అది త్యాగాన్నే కోరుకుంటుంది. ప్రేమ డబ్బుకు, అధికారానికి లొంగదు' అయితే వసుంధర తొలిసారిగా ఆ భావాలమీద దెబ్బకొట్టింది. ప్రేమ డబ్బుకు అమ్ముడుపోతుంది అని రుజువుచేసింది. కాని తన మనసు మూలలలో ఎక్కడో ప్రేమపట్ల అపారమైన గౌరవం. మరి ఇప్పుడు కొడుకు తనలో తిరిగి అనుమానాలు రేకెత్తిస్తున్నాడు. ప్రేమ, డబ్బు.... ఈ రెండింటిలో మనిషి దేనికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నాడు?!

సునీల్ కారు వచ్చి ఇంటిముందు ఆగింది. డోర్ తెరుచుకుని దిగి లోపలకు వచ్చాడు. హాలులో కూర్చుని ఉన్న తండ్రిని చూసి పలకరింపుగా నవ్వాడు. "ఇంకా మేలుకుని ఉన్నారేం నాన్నా''-

"ఏదో చదువుకుంటూ" చేతిలోని పుస్తకం చూపించాడు అతడు. సునీల్ తల తిప్పుకుని తన గదివైపు నడుస్తుంటే, వెనుకనుండి అతడు- "సునీల్! భోంచేశావా?" అడిగాడు.

"ఆఁ! ఇప్పుడే హోటల్‌లో భోంచేసి వస్తున్నాను" నిలబడి సమాధానంచెప్పి, వెంటనే గదిలోనికి వెళ్లిపోయాడు.

సత్యనారాయణ చేతిలోని పుస్తకం టీపాయ్ మీద పడేసి, లేచి కొడుకు గదివైపు నడిచాడు. అతడు తలుపు తోసుకుని ఆ గదిలో అడుగుపెట్టేసరికి, సునీల్ బట్టలు మార్చుకోకుండానే అలాగే మంచంకు అడ్డంగా పడుకుని ఉన్నాడు. లోపలికి వచ్చిన తండ్రివంక అదోలా చూసి, లేచి కూర్చున్నాడు బెడ్ మీదనే.

"కూర్చోండి నాన్నా" చెప్పాడు సునీల్.

అతడు కుర్చీలో కూర్చుంటూ కొడుకు ముఖంవంక పరీక్షగా చూశాడు.

'ఈ రెండురోజులలోనే సునీల్ ముఖంలో కళ తప్పింది. ముఖం పీక్కుపోయి ఉంది. కళ్లు లోతుకుపోయి నీరసించినట్టుగా కనిపిస్తున్నాయి....'

అతడు కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా ఉండిపోయాడు. తను అడగదలచుకున్న విషయాలు ఎలా మొదలుపెట్టాలో తెలియలేదు.

"చాలా తగ్గిపోయావు సునీల్"

సునీల్ మౌనంగా ఉన్నాడు.

"ఈరోజు పరాత్పరరావు అంకుల్‌తో నీ విషయం చర్చించాను. ఆయన నీవైపే మాట్లాడాడు"

ముఖం కొద్దిగా వికసించింది సునీల్‌కు.

"పోతే నా అంగీకారం తెలియచేసే ముందు నిన్ను కొన్ని విషయాలు అడగాలి" కొడుకు ముఖంలోనికి పరీక్షగా చూస్తూ అన్నాడు.

సునీల్ తలెత్తి తండ్రివంక చూశాడు. ముఖం అనుమానంతో ప్రశ్నార్థకమయింది. "ఏమిటి నాన్నా అవి?"

ఆ గదిలో ట్యూబ్‌లైట్ కాంతి మందంగా ఉంది. వారిద్దరి మధ్యా కాలంకూడా మందంగా ప్రవహించింది కొద్ది క్షణాలపాటు.

సత్యనారాయణ అడిగాడు- "ప్రసూన నీకెంతకాలంనుండి తెలుసు?"

"సుమారు ఒక సంవత్సరం నుండి"

"అంటే మనకు లాటరీ తగిలి, లక్షాధికారులమయ్యాకనే కదూ?"

"అవును"

"ఎలా పరిచయం?"

"సంవత్సరంక్రితం ఒకరోజు నేను స్నా





టర్‌లో వెళుతుంటే, రాంగ్‌సైడ్‌లో వచ్చిన ఆమె కారు నా స్కూటర్‌ని డాష్ కొట్టింది. చిన్న యాక్సిడెంట్. ఆమె భయపడి నన్ను హాస్పిట ల్‌కు తీసుకెళ్తానన్నా, నేనే చొరవ తీసుకుని వద్దని పంపేశాను. ఆ తర్వాత మరోసారి సినిమా థియేటర్‌లో కనిపించింది. తనే పలక రించింది. అలా.... అలా స్నేహం పెరిగి ఆమె మన ఆఫీసువరకూ రావడం, ఇద్దరం కలసి నా స్కూటర్‌మీద షికార్లు.... మెల్లగా ప్రేమలో పడటం... వరుసగా జరిగిపోయాయి....''

''ఒకవేళ ఆ సమయంలో నీకు వాహనం లేకుండా మనిషికే యాక్సిడెంట్ అయిఉండి, నీకో ఆఫీసు లేదనీ, నువ్వో అనామకుడివని, నిరుపేదవని తెలిసిఉంటే ఆమె నిన్ను ప్రే మించి ఉండేదా?''

సునీల్‌కు ఆయన ఏమడిగాడో అర్థంకాలే దు. ఆ ప్రశ్నలోని అంతరార్థం కొంత కూడా బోధపడలేదు. అయోమయంగా తండ్రివంకే చూశాడు సునీల్.

''మీరు అడిగినదేమిటో నాకేమీ అర్థంకాలే దు''

సత్యనారాయణ అదోలా నవ్వాడు. ''నా మనసులోని సంఘర్షణ ఎందుకో నాకే అర్థంకా వడంలేదు. మరి నా ప్రశ్న అంతకన్నా విపు లంగా ఎలా ఉండగలదు'' మనసులోనే అను కుని- ''నా ఉద్దేశం- ఆ అమ్మాయి నిన్ను నీ డబ్బు చూసి ప్రేమించిందా! లేక నిన్ను నిన్నుగా ప్రేమించిందా?''

ఒకింత ఆశ్చర్యపడ్డాడు సునీల్. ''నాన్నకు మతి చలించలేదుకదా! లేకపోతే ఇలాంటి అనవసర ప్రశ్నలు....''

''ప్రసూనకు డబ్బుచూసి ప్రేమించాల్సిన అవసరం ఏమాత్రంలేదు. ఆమె డబ్బులో పుట్టి డబ్బులో పెరిగింది. ఆమె డబ్బుచూసి ప్రే మించేట్టుంటే నాలాంటి లక్షాధికారులుకాదు. కోటీశ్వరులెందరో ఆమెకు పరిచయం ఉన్నా రు.... కాబట్టి మీది కేవలం అనుమానం మాత్రమే''

''నువ్వు కనీసం లక్షాధికారివి. ఆ లక్షలు కూడా నీదగ్గరలేకపోతే ఆమె నిన్ను ప్రేమించి ఉండేదా? అన్నదే నా ప్రశ్న! ఒక కవిగారు అంటాడూ ''నిన్ను నిన్నుగా ప్రేమించుటకూ.... అని. అలా ఆమె నిన్నునిన్నుగా ప్రేమిస్తుందా అని''

తండ్రి భావం చాలావరకూ అర్థమయింది సునీల్‌కు. కాని అర్థంకానిదల్లా ఆయన అంత లోతైన విశ్లేషణకు ఎందుకు వెళ్లాడా అన్నది మాత్రమే. ఏదేమయినా జవాబు చెప్పడం తన కర్తవ్యం!

''చూడండి నాన్నా... మనుష్యులు- వారిమ ధ్య ఉండే ఆర్థికబంధాలు, అడ్జస్ట్‌మెంట్‌లు, తాత్కాలిక సంబంధాలు- ఇవన్నీ వదిలేసి మనసు అడుగు పొరలలోనికి వెళ్లి 'వ్యక్తి' అన్నవాడిని వెలికితెస్తే అది చాలా వృథా ప్రయాస. 'వ్యక్తి' అన్నది చాలా సర్వసాధారణ పదం. కాకపోతే ఆ వ్యక్తికి కొన్ని ప్రత్యేకతలు స్వయం కృషివలనో, స్వతఃసిద్ధంగానో ఏర్పడ తాయి. వ్యక్తిలోని ఆ ప్రత్యేకతలు- అందం, చదువు, డబ్బు, మంచితనం, అమాయకత్వం, తెలివి మొదలైనవి. ఎదుటివారు మనలోని ఆ ప్రత్యేకతలలో ఏదోఒక ప్రత్యేకత ఉండి ఉంటే అనుకోకుండా ఆకర్షింపబడి ఉండవచ్చు. ఆ ప్రత్యేకతను అభిమానించడంద్వారా మనకు దగ్గరవడం లేదా ప్రేమించడం చేయొచ్చు. ఒక్కోసారి మనిషిలో ఎన్నో ప్రత్యేకతలున్నా ఎవరూ ప్రేమించకపోవచ్చు. ప్రేమింపబడటా నికి మనలోని ప్రత్యేకతలు కారణమయితే, ప్రేమింపబడకపోవడానికి ప్రత్యేక కారణ మంటూ ఉండకపోవచ్చు.... కాబట్టి వాస్తవిక ప్రపంచం వదిలేసి, 'నిన్ను నిన్నుగా ప్రే మించుటకు...' అనే ఊహాలోకంలో విహ రించటం ఈ ఆధునిక సమాజం పునాదులను విస్మరించడమే అవుతుంది. మనుష్యులమధ్య ఉన్న సంబంధాలను కాదనడమే! పోతే ఆ అమ్మాయి 'నన్ను నన్నుగా ప్రేమించిందా?' అని నేను ప్రశ్నించుకునేముందు 'నేను ఆ అమ్మాయిని 'వ్యక్తి'గా ప్రేమించానా అంటే, ఏమో! అయిఉండకపోవచ్చు.

....ఆమె అందం నాకు నచ్చిందేమో! లేక ఆమె మాటకారితనం నన్ను ఆకట్టుకుని ఉండొ చ్చు. ఇవన్నీ కాకపోతే ఆమె కారు, బంగళా, ఆస్తి నన్ను ఆకట్టుకుని ఉండొచ్చు. ఇవేమీ లేనినాడు నేను ఆమెతో పరిచయం పెంచు




కుని ఉండకపోవచ్చు... ఇది నిజం నాన్నా!... మనిషికి 'పర్సనల్ వేల్యూ' అంటూ ఏమీ లేదు. అంతా తొడగబడిన విలువలు మాత్రమే...''

''అంటే మనిషి మరో మనిషిచేత ప్రేమింపబడేందుకు డబ్బు కూడా ఒక కారణమని అంటావు కదూ?''

''తప్పకుండా నాన్నా''

కొడుకు లోకాన్ని అర్థంచేసుకున్నపాటి తను అర్థంచేసుకోలేకపోయినందుకు అతడు చింత పడలేదు. లేట్ రియలైజేషన్ అని వ్యధపడలేదు. అదో స్తబ్ధత అతడిని ఆవరించింది. కనులముందు పేరుకుని ఉన్న అస్పష్టమైన పొరలు మెల్లగా తొలగిపోసాగాయి.

కొద్దిసేపు మౌనం తర్వాత అతడు చెప్పాడు- ''ఆల్‌రైట్ సునీల్! నీ పెళ్లికి నేను అంగీకరిస్తున్నాను.... పోతే ముందుగా మనం ప్రయత్నం చేద్దామా లేక ఆవైపునుండి రాకపోకలు మొదలవుతాయా?''

మెరుపుకాంతి సునీల్ ముఖంలో తళుక్కుమంది. తను తండ్రి అంత సులభంగా అంగీకరిస్తాడని అనుకోలేదు. అంగీకరించకపోయినంతమాత్రాన వెనుకడుగు వేయాలనుకోలేదు గాని ఆయన అంగీకారం చాలా సంతోషాన్నిచ్చింది.

సునీల్ చెప్పాడు ''ప్రసూన వాళ్ళనాన్నతో చాలా క్లోజ్‌గా మూవ్ అవుతుంటుంది. ఆయన కూడా చాలా సహృదయుడు. కులం, మతం పట్టింపులు ఆయనకు ఎలాగూ లేవు కాబట్టి ప్రసూనను కదిలిస్తే ఆ వైపునుండే ప్రయత్నాలు మొదలవుతాయి''

''అలాగే కానివ్వు... ఇక నీదే ఆలస్యం''

వెనుతిరిగి గదిలోనుండి వచ్చేశాడు సత్యనారాయణ.

* * *

ఉదయం ఎనిమిది గంటల సమయం. కామేశ్వరి వంటగదిలో సతమతమవుతూ ఉంది. సత్యనారాయణ తన గదిలో కూర్చుని కొత్తగా కొన్న భగవద్గీత చదువుకుంటూ ఉన్నాడు. సునీల్‌మాత్రం హాలులో కూర్చుని వీధివంక దొంగచూపులు చూస్తున్నాడు.

సరిగ్గా ఆ సమయంలోనే ఆ ఇంటిముందు వరుసగా మూడు కార్లు వచ్చి ఆగాయి. ముందు కారులోనుండి దిగుతున్న పురుషోత్తమరావుని చూడటంతోనే సునీల్ కళ్లు మిలమిల మెరిశాయి.

పరుగులాంటి నడకతో లోపలికి నడిచి- ''నాన్నా... నాన్నా! పురుషోత్తమరావుగారు వచ్చారు'' చెప్పాడు.

పాపం! సత్యనారాయణకు అప్పటివరకూ ఆయనొచ్చే విషయమే తెలియదు. అతడు కంగారుగా లేచి ఆయనకు ఎదురెళ్లాడు. వంటగదిలోని కామేశ్వరమ్మకు విషయం చెబితే ఆమె ముభావంగా ఉండిపోయింది.

పురుషోత్తమరావు వెనుక సుమారుగా పదిమందివరకూ ఉన్నారు. ఆయన నడక హుందాగా, ఠీవిగా ఉంది. అనుచరవర్గంతో ఆడంబరంగా ఉంది.

అతడు ఆయనకు ఎదురుగా వెళ్లాడు- ''రండి... రండి''

ఆయన ఆగి రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ- ''నా పేరు పురుషోత్తమరావు.... మీరు సత్యనారాయణగారనుకుంటాను'' అన్నాడు.

అతడు తలూపి ''కూర్చోండి'' అన్నాడు.

వారంతా అక్కడి సోఫాలలో, కుర్చీలలో సర్దుక్కూర్చున్నారు.

సత్యనారాయణ వంట గదిలోకి వెళ్లి ఫలహారాలు రెడీ చేయమని కామేశ్వరితో చెప్పాడు. ఆమె తలూపింది.... సునీల్ ఎక్కడా కనిపించలేదు.

తను ఇవతలికి వచ్చి వారి ఎదురుగా కూర్చున్నాడు.

ఎవరి మనసులో ఏముందో ఇద్దరికీ తెలియకపోవడంతో సంభాషణ ఇతర విషయాలతో మొదలయి, తర్వాత అసలు విషయంలోనికి వెళ్లింది.

''చూడండి సత్యనారాయణగారూ... మా అమ్మాయి ప్రసూన, మీ అబ్బాయి సునీల్ ఇద్దరూ ప్రేమించుకున్నామంటున్నారు. ఒకరినొకరు పెళ్లి చేసుకోవాలనుకుంటున్నారు. నేను ప్రేమించి పెళ్లిచేసుకున్నాను. ప్రేమ ఎంత

మధురమయినదో నాకు తెలుసు. కాబట్టే నేను కులాతీత వ్యక్తిని కావలసి వచ్చింది. ఇప్పుడు నా కూతురు కూడా మరొక కుర్రాడిని ప్రేమించింది. ఆమె ఎవరిని కోరుకుంటే ఆ కుర్రాడితో పెళ్లి జరిపించాలని నేనెప్పుడో నిర్ణయించుకున్నాను. సో! ఈ ప్రేమ వివాహంపట్ల నాకేమాత్రం అభ్యంతరంలేదు... మరి మీకేమయినా అభ్యంతరం ఉంటే?...''

అప్పటికే అతడు ఒక నిర్ణయానికి వచ్చి ఉండటంతో ఇక ఏమాత్రం ఆలోచించలేదు. తల అడ్డంగా ఆడిస్తూ ''నాకేం అభ్యంతరం లేదు.... కొడుకు ఇష్టాఇష్టాలను కాదనేంత క్రూరమైన మనసు కాదు నాది...'' చెప్పాడు.

దాంతో వచ్చినవారి ముఖాలు వికసించాయి. పురుషోత్తమరావు సోఫాలోనుండి పైకి లేచి వచ్చి, అతడి చేయి తన చేతిలోనికి తీసుకుని- ''సత్యనారాయణగారూ! నాకు ప్రసూన ఒక్కటే కూతురు. చిన్నతనంలోనే తల్లిని కోల్పోవడంతో చాలా గారాబంగా పెంచాను. నాకు లక్షలకొలదీ ఆస్తి ఉంది. కాబట్టి నా కూతురి పెళ్లి చేయలేకపోతానేమో అనే భయం ఏమాత్రం లేదు. కాని ఆమె నాదగ్గరగా వచ్చి నేను ఫలానా వ్యక్తిని ప్రేమిస్తున్నాను, అతడిని తప్ప మరొకరిని పెళ్లిచేసుకోనూ అంటే ఈ ప్రేమ వివాహం సక్రమంగా జరిపించలేనేమో అని అనుమానపడ్డాను. చాలా గొడవలమధ్య పెళ్లి జరిపించవలసి వస్తుందేమోనని కంగారుపడ్డాను. బట్ మీరింత సహృదయంతో ఈ పెళ్లికి అంగీకరించడం నాకెంతో ఆనందంగా ఉంది....'' కంపిస్తున్న స్వరంతో చెప్పాడు.

అతడు నవ్వి ఊరుకున్నాడు. ఇంతలో ఫలహారాలు వచ్చాయి. అవి అందుకొంటూ ఆయన 'బావా' అంటూ సత్యనారాయణతో వరస కలిపేశాడు.

సత్యనారాయణ సునీల్‌ని పిలిచాడు. పురుషోత్తమరావు అల్లుడిని కళ్లనిండుగా చూసుకుని సంతృప్తిపడ్డాడు.

మరి కొద్దిసేపు సంభాషణ తర్వాత వారు లేచారు. సునీల్ వారిని సాగనంపేందుకు వెంట నడిచాడు.





వారటు వెళ్లగానే కామేశ్వరి అతడితో వాగ్యుద్ధానికి దిగింది.

''ఈ కులం తక్కువ పనులను అరికట్టాల్సిందిపోయి, వాడితో కలసి తగుదునమ్మా అని మీరు ఏకంగా అంగీకారమే తెలియచేసేశారా?''

అతడు భయపడలేదు. మానవనైజం తెలుసుకున్నవాడు కాబట్టి, డబ్బు అన్నది మనుష్యుల నోరు ఎలా మూయిస్తుందో అర్థం చేసుకున్నవాడు అయినందున విషయాన్ని తేలికపరిచేందుకు ఆవైపునుండే నరుక్కుంటూ వచ్చాడు.

''నేను నువ్వూహించినంత అమాయకంగా ఈ పనికి అంగీకరించలేదు కావుడూ! ఈ పెళ్లివలన మనకు కలిగే లాభాలను దృష్టిలో పెట్టుకునే ఇందుకు ఒప్పుకున్నాను'' అన్నాడతను.

ఎప్పుడూ ''లాభం దృష్టి'' పెట్టుకోని భర్త తొలిసారిగా లాభాల గురించి మాట్లాడటంతో ఆమెకు ఆశ్చర్యం వేసింది. బహుశా డబ్బు సంపాదన విలువ తెలిసి, డబ్బు మత్తులోపడి కొత్తగా ఇలాంటి దృష్టితో అలవాటయిందేమో అనుకుందామె.

''ఈ పెళ్లివలన ఏమిటి మనకొచ్చే లాభం?'' ఆరాగా ప్రశ్నించింది.

''ఆ అమ్మాయి పురుషోత్తమరావుగారి ఏకైక సంతానం. వెనుక పదిహేనులక్షల ఆస్తి ఉంది. ఈ పెళ్లిద్వారా ఆ ఆస్తంతా మనకే చెందుతుంది.

''పదిహేను లక్షల ఆస్తా?'' నోరు తెరచింది కామేశ్వరి. అప్పటివరకూ ఆమెకు ప్రసూన ఆస్తి వివరాలు తెలియవు. అంత ఆస్తిపరురాలని తెలియటంతో కొంత 'ప్రేమ' పుట్టుకొచ్చింది ఆ అమ్మాయిమీద. దాంతోపాటే మొగుడుగారికి ఇలాంటి 'బిజినెస్ మెంటాలిటీ' ఎప్పుడు మొదలయిందా అని విస్మయపడింది. అంతటి ఆస్తిపరురాలిని కోడలుగా చేసుకోవాలని మనసు ఉవ్విళ్లూరింది. ఆ ఆస్తి మరొకరి సొంతం కావడం ఇష్టంలేకపోయింది కాని.... ఎంతయినా కులం! మనిషి స్వతఃసిద్ధంగా కొన్ని కట్టుబాట్లకు బందీ అయి ఉంటాడు. ఆ కట్టుబాట్లను వదిలించుకోవాలంటే కొంత భయం మనిషిలో ఉంటుంది.

అయితే అన్ని భయాలను పారదోలే శక్తి ఒక్క డబ్బుకి మాత్రమే ఉంది.

ఊగిసలాడుతుంది కామేశ్వరి మనసు. కులం ప్రాధాన్యత, డబ్బు ప్రాధాన్యతలమధ్య సంఘర్షణ మొదలయింది. అయితే ప్రతి మనిషి మనసును తొక్కిపెట్టేందుకు ఒక 'రేటు' ఉంటుంది. మనసును నొక్కేస్తే భయాలు, సంఘర్షణలూ అన్నీ మటుమాయమవుతాయి. ప్రస్తుతం పదిహేను లక్షలు అన్నది పెద్ద మొత్తం కాబట్టి ఆత్మవంచన మొదలయింది....

అది గమనించాడు అతడు. ఆమెను మరికొంత రెచ్చగొట్టేందుకు చెప్పాడిలా. "అవును... పదిహేను లక్షల రూపాయల ఆస్తి. మన ప్రస్తుత ఆస్తికి రెండింతలు.... అదంతా మనదే. కులం... కులం అని నువ్వు గొడవ చేశావనుకో మన అబ్బాయికి రేపు లక్ష రూపాయలకన్నా ఎక్కువ కట్నం రాదు. అంటే పధ్నాలుగు లక్షలు లాస్, దానికితోడు అబ్బాయి మనసు కూడా కష్టపెట్టుకుంటాడు.... ఆలోచించు...."

ఆమె మనసు ఆలోచించలేదు. పదిహేను లక్షల ఆస్తి అనడంతోనే మెదడు మొద్దుబారిపోయింది. మనసంతా స్తబ్దంగా తయారయింది. కనులముందు 'డబ్బు పొరలు' కమ్మాయి. ఆ మైకంలోనే "మీఇష్టం" అనేసిందామె.

డబ్బు మహిమ తెలిసిన అతడికి ఆమె అంగీకారం ఆశ్చర్యమనిపించలేదు. "ఓ ధనమా! కులాలనుకూడా త్యజింపచేయగలిగిన ఘనకీర్తి నీది కదా... అని అనుకున్నాడు.

★ ★ ★

సునీల్, ప్రసూనల వివాహం నిశ్చయమయింది. పెళ్లిప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

సత్యనారాయణ తన కొడుకుకు కులాంతర వివాహం చేస్తున్నాడని వినడంతో బంధువర్గాలలో కలకలం మొదలయింది. అతడు కేవలం డబ్బుకు ఆశపడిమాత్రమే ఇలా కులంను దాటుతున్నాడని గొణుక్కోవడం మొదలుపెట్టారు. "రేపు పుట్టబోయే బిడ్డల సంగతేమిటి? వారిని ఎవరు పెళ్లిచేసుకుంటారు?" అని దీర్ఘాలోచనలు చేయడం మొదలయింది.

అతడికి ఈ విషయాలన్నీ తెలుస్తూనే ఉన్నా ఏమాత్రం చింతపడటంలేదు. తమ దగ్గర డబ్బు అనే పదార్థం ఉన్నంతకాలం తననెవరూ ఏమీచేయలేరని, వారి అంచనాలన్నీ తలకిందులవుతుంటాయని అతడి నమ్మకం. ఆ నమ్మకంతోనే అతడు ముందుకు సాగుతున్నాడు.

విషయం తెలియడంతో రాజేశ్వరి హుటాహుటిన పరిగెత్తుకొచ్చింది. కాస్త భయంగానే అన్నయ్యను నిలదీసింది. "నీకు డబ్బు పిచ్చి పట్టిందన్నయ్యా. లేకుంటే ఇతర కులస్తురాలిని కోడలుగా ఎలా చేసుకొంటున్నావు. ఏం మనకులంలో తగిన అమ్మాయిలే లేకపోయారా?"

"లేదమ్మా... వాడు ఆ అమ్మాయిని ప్రేమించాడుట. మరెవరినీ పెళ్లి చేసుకోనని భీష్మించుకు కూర్చున్నాడు" వీలయినంతవరకు సర్దిచెప్పడమే అతని ధ్యేయం.

"వాడొకవేళ కుర్రతనంతో ఆవేశపడినా, మీరు వంతపాడటం ఏమీ బాగాలేదు. జనమంతా ఏమనుకుంటున్నారంటే మీరు కేవలం డబ్బుకు ఆశపడి ఈ పెళ్లి జరిపిస్తున్నారని"

"లోకులు కాకులు ఇష్టం వచ్చినట్టు వాగుతుంటారు. వారిష్టం వచ్చినట్టు వారిని మాట్లాడుకోనివ్వు.... అందుకు మనమేమీ చేయలేము" నిర్లక్ష్యంగా బదులు పలికాడు సత్యనారాయణ.

రాజేశ్వరి మరి కాసేపు ఆవేశంగా అరిచి, తర్వాత అన్నయ్య నిర్ణయం ఇక ఏమాత్రం మారదని తెలిసి ఆవేశం తగ్గించుకుంది. రెండోరోజుకు- తనూ ఆ పెళ్లిపనులలో పాలు పంచుకోసాగింది.

పెళ్లిరోజు దగ్గరయింది.

ఆ పెళ్లికి బంధువులంచరినీ పిలిచాడు అతడు. కాని మనసులో కొద్దిపాటి అనుమానం ఈ పెళ్లికి తన బంధువులెవరూ హాజరుకారేమోనని!

కాని పెళ్లి సమయానికి ఆచోటకు చేరుకున్న బంధువర్గం మొత్తాన్ని చూసి అతడికి విస్మయంతోపాటు, ఆనందం కూడా కలిగింది.



తనవైపు బంధుమిత్రులు, పురుషోత్తమరావువైపు బంధుమిత్రులు- అందరూ హాజరుకావడంతో పెళ్లి ఘనంగా జరిగింది.

వచ్చిన అతిథులందరూ వధూవరులమీద అక్షింతలు జల్లి వెళ్లిపోయారు.



పురుషోత్తమరావు లాయరే కాదు, ఆయనకు రాజకీయనాయకులు కొందరితో మంచి పరిచయమే ఉంది. కొందరి నాయకుల సొంత కేసులు ఆయనే వాదిస్తుంటాడు. ఆ పరిచయం దృష్ట్యా వారు ఆయనను మున్సిపల్ ఎలక్షన్స్‌లోనో, ఎమ్మెల్యే సీటుకో పోటీచేయమని ఉత్సాహపరుస్తుంటారు. ఎందుకో తెలియదుగాని పురుషోత్తమరావుకు మొదట నుండీ రాజకీయాలంటే అసలు పడదు. రాజకీయవాదులు తన మిత్రులయినా వారితో కేసు విషయాలు, పర్సనల్ విషయాలు, ఏవైనా ఇతర రంగాల గురించేతప్ప రాజకీయాలగురించి అసలు మాట్లాడడు.

అలా రాజకీయాలగురించి పడని ఆయన దృష్టి ఇప్పుడు సత్యనారాయణమీద పడింది. తను ఉపయోగించుకోలేని అవకాశాన్ని తన వియ్యంకుడికి ఉపయోగపడేలాచేస్తే ఎలా ఉంటుందా? అని ఆలోచించసాగాడు.

సునీల్, ప్రసూనల పెళ్లి జరిగి ఇప్పటికి ఆరునెలలయింది. ఈ ఆరునెలలలోనూ సత్యనారాయణ, పురుషోత్తమరావులు చాలా దగ్గరి స్నేహితులయ్యారు. సాయంత్రం వేళల ఆ ఇంట్లోనో ఈ ఇంట్లోనో చేరి కబుర్లు చెప్పుకునేవారు. అప్పుడప్పుడూ వరాత్సరరావు వచ్చి వీరితో కలిసేవాడు.





కులాంతర వివాహానికి కాదనకుండా ఒప్పుకున్న అతడి సహృదయతమీద ఆయనకు మొదట చాలా గౌరవం ఉండేది. తర్వాత తర్వాత ఇద్దరూ స్నేహితులయ్యాక అతడంటే అభిమానం, ఆప్యాయత కూడా కలిగాయి. ఆ అభిమానంతోనే ఆయన అతడిని మరింత పైకి తీసుకువెళ్లాలనుకున్నాడు. తన ముద్దుల కూతురు మెట్టినింటి గౌరవం మరింత పెంచేలా చేయాలనుకున్నాడు.

ఆ ఉద్దేశంతోనే ఆయన ఒకరోజు సత్యనారాయణతో రాజకీయాల ప్రసక్తి తీసుకువచ్చాడు. ఆ సాయంత్రం ఇద్దరూ సత్యనారాయణ ఇంటి ముందున్న లాన్‌లో కూర్చుని ఉన్నారు. సూర్యుడు పశ్చిమకొండలమధ్య అలసటగా వాలుతున్నాడు. చల్లగాలి ఉండుండి మెల్లగా వీస్తోంది. ఆకాశం మరికొంతసేపట్లో చీకటిచీర కట్టుకునేందుకు సిద్ధపడుతూ ఉంది.

పురుషోత్తమరావు అన్నాడు- ''బావగారూ! మీరు రాజకీయాలలోనికి దిగకూడదూ?''

సత్యనారాయణ ఉలిక్కిపడి, వెంటనే నవ్వేశాడు. ''నేనా- రాజకీయాల్లోకా?! భలేవారే! రాజకీయాలలోనికి దిగేందుకు నాకేమి అర్హత ఉందనీ?''

''ఓహో! మర్డర్లు- రేప్‌లు చేసి నేరస్తుడిగా చరిత్ర లేకుండా రాజకీయాలలోనికి ఎలా దిగడమా అనా మీరు అనేది. అయినా ఫర్వాలేదు మన ప్రజలు రౌడీలనూ, గూండాలనేకాదు ఒక్కోసారి పొరపాటున మంచివారిని కూడా గెలిపిస్తారు. అలాంటి పొరపాటు ఏదయినా జరిగితే, నువ్వు ఎమ్మెల్యేవో, మున్సిపల్ ఛైర్మన్‌వో కావచ్చు'' నవ్వాడు పురుషోత్తమరావు.

సత్యనారాయణ తనూ నవ్వుతూ ''అయినా ప్రజాసేవ చేయాలనుకుంటే ఎలక్షన్స్‌లో పోటీ చేయాలని, పదవి కావాలని ఏముంది? ఏ అధికారమూ చేతిలో లేకుండా ప్రజలకు ఉపయోగపడవచ్చు''

''ప్రజా సేవకోసం ఎలక్షన్స్‌లో పోటీ చేస్తున్నామని చేయమని ఎవరు అన్నారు? ఎలక్షన్స్‌లో పోటీ చేయడంగాని, పదవి సంపాదించడంగాని కేవలం మన కుటుంబగౌరవం నలుగురికీ తెలిపేందుకు. మనవారికి నలుగురికీ ఉపయోగపడేందుకు. లేదా అధికారం ద్వారా మనం కాస్త సంపాదించుకునేందుకు అంతే''.

అతడి మనసు చివుక్కుమంది. డబ్బులో మెలగడంవలన మానసికంగా తాను కాస్త దిగజారి ఉండవచ్చుగాని, ఇంకా రాజకీయనాయకుల స్థాయికి దిగజారి ఆలోచించడం మొదలుకాలేదు. అలాంటి స్వార్థం ఇంకా అతడిలో ప్రవేశించలేదు.

"మన స్వార్థంకోసం రాజకీయాలలో ప్రవేశించడం నాకెంతమాత్రం ఇష్టంలేదు. ఏదైనా ప్రజాసేవ చేసే ఉద్దేశంతో రాజకీయాలలో దిగితే బాగుంటుందిగాని, కడుపునిండా స్వార్థం ఉంచుకుని ప్రజలకు మోసం మాటలు చెప్పడం నావల్లకాదు" ఖచ్చితంగా అన్నాడు సత్యనారాయణ.

"ప్రజాసేవ.... ప్రజాసేవ.... ఎవరయ్యా ప్రజాసేవ చేసేది ఈ దేశంలో! అందరూ తమ తమ స్వార్థంకోసం జనాలను నమ్మించేవారే. ఆఖరికి నీతి తప్పకూడని పత్రికలు కూడా సర్క్యులేషన్‌కోసం అబద్ధాలు, అభూతకల్పనలు రాసి ప్రజలను మోసగిస్తున్నాయి. ఇంకా ఎక్కడుంది ఈ దేశంలో నీతి, నిజాయితీ?! అవెప్పుడో బి.సి. కాలంలో ఉండేవి. ఇప్పుడు భూతద్దంపెట్టి జీవితాంతం వెతికినా ఏ కొంచెంకూడా కనిపించవు. కాబట్టి.... కనుపించని నీతి- నిజాయితీలకోసం ప్రాకులాడకుండా, కనిపించే అందలాన్ని ఎక్కి అందరి గౌరవాభిమానాలు పొందుతూ అధికారం చెలాయించడం ఉత్తమం... నీతి నీతి అంటే మనమెక్కడో గోతిలోనే ఉండిపోతాం గుర్తుపెట్టుకో...."

ఇంతలో అక్కడికి సునీల్, ప్రసూన వచ్చారు. నిముషం వెనుకగా పరాత్పరరావు కూడా వచ్చిన వారితో కలిశాడు.

అందరూ కుర్చీలలో కూర్చున్నాక- "ఏమిటి నాన్నా! మీరిద్దరూ చాలాసేపటినుండీ పెద్దపెద్దగా వాదించుకుంటున్నట్లు వినిపించింది- ఏమిటి విశేషం" అని అడిగాడు సునీల్.

సత్యనారాయణ ఏదో చెప్పబోయేంతలో పురుషోత్తమరావు కల్పించుకుని- "మీ నాన్నగారిని రాజకీయాలలోకి దిగవయ్యా అంటే- ప్రజాసేవ చేయాలంటే పదవులే కావాలా అని ప్రశ్నిస్తున్నాడు. ఈ ప్రజాస్వామ్యంలో అధికారం అన్నది ఒక గొప్ప శక్తి. ఆ శక్తిని కూడా మన కుటుంబానికి సంపాదించిపెడతాం అంటే నామాట మీ నాన్నగారు వినడంలేదు. ఏంచేద్దాం..." నిష్ఠూరంగా అన్నాడు.

సునీల్ తండ్రివంక అదోలా చూశాడు. ప్రసూనమాత్రం క్యూరియాసిటీతో వారిద్దరినీ పరీక్షించింది. మిత్రుడి మనసెరిగిన పరాత్పరరావుమాత్రం ఆలోచనలో పడ్డాడు- ఆ విషయాన్ని ఎలా సెటిల్‌చేస్తే బాగుంటుందా అని.

"స్వలాభాపేక్షతో రాజకీయాలలోనికి దిగడం నాకిష్టంలేదు బాబూ" తనను తాను సమర్థించుకుంటూ కొడుకుతో చెప్పాడు సత్యనారాయణ.

"ఈరోజులలో స్వలాభాపేక్ష లేనివాళ్లు ఎవరున్నారు నాన్నా! ఎటుచూసినా ఈ సమాజంనిండా స్వార్థం నిండుకునిఉంది. కాబట్టి అవకాశం దొరికినప్పుడు దానిని మనం ఉపయోగించుకోవాలి. లేకుంటే నేటి పరుగు పందెంలో మనం వెనకబడిపోయే అవకాశం ఉంది"

"సునీల్ చెప్పిన మాటలలో కొంత వాస్తవం ఉంది." తాను కల్పించుకుంటూ అన్నాడు పరాత్పరరావు.

"సునీల్ ఇంతకీ నువ్వు పరుగుపందెం అన్నావే ఎందుకోసం ఆ పరుగుపందెం"

"డబ్బు- అధికారంకోసం"

"ఒకవేళ అవి లేకపోతే ఏమవుతుంది?"

సునీల్ తన ముఖంలోని విసుగుని కనిపించనివ్వకూడదని చాలా కష్టపడ్డాడు. అయినా అది అనవసర ప్రయత్నమే అయింది.

"చూడు నాన్నా! మీరు గతాన్ని ఒక్కసారి గుర్తుచేసుకోండి. ఆరోజులలో మీరు డబ్బు లేక ఎంతో కష్టపడ్డారు. అవమానాలు దిగమింగారు. అలా డబ్బులేక వ్యధలుపడ్డ మీకు ఆ డబ్బుమీద ఒకరకమైన కసి ఉండాలి. ఆ కసితో ఒకప్పుడు మనకు లేనిదాన్ని మరింత మరింత సంపాదించాలి".

"ఎంత సంపాదించాలి?"

"సంపాదించగలిగినంత. వీలయితే బ్రూనే సుల్తాన్ కన్నా ఎక్కువ సంపద కలిగినవారిగా

గుర్తింపబడాలనుకోవడంలో తప్పులేదు. ఆ బోల్కియా గురించి చదువుతుంటే నాకే మని పిస్తుందో తెలుసా! ఒక కారు, ఒక మేడకే మురిసిపోతున్నామే! ఇక ప్రపంచ ప్రఖ్యాతి చెందిన అతడి భవంతులు, ప్రత్యేక విమానా లు, అత్యంత ఖరీదైన షాపింగ్‌లు... జీవితం అంటే అదే నాన్నా...''

''ఆ బోల్కియా కూడా తన సంపదతో తృప్తి పడుతున్నాడంటావా? ఈ డబ్బు, అధికారం ప్రాకులాట ఏ స్థాయిలోనూ తృప్తి కలిగించదు''

''తృప్తి అన్నది మనిషికి ఉండకూడదు నాన్నా! ఆ తృప్తి అన్నది మనిషిలోని శక్తిని ఆసక్తిని చంపేస్తుంది. ఆనాడు ఆదిమానవులు 'ఇదే జీవితం- ఈ జీవితం చాలు' అని తృప్తి పడి ఉంటే ఈనాడు ఈ ఆకాశహర్మ్యాలు, రోదసీ పయనాలు ఉండి ఉండేవా? చె ప్పండి...''

''నేను చెప్పేది ఒక దారి గురించి, నువ్వు వివరించేది మరో దారి గురించి'' చెప్పాడు అతడు.

''అన్నిదారులూ కలిసేది ఆ చోటనే'' సు నీల్ జవాబు అది.



"నువ్వేన్నయినా చెప్పు సునీల్! మనసు చంపుకుని నేనేవనీ చేయలేను"

"ఒక గొప్పస్థాయికి వెళ్ళే అవకాశం వదలొద్దు నాన్నా"

"నన్ను బలవంతపెట్టకు" కసురుకున్నాడు అతడు.

"ప్లీజ్ నాన్నా"

"నో"

"ప్లీజ్"

ఇక వారిద్దరి మధ్యా తను జోక్యం కలిగించుకోవలసిన సమయం వచ్చిందని మాట మొదలుపెట్టాడు పరాత్పరరావు "సరేనోయ్ సునీల్! మీ నాన్న రాజకీయాలలోనికి దిగేందుకు ఎలాగోలా వప్పిస్తామనుకో. కాని మనకు కావలసింది రాజకీయాధికారం అయినపుడు మరి అది పొందేందుకు దారి ఏది?"

"ఆ దారి నేను చూపిస్తాను" టక్కున అందుకున్నాడు పురుషోత్తమరావు.

"నాకు తెలిసిన నాయకులు చాలామంది ఉన్నారు. వారిద్వారా ప్రయత్నిస్తే ఏదో ఒక పార్టీ టిక్కెట్ దొరకకపోదు. ఆ తర్వాత మన శక్తి, డబ్బు ఖర్చుపెట్టే విధానాన్నిబట్టి గెలుపు లభించకుండా పోదు... ఏమంటారు?"

"ఈ అవకాశం ఉపయోగించుకోగలిగితే మంచిదేనంటాను?" చెప్పాడు పరాత్పరరావు.

"మరి ఈ ఘనకార్యానికి మీ మిత్రుని వప్పించే బాధ్యత మాత్రం మీదే" పెద్ద బాధ్యత పరాత్పరరావు మీదికి నెట్టేసి తప్పుకున్నాడు పురుషోత్తమరావు.

ఆ రాత్రి-

యుద్ధం మీద విరక్తి చెందిన అర్జునుడికి గీతబోధ చేసిన కృష్ణుడిలా, పరాత్పరరావు సత్యనారాయణకు 'ఈ తరంగీత' బోధించాడు. నేటి కాల పరిస్థితులు, సమాజంలోని భిన్నపోకడలు, ప్రస్తుతం వ్యవస్థ నడుస్తున్న తీరు అన్నీ వివరించాడు. సమాజం గురించి చెప్పాక, ప్రస్తుతం అతడి కర్తవ్యం ఏమిటీ?, కాలానుగుణ్యంగా ఎలా ప్రవర్తించాల్సిందీ, మనిషి సుఖంగా బ్రతకాలంటే ఏం చేయాల్సిందీ తెలియచెప్పాడు. చివరగా ఇవన్నీ చెప్పాక, నువ్వు నిమిత్తమాత్రుడివి, కాలానుగుణ్యంగా నడిచే ఒక సాధారణ వ్యక్తివి అన్నాడు ఆయన.

పరాత్పరరావు రెండోసారి మిత్రుడి జీవితాన్ని మరో మలుపు తిప్పగలిగాడు. ఆరోజు సునీల్ పెళ్లి విషయంలోలానే- ఈసారి కూడా తన నేస్తం మాటలు గౌరవించాలనుకున్నాడు అతడు. అంతేకాదు- మనసులో పేరుకుంటున్న ఏ 'కసో'నో అతడి చేత అవుననిపించింది. రాజకీయాలలో దిగేందుకు మొదట తిరస్కరించినా, అన్నీ ఆలోచించి అందుకు ఒప్పుకున్నాడతను.

దాంతో సత్యనారాయణ రాజకీయరంగ ప్రవేశం ప్రారంభమయింది.

★ ★ ★

శాసనసభ ఎన్నికల ప్రకటన జారీ అయింది. రాజకీయవర్గాలలో కలకలం మొదలయింది.

పురుషోత్తమరావు సత్యనారాయణను ఎమ్మెల్యేగా నిలబెట్టేందుకు సకల సన్నాహాలు మొదలెట్టాడు. ఆయనకు ఒక మాజీ మంత్రితో పరిచయం ఉంది. ఆ పరిచయాన్ని పురస్కరించుకుని అతగాడి ద్వారా పార్టీసీటు కోసం ప్రయత్నించాడు. పార్టీఫండ్ కింద పెద్దమొత్తమే జమ చేశాడు.

సత్యనారాయణ మాత్రం జరిగే తంతు నిర్లిప్తంగా చూస్తున్నాడు.

అతడికి పార్టీ సీటు వచ్చింది. నామినేషన్ వేయడం కూడా జరిగింది.

సత్యనారాయణ ఎన్నికలలో పోటీ చేస్తున్నాడని తెలియడంతోనే అతడి బంధువర్గంలో కలకలం మొదలయింది. మొన్నటి దరిద్రుడు నిన్నటిరోజు లక్షాధికారి అయ్యాడు. నేడు అధికారంకోసం ప్రయత్నిస్తున్నాడంటే రేపు ఆ అధికారాన్ని తప్పకుండా పొంది తీరుతాడు.

డబ్బున్నవాడితో అవసరం ఉండొచ్చు, ఉండకపోవచ్చు, కాని అధికారం ఉన్నవాడితో ఎట్టి పరిస్థితిలోనూ అవసరం పడి తీరుతుంది. అందుకే అతడి దగ్గరకు బంధువుల రాక మొదలయింది. నిన్నటిరోజు- కొడుకుకు కులాంతర వివాహం చేశాడని గొణిగినవారు కూడా, ఫలానా ఎమ్మెల్యేగా పోటీచేసే వ్యక్తి మాకు ఫలానా విధంగా బంధువు అని వక్కావా




రికి చెప్పుకోవడం మొదలెట్టారు. ఇది లోక సహజం! 'కనిపించే దరిద్రులు తమ దగ్గరి బంధువులని చెప్పుకోవడానికి సిగ్గుపడే జనం, కనుపించని గొప్పవారిని- తమకు దూరపు బంధువులైనా చాలా దగ్గరయినట్టుగానే చెప్పేసుకుంటారు'.

అతడి కొడుకు,కోడలు, అల్లుడు, కూతురు, బంధువులు, మిత్రులు, కొత్తగా ఏర్పడిన అనుచరవర్గం, అంతా ఆ ఇంట్లో సమావేశమవసాగారు. ఆ ఇంటికి కొత్త కళ వచ్చేసింది. నిరంతరం జనంతో సందడి పెరిగింది. కారులు, జీపులు, స్కూటర్లు ఇంటి ముందు ఆగసాగాయి. అధికారులు, అనధికార ప్రముఖులు రావడంతో ఆ ఇంటికి హుందాతనం పెరిగింది.

అతడికిదంతా తలచుకుంటే చాలా ఆశ్చర్యమేస్తోంది. ఈ కొత్తమార్పులన్నింటికీ కారణం - డబ్బు అని తెలుస్తూనేవుంది.

ఆ డబ్బులేకుండా ఉన్నట్లయితే సునీల్, ప్రసూనల వివాహం జరిగేదా? అన్నది సంగిగ్ధమే అయినా, ఆ తర్వాత మార్పులన్నీ ఈ డబ్బు లేకుండా ఉండి ఉంటే ఎట్టి పరిస్థితులలోనూ జరిగి ఉండి ఉండేవి కావు.

పార్టీఫండ్ ఇవ్వకపోతే పార్టీసీటు రాదు. ఎమ్మెల్యేగా పోటీ చేస్తూ ఉండకపోతే జనం తన చుట్టూ మూగేవారు కాదు. అధికార, అనధికార ప్రముఖులు తనకు సలాములు కొట్టేవారు కాదు. డబ్బు మనిషిని అంత గొప్పస్థితికి తీసుకువెళ్తుందా! అందుకు ప్రత్యక్షనిదర్శనంగా తనే ఉన్నాడు కదా!

పోలింగ్‌రోజు దగ్గరపడుతోంది. అతడి తరుపు జనం తమ నాయకుని గెలుపు కోసం కష్టపడి తిరగడం మొదలెట్టారు. కొడుకు, అల్లుడయితే రాత్రివగలూ అని లేకుండా కార్యకర్తలను కలుసుకోవడం, ఇవ్వవలసిన చోట డబ్బు, పోయవలసిన చోట సారాయి పోస్తూ వస్తున్నారు.

అతడు కూడా స్థానిక నాయకులను వెంటేసుకుని ఆ ప్రాంత ప్రజలను కలుసుకోసాగాడు. అతడి వెంట ఎప్పుడూ పరాత్పరరావు, పురుషోత్తమరావు తోడుగా ఉండేవారు. ఇక ఇతర అనుచరవర్గం సంగతి సరేసరి!

ఎన్నికలు మరో మూడు రోజులున్నాయనగా టౌన్‌లో పెద్ద బహిరంగ సభ ఏర్పాటు చేయబడింది. ఆ సభలో మాజీ ముఖ్యమంత్రి, మాజీ మంత్రులతోపాటు అతడూ ప్రసంగించాడు. అలాంటి బహిరంగసభలో మాట్లాడటం మొదటిసారయినా ఎందుకో స్టేజ్ ఫియర్ అనిపించలేదు. అనర్గళంగా, సుదీర్ఘంగా మాట్లాడాడు. అతడి ఉపన్యాసం చాలామందిని ఆకట్టుకుంది. ప్రజాకర్షణశక్తి పెరిగింది. అతడిపట్ల జనంలో సదభిప్రాయం ఏర్పడింది. ముఖ్యంగా పట్టణప్రాంతంలోని విద్యావంతులు అతడిని ఇష్టపడసాగారు.

వీటన్నింటికీ తోడు అవతలిపార్టీ అభ్యర్థి కాస్త బలహీనుడు. రాజకీయాలకు కొత్తవాడు కాకపోయినా, పని చేయలేని 'అసమర్థుడి'గా ప్రజలలో గుర్తింపబడ్డాడు. క్రితం ఎన్నికలలో ఆ అభ్యర్థిని గెలిపించినందుకు, తమకేమీ పనులు చేయలేదని నియోజకవర్గ ప్రజలలో అసంతృప్తి పేరుకుని ఉంది. ఆ అసంతృప్తి ఈసారి ఎన్నికలలో స్పష్టంగా బయటపడింది. దానికితోడు సత్యనారాయణ వినయ విధేయతలు చూసి, ఉపన్యాస ధోరణి విని ఉండడంతో ప్రజలు అతడి వైపే మొగ్గు చూపసాగారు.

విజయవకాశాలు స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నా అతడి మనుష్యులకు టెన్షన్‌గానే ఉంది. పోలింగ్ జరిగేలోపు జనం మనసులు ఎలా మారతాయో ఎవరూ చెప్పలేరు. డబ్బు సంచులో, సారాయి సీసాలో జనం అభిప్రాయాలను అవలీలగా మార్చి, క్షణాలలో గెలుపు ఓటములను తారుమారు చేయగలవు.

అందుకే వారంతా పరిస్థితులను చాలా జాగ్రత్తగా గమనిస్తున్నారు. సునీల్ డబ్బును మంచినీళ్ళలా ఖర్చుచేస్తున్నాడు. ఎలాగయినా తండ్రిని ఎమ్మెల్యేని చేయాలి. ఎమ్మెల్యే కొడుకుగా ఉంటే బిజినెస్ మరింతా డెవలప్ అవుతుంది. తండ్రి రెకమండేషన్‌తో మరిన్ని కాంట్రాక్టులు సంపాదించి, మరెంతో డబ్బు సంపాదించవచ్చు... మనిషి చేసే ప్రతి పని వెనుకా స్వార్థమే. సంపాదనా కాంక్షే.

పోలింగ్ మరొక్కరోజు మాత్రమే ఉంది.

ప్రచారహోరు ఒక్కసారిగా తగ్గిపోయింది.

కేన్సర్‌రోగి మరికొద్ది నిముషాలలో చనిపోతాడనగా ఏర్పడే భయంకర ప్రశాంతత, రాష్ట్రమంతా అలముకుంది. ఆ ప్రశాంతత చాటు చాపకింద నీరులా కొందరు జనం తమ పను లు తాము చేసుకుంటూ పోతున్నారు. ఓట్ల కొనుగోలు, సారాయి ప్యాకెట్‌ల పంపకం చాటుగా జరిగిపోతున్నాయి. ఎవరికి తగిన విధంగా వారు విజయం కోసం ప్రయత్నిస్తున్నారు.

ఎన్నికల పోరాటంలో గెలుపు ఓటములు నిర్ణయించేది ప్రజలు మాత్రమే!

మొదట నిర్లిప్తతగా ఉండిపోయినా, పోలింగ్ తేదీ దగ్గరపడే కొద్దీ సత్యనారాయణలో ఉత్సుకత పెరగసాగింది. ఈ పోరాటంలో ఈ జనం నన్ను గెలిపిస్తారా లేదా?... భావాలు ఉన్నతమైనవి కావచ్చు. కానీ అతడూ మనిషే! మనిషికి ఉండే ఆరాటం, తాపత్రయం కొద్దిస్థాయిలోనైనా అతడిలో ఉన్నాయి.

పోలింగ్ రోజు రానే వచ్చింది.

చచ్చిపోతాడనుకున్న కేన్సర్‌రోగి పొరపాటున బ్రతికినట్టు, జనం ఉరుకులు పరుగులు మొదలెట్టారు. పోలింగ్ కేంద్రాలలో జనం బారులు తీరారు.

క్యూ కట్టిన ఆ జనాన్ని చూస్తే సత్యనారాయణకు నవ్వు వచ్చింది. పాపం! తాము ఎన్నుకోబోయే నాయకులు తమకేదో ఒరగబెడతారని, తమ కష్టాలు తీరుస్తారని నన్నపాటి ఆశతో తమ విలువైన ఓటును ఎవరో అనామకులకు వేసి గెలిపిస్తుంటారు ఈ జనం.

కాని వారికేం తెలుసు! ఎన్నికలు పోరాటంలో పోటీ చేసే వ్యక్తులకు ఈ పోటీ ఒక తమాషా ఆట లాంటిదనీ, వారు కేవలం తమ కుటుంబ ప్రతిష్టకోసమో, లేదా లాభార్జనతోనో, మరే స్వార్థంతోనే ఎన్నికలలో పోటీ చేస్తున్నారనీ.

ఒకవేళ నాయకుల గురించి తెలిసినా, వారికి మరో మంచి ఆప్షన్ లేదు. కాబట్టి ఉన్నవారిలోనే ఒకరిని ఎన్నుకోక తప్పని పరిస్థితి. అందుకే ఈమధ్య ఎన్నికలు జనంలో నిరాసక్తతను కలిగిస్తున్నాయి. ఈ నిరాసక్తతే రేపు హెూదాతో ఉద్రేకానికి దారి తీస్తుంది.

పోలింగ్ జరుగుతూ ఉంది.

సత్యనారాయణ తన ఓటు బాక్స్‌లో వేసి వచ్చాడు. అతడి వెనుకే వందల కొలదీ జనం తమ అభిమానాన్ని ఓటుగా మార్చి పెట్టెలో వేస్తున్నారు.

ఆ పెట్టె రేపు పోటీచేసినవారి భవిష్యత్తును తేల్చేది. ఎవరి భవిష్యత్ ఎలా ఉందో తేలేందుకు మరో రెండురోజుల వ్యవధి ఉంది.

సాయంత్రం ఐదు గంటలకు పోలింగ్ పూర్తయింది.

ఆపరేషన్ పూర్తయిన తర్వాత డాక్టర్‌లు పొందే రిలీఫ్ లాంటిది నాయకులకు కలిగింది.

ఇక తేలవలసింది గెలుపు- ఓటములు మాత్రమే.

★ ★ ★

"నువ్వు తప్పకుండా గెలుస్తావోయ్ సత్యం"

సత్యనారాయణ పరాత్పరరావు ముఖంలోనికి చూశాడు. తనతోపాటు సమానంగా, ఒక్కోసారి తనకన్నా ఎక్కువగా ఎలక్షన్స్‌లో తన గెలుపుకోసం తిరగడంతో బాగా అలసినట్టుగా కనిపిస్తున్నాడాయన. తనను చెడుమార్గం పట్టించాడా మంచిమార్గం తొక్కించాడా అన్నది వదిలేస్తే తన ఉన్నతస్థితి కోసం ఆ మిత్రుడు పడే తపన చూస్తుంటే అతడి గుండె తరుక్కుపోసాగింది.

ఏ వ్యక్తయినా ఆ భగవంతుని కోరుకోవలసిందేమిటో తెలుసా? 'నిన్ను నిన్నుగా ప్రేమించే భార్యను ఇవ్వకపోయినా ఫర్వాలేదు- స్నేహమేరా శాశ్వతం అని అనిపించే ఒక మంచి స్నేహితుని ప్రసాదించమని'

ఈ లోకంలో డబ్బు దుర్వాసన భార్యాభర్తల సంబంధాన్ని కూడా కలుషితం చేసిందిగాని, స్నేహం మాత్రం ఆ దుర్వాసనకు కొంత దూరంగా ఉన్నట్టుగానే అనిపిస్తుంటుంది. ఇందుకు కారణాలనేకం.

"అలా అని నువ్వు ఖచ్చితంగా ఎలా చెప్పగలవు?" ప్రశ్నించాడు సత్యనారాయణ.

"జనం మాటలు వింటుంటే ఓట్లు నీకే ఎక్కువ పడినట్టున్నాయి. ప్రజలు చాలావరకూ నిన్నే అభిమానిస్తున్నారు".





"జనాల మనసులోని మాట అంత తేలికగా బయటపడదు. ఓటర్లు ఇప్పుడు తెలివి మీరి పోయారు. లోపల ఒకటి ఉంచుకుని, పైకి ఒకటి మాట్లాడుతున్నారు".

"ఏమయినా గెలుపు నీదే అనిపిస్తోంది"

"అయినా ఇది నా ఘనతే ఎందుకనుకో వాలి. నా పార్టీ మీద అభిమానం కొంత, అవతల పార్టీ ఏమీ చేయలేదని వ్యతిరేకత కొంత, ప్రత్యర్థి అసమర్థత కొంత నా గెలుపుకు ఇవన్నీ కారణాలవుతాయి" నవ్వుతూ అన్నాడు సత్యనారాయణ.

"అఫ్‌కోర్స్! అదీ నిజమేననుకో... కాన్నీ ఇందులో నీ టేలెంట్ కూడా కొంత ఉందని ఒప్పుకోక తప్పదు"

వారి సంభాషణ మధ్యనే పురుషోత్తమరావు వారి మధ్యకు వచ్చాడు. మర్నాడు కలెక్టరాఫీ సులో జరగబోతున్నకౌంటింగ్ గురించి చర్చ ప్రారంభమయింది. అక్కడ జరగబోతున్న ఏర్పాట్ల గురించి వివరించాడు పురుషోత్తమ రావు.

"ఇప్పటికే జనం "కాబోయే ఎమ్మెల్యే ఫలానా" అని తెలిసిపోయిందనీ, ఇక రేపు జరగబోయేది కేవలం నిర్ధారణ మాత్రమేనని" కూడా చెప్పాడాయన.

సత్యనారాయణ చిరునవ్వు నవ్వి ఊరుకు న్నాడు.

గెలుపు సాధ్యమేనని తెలిసినా అందరి మనసులలో ఉత్సుకత. ఫలితాలు తెలియబో యేముందు పేరుకుని ఉన్న స్తబ్ధత.

ఆ స్తబ్ధత బద్ధలయ్యేందుకు మరి కొద్ది గంటల వ్యవధిమాత్రమే ఉంది.

★ ★ ★

కౌంటింగ్ ప్రారంభమయింది.

కలెక్టరాఫీసు చుట్టూ జనసందోహం మూగి ఉన్నారు. వారిలో కొందరు తమ అభ్యర్థి తర పున రకరకాల నినాదాలుచేస్తున్నారు.

మొదటి రౌండ్ కౌంటింగ్ పూర్తయింది. ఆ రౌండులో సత్యనారాయణే ఆధిక్యతలో ఉన్నా డు. ప్రత్యర్థి వర్గాలలో కళాకాంతులు తగ్గిపో యాయి. ఫలితాలువింటున్న పురుషోత్తమ రావు, పరాత్పరరావు, సునీల్, శివకుమార్ అందరిలోనూ టెన్షన్... తాము పడ్డ కష్టానికి ఫలితం ఏమిటి?

రెండో రౌండ్‌లోనూ అతడిదే మెజారిటీ. అలా సాగిన అతడి ఆధిక్యత కౌంటింగ్ చివరి వరకూ అలాగే ఉండిపోయింది.

సత్యనారాయణ పదివేల పై చిలుకు ఓట్ల మెజారిటీతో ఎన్నికలలో విజయం సాధించా డు.

అప్పటివరకూ పేరుకుని ఉన్న స్తబ్ధత ఒక్క సారిగా బద్దలయింది. జనం పెద్దపెట్టున హర్ష ధ్వానాలు చేసారు. పార్టీ కార్యకర్తలు ఈలలు, కేకలు వేస్తూ 'సత్యనారాయణ జిందాబాద్' అని అరవటం మొదలుపెట్టారు. ఇక అతడి స్వంత మనుష్యులలో అయితే అప్పటివరకూ పేరుకుని ఉన్న ఉత్సుకత ఉద్వేగంగా మారింది. తాము... తాము విజయం సాధించా రు. రాజకీయాధికారం హస్తగతంచేసుకున్నా రు.

అతడు లోపల నుండి ఇవతలికి వచ్చాడు. అతడిని చూడడంతోనే జనంలోనే పొంగి పొర లిన ఆనందోత్సాహాలు! పెద్దపెట్టున 'జేజే'నా దాలు, ఘన స్వాగతాలు!

అతడికిదంతా ఒక కలలా ఉంది. తను తనేనా అని అనుమానంగా ఉంది. అందుకే తనను గిల్లి చూసుకున్నాడు. ఇది భ్రమకా దు, వాస్తవమే! ఈ జనమంతా జేజేలు కొడుతున్నది తనకే!

సుమారుగా మూడేళ్ళక్రితం తను ఒక ఆడపిల్ల పెళ్ళి చేయలేని 'అసమర్థుడైన తండ్రి' అప్పులవాళ్ళతో నానా మాటలు అని పించుకున్న 'అల్పజీవి!' మరి ఈ మూడేళ్ళ వ్యవధిలోనే ఇంతమార్పు ఎలా సాధ్యం?!

జనం ఇప్పుడు తనో సమర్థుడినని కాబోలు రాజకీయాధికారం చేతికిచ్చి పట్టంకట్టారు. అపూరూపంగాఅభిమానిస్తూఆప్యాయతలు కురి పిస్తున్నారు.

తనో సమర్థుడినని భావించేందుకు, అభి మానం, ఆప్యాయత కురిపించేందుకు కా రణం ఏమిటి?

జనం అతడిని పైకెత్తేశారు. పిచ్చిగా అరు స్తూ కుప్పిగంతులువేస్తూ ముందుకు నడవసా

గారు.

ఊరేగింపు ప్రారంభమయింది. కొత్తగా అలవడిన రాజకీయనాయకుల లక్షణంతో రెండుచేతులూ జోడించి ప్రజలకు నమస్కరిస్తూ, చిరునవ్వులు చిందిస్తూ ముందుకు అడుగువేయసాగాడు.

రోడ్డువక్క బారులుతీరిన జనం అతడివంక రకరకాల దృష్టులతో ఆదోలా చూస్తున్నారు. అతడిగురించి వివిధరకాలుగా చెప్పుకుంటున్నారు. అందులో పొగడ్తలున్నాయి , తెగడ్తలున్నాయి.

ఒక మనిషి పైకిపోయే కొద్దీ అతడికి ఎంత మంది అభిమానులు ఏర్పడతారో, అంత మంది శత్రువులూ ఏర్పడతారు. ఈ శత్రుత్వానికి ఒక కారణమంటూ ఉండదు. అయితే అసూయ అన్నది ఆ కారణాలలో ఒక కారణమయి ఉండొచ్చు.

అతడు జనం మధ్య నడుస్తున్నా మనసు మాత్రం తన స్థితి గురించే ఆలోచిస్తోంది... అవునూ! ఇంతకీ తన ఈ స్థితికి కారణం ఏమిటి? తను ఈ అందలంలోనికి ఎలా ఎక్కగలిగాడు? ఇంతమంది ప్రజల ఆదరాభిమానాలు ఎలా సంపాదించుకోగలిగాడూ?!... జవాబుగా అతడికి తోస్తున్నపదం ఒక్కటే!

డబ్బు!

తనకు ఆ లాటరీ డబ్బువచ్చి ఉండకపోతే ఇవేవీ సాధ్యంకాదు.

అయితే అతడికి కొత్తగా తెలిసిన మరో సత్యం ఏమిటంటే మనిషికి డబ్బుఉంటే అయినవారి ఆదరాభిమానాలు ప్రత్యేకంగా ఉంటాయని తనింతకాలం అనుకుంటూ వచ్చాడు. కాని ఇప్పుడే తెలిసింది అతడికే మీ కానివారుకూడా డబ్బుంటేనే ప్రత్యేక ఆదరాభిమానాలు చూపిస్తారని డబ్బువలన జనం అభిమానం కొనుక్కోవచ్చని!

ఎందుకో తెలియదు అంతటి ఉద్విగ్నస్థితిలో కూడా అతడికి ఈ లోకంమీద జాలివేసింది.

అతడు అనుకున్నాడు 'ఓ ధనమా! మనిషిని అందలం ఎక్కించగలవు. అధఃపాతాళానికి తోసేయగలవు. ఈ లోకంలోని అభిమానాలు, ఆప్యాయతలు, అధికారాలు, అన్నీ నీచుట్టే తిరుగుతున్నాయంటే నిజంగా నువ్వెంత గొప్పదానివి?!'

సత్యనారాయణమూర్తి పేరుకు పక్కనే ఎమ్.ఎల్.ఎ అనే అక్షరాలు వచ్చి కలిశాయి ఇప్పుడు.

అలా జరిగినందుకు అతడేమంత గొప్పగా ఆనందపడిపోలేదు. నిన్న సినిమాహాలు ముందు బ్లాక్‌లో టిక్కెట్లు అమ్మించిన వ్యక్తి నేడు మంత్రి అయిపోతున్నాడు. మొన్నటిదాకా వీధుల్లో గూండాగా తిరిగిన వ్యక్తి ఇప్పుడు ఎం.పి అయి దేశ ప్రజల భవిష్యత్ నిర్ణయిస్తున్నాడు.

ఈ దేశంలో రాజకీయాలు ఆ స్థాయిలో ఉన్నాయి. అందుకే మేధావులు ఆ రాజకీయాలకు దూరంగా ఉంటున్నారు. కాబట్టే ఈ దేశాన్ని గూండాలు, హంతకులు, బ్లాక్ మార్కెటీర్లు, సారా వ్యాపారులు - తదితర వ్యక్తులు పరిపాలిస్తున్నారు. స్వార్థపరులైన అటువంటి వారి చేతులలో ఈ దేశ భవిష్యత్ అగమ్యగోచరంగా ఉంది.

ఒకింత మంచితనం, సచ్ఛీలత ఉన్న తను ఇలాంటి నీచరాజకీయాలలో దిగి మనసును కష్టపెట్టుకోవటం అతడికిష్టంలేదు. అయినా తప్పదు. ఈ లోకంలో మనిషి ప్రతి పనీ తనకోసమే చేసుకోడు. ఒక్కోసారి కొన్నిపనులు తనకిష్టం లేకపోయినా, తనవారికోసం చేయక తప్పదు.

తను ఈ రాజకీయాలలో దిగడం - కేవలం తనవారి తృప్తికోసమే.

'అయినా - ఒకవేళ తనవారి బలవంతం మీదనే ఈ రాజకీయాలలోనికి దిగినా, తను మాత్రం ఈ దేశంలోని అందరు 'రాజకీయనాయకుల్లా ఎల్లవేళలా తప్పు చేయడం జరగదు. తను వీలయినంతవరకూ ప్రజాసేవ చేస్తాడు. ప్రజలలో కలసిపోయి ప్రజల మనిషిగా బతుకుతాడు.... వారు తనమీద ఎంతో అభిమానం ఉంచి, మరెంతో నమ్మకంతో గెలిపించారు. తను వారి నమ్మకాన్ని వమ్ముచేయడు. ప్రజలచేత ప్రజలకొరకు ప్రజలే ఎన్నుకున్న ఈ సత్యనారాయణ కేవలం ప్రజల కోసమే బతుకుతాడు. ప్రజల సేవకే అంకితమవుతా





డు...

ఈ ఆలోచనతో సత్యనారాయణకు అదోలాటి తృప్తి మనసులో ఏర్పడింది. నీచరాజకీయాలలో కూడా తను ఒకింత నీతిగా బతకదలచుకున్నందుకు ఎంతో ఆనందంగా అనిపించింది.

అతడు ఆ ఆనందంతో కొద్దిరోజులపాటు సంతృప్తిగానే బతికాడు. తన దగ్గరకు వచ్చే జనం సమస్యలు విని, వారి సమస్యల పరిష్కారంకోసం తనే స్వయంగా ఆఫీసులకు వెళ్ళో, అధికారులను ఇంటికి పిలిపించుకునో మాట్లాడేవాడు. సాధ్యమయినంతలో ఆ సమస్యా పరిష్కారంచేసి మరీ జనాన్ని వెనక్కుపంపేవాడు.

తన నియోజకవర్గంలో తిరిగి ప్రజలను కలుసుకునేవాడు. వారి కష్టసుఖాలు విచారించేవాడు.

మేధావి వర్గం ఊహించే ప్రజానాయకుడు ఎలా ఉంటాడో, అలా - సత్యనారాయణ తన ఎమ్.ఎల్.ఏ పదవికి సార్థకత కూర్చసాగాడు.

అయితే అతడి ఆశయం ఎక్కువకాలం సాగలేదు.

ప్రతి మనిషికీ స్వతః సిద్ధంగా కొన్ని ఆశలు, ఆశయాలు ఉండొచ్చు. కాని ప్రతి ఒక్కరూ ఆ ఆశలను, ఆశయాలను సంపూర్తిగా తృప్తిపరిచే విధంగా నిర్వహించుకోలేకపోవచ్చు. అందుకు ఎన్నో కారణాలు.

ఈ సృష్టిలోని ఏ వ్యక్తికయినా కొన్ని బలహీనతలు ఉండితీరుతాయి. రక్తసంబంధం, స్నేహం, బంధువర్గంమీద అభిమానం ఇవన్నీ కూడా మరోకోణం నుండి చూస్తే మనిషికున్న అతిగొప్ప బలహీనతలు.

భగవద్గీతలో ఈ భవబంధాలను తెంచుకోమని చెప్పడం కూడా ఆ బలహీనతలను అధిగమించమని బోధించడమే! బట్ ఈ వాతావరణంలో పుట్టి, బహుశా అడ్జస్టమెంటే అయినా తనవారి (?)తో కలసి బతికి, ఇప్పుడు కేవలం ఆశయాలకోసం తనవారిని వదులుకోవడం మనిషి ఇష్టపడడు. వేదాంత పరిభాషలో చెప్పబడిన ఆ 'మాయ'నుండి బయటపడలేడు. ఏదేమయినా మనిషి ఆశయాలను ఈ బలహీనతలే డామినేట్ చేస్తాయి.



కొద్దికాలంపాటు తన సంతృప్తికోసమే బతికిన సత్యనారాయణ, ఆ తర్వాత తనకు ఇష్టంలేకపోయినా 'తనవారి' కోసం బతకవలసి వచ్చింది.



"నాన్నా! మీరు కాస్త ఆ ఎగ్జిక్యూటివ్ ఇంజినీర్‌కి ఫోన్ చేయండి అడ్వాన్స్ బిల్లుకోసం అడుగుతుంటే ఫండ్స్‌లేవని తాత్సారం చేస్తున్నాడు."

సత్యనారాయణ తలెత్తి కొడుకు ముఖంలోకి చూశాడు.

సునీల్ తనను శాసిస్తున్నాడా లేక అర్థిస్తున్నాడా? ఒకవేళ అది అర్థించడమే అయినా ఆ పని తను చేయతగినదేనా?... ఇప్పుడు తను ఆ ఇ.ఇకి ఫోన్ చేస్తే, అది కేవలం ఎమ్.ఎల్.ఏ హోదాలో ఫోన్ చేయడం అవుతుంది. ఇలా కొడుకు కోసం హోదాను ఉపయోగించుకోవడం తన పదవిని దుర్వినియోగపరచినట్టు కాదా?!

ఆ సమయంలో అతడికి లాల్‌బహదూర్‌శాస్త్రి గుర్తుకువచ్చాడు.

రాజకీయాలలో శాస్త్రిగారిలా నైతిక విలువలు పాటించిన 'పదవి ఉన్న నాయకుడు' ఈ దేశంలో మరొకరు కనుపించరు.

తన తప్పు లేకుండానే ఒక రైలు ప్రమాదం జరిగితే ఆ శాఖకు మంత్రిగా ఉన్నందుకు 'నైతిక బాధ్యత'గా తన మంత్రి పదవికి రాజీనామా చేశాడు. రాజీనామా చేసిన మరుక్షణమే ప్రభుత్వం ఇచ్చిన కారు ఉపయోగించడం మాని, స్వంతఖర్చుతో యాక్సిడెంట్ స్పాట్ నుండి ఇల్లు చేరాడు.

అలాగే ఆయన గొప్పతనానికి మరో నిదర్శనం - కొడుకుల కాలేజీ సీట్లకోసం తన 'స్థాయి'ని ఉపయోగించకపోవడం. అప్పట్లో ఆయన ప్రధానమంత్రి. ఆయన కుమారుడు ఒకరు కాలేజీ సీట్‌కోసం అప్లయ్‌చేసి ఉన్నారు. కాలేజీలో సీట్లు దొరకడం చాలా కష్టంగా ఉంది. కొడుకు వచ్చి తండ్రిని అడిగాడు. "డాడీ మీరు ప్రయిమ్‌మినిస్టర్ కదా, మీరొకసారి ఫోన్‌చేస్తే ఆ కాలేజీలో నాకు సులభంగా సీటు వస్తుంది."

ఆయన తల అడ్డంగా ఆడించాడు - "నా అధికారాన్ని ఏమాత్రం దుర్వినియోగపరచను నీకు అర్హతలుంటే ఆ సీటు అదే వస్తుంది. లేకుంటే మరో కాలేజీకి అప్లయ్ చేసుకో..." అదీ ఆయన సమాధానం.

ఆ తర్వాత కొడుకు 'క్యూ'లో వెళ్ళి కాలేజీ ప్రిన్సిపాల్‌ని కలవడం, ఇంటర్వ్యూలో "మీ తండ్రిగారి వృత్తి ఏమిటి?" అన్న కమిటీ మెంబర్ల ప్రశ్నకు "ప్రయిమ్ మినిస్టర్ ఆఫ్ ఇండియా" అని బదులు చెబితే ఆశ్చర్యపోయిన కమిటీ మెంబర్లు, కేవలం అర్హతలనుబట్టే ఆ యువకునికి సీటు ఇవ్వడం... ఇదంతా వేరే విషయం!

అలాంటి గొప్ప వ్యక్తులను తలచుకుంటే మనసు పులకరిస్తుంటుంది. అలా గొప్పగా బతకగలిగితే ఎంత బాగుణ్ణు అనిపిస్తుంది.

ఈ కోరిక అందరికీ ఉండేదే! కాని... మానసిక బలహీనతల మాటేమిటి? సాధారణంగా అందరూ ఏదో ఒక బలహీనత కలిగి ఉంటారు. ఆ బలహీనతలు మనిషిని వ్యక్తిగా ఎదగనివ్వవు. జనమంతా రాముడిని పూజించేవారే, అతడి ఏకపత్నీవ్రతాన్ని మెచ్చుకునేవారే కానీ... ఎంతమంది రాముడిలా ఏకపత్నీవ్రతులుగా ఉండగలరు. ఒక్క... ఒకేఒక్క క్షణకాలం మనసు వశం తప్పితే చాలదూ - మనిషి పతనమయ్యేందుకు.

"అవసరమనుకుంటే - అవకాశం ఉంటే ఆ ఇ.ఇ నీకు అడ్వాన్స్ బిల్లు ఇచ్చేవాడే కదా!... ఏదేమయినా నేను నీకోసం ఇలా చీప్‌గా నా పదవిని ఉపయోగించడం నాకు నచ్చదు సునీల్" అన్నాడు సత్యనారాయణ.

సునీల్ తండ్రివంక అదోలా చూశాడు. ఆ చూపు 'ఈయన మరీ ఇంత అమాయకు





డేంటి?' అన్నట్టుగా ఉంది.

"అదికాదు నాన్నా! మీరు ఫోన్ చేస్తే ఈ పని సులభంగా అయిపోతుంది అని"

"కాని అలాచేస్తే అది అధికార దుర్వినియోగం అవుతుంది"

"ఏమిటి?... సొంతకొడుకు పనికోసం ఫోన్ చేస్తే, అది అధికార దుర్వినియోగమా" ఆశ్చర్యపోతూ ప్రశ్నించాడు కొడుకు.

"సొంతవారికోసం చేసేదే అధికార దుర్వినియోగం" బదులిచ్చాడు తండ్రి.

"మీ ప్రవర్తన నాకేం అర్థంకావట్లేదు నాన్నా" విసుగ్గా అన్నాడు సునీల్.

"కొందరు కొన్నిపనులు ఎందుకు చేస్తారో ఎవ్వరికీ అర్థంకాదు. కాని ఆ పనుల వెనుక ఓ పరమార్థం ఉంటుంది. అర్థంచేసుకోగలిగితే మాత్రం అందులో ఒక గొప్ప నీతి కనిపిస్తుంటుంది"

"ఏమిటి నాన్నా ఆ నీతి! చెప్పండి వింటాను" అన్నాడు విసుగ్గా.

ఆ క్షణం కొడుకుకు తన అభిమాన రాజకీయనాయకుడు లాల్‌బహుదూర్‌శాస్త్రి గురించి చెప్పాలనిపించింది. ఆయన కొడుకు కాలేజీ సీటు విషయంలో ఎంత నిజాయితీ కనపరిచాడో వివరించాడు సునీల్‌కు.

"...ఆ కాలేజీ ప్రిన్సిపాల్ వచ్చిన వ్యక్తి ప్రధానమంత్రి కొడుకని తెలియగానే కంగారుపడి శాస్త్రిగారికి ఫోన్ చేశాడు. 'ఏమండీ! మీ అబ్బాయి కాలేజీ సీటు కోసం ఇంటర్వ్యూకి వచ్చి ఉన్నాడు. సీటు ఇవ్వమంటారా?' అని అడిగాడు. అందుకు శాస్త్రిగారి సమాధానం ఏమిటో తెలుసా?!- 'మావాడికి అన్ని అర్హతలూ ఉంటేనే కాలేజీ సీటు ఇవ్వండి. కేవలం ప్రధానమంత్రి కొడుకనే ఉద్దేశ్యంతో, అదే అర్హతగా భావించి మాత్రం సీటివ్వకండి...' అని. ఇప్పుడు చెప్పు సునీల్! ఆ శాస్త్రిగారిలాంటి ఆదర్శ భావాలు కలిగి ఉండడం, నాకు తగదా?"

సునీల్ రెండుక్షణాలపాటు మౌనంగా ఉన్నాడు. తర్వాత తలెత్తి తండ్రివంక చూస్తూ అడిగాడు "నాన్నా! మీరన్నది నిజమే. శాస్త్రిగారు చాలా నిజాయితీపరులు. ఎలాంటి అధికార దుర్వినియోగం చేయలేదు కాని.. ఆయన అంతటి ఆదర్శంగా బతికినందుకు ఆయన కుటుంబానికి గొప్ప మేలేమయినా జరిగిందా? ఆ కుటుంబ గౌరవమర్యాదల గురించి ఎవరయినా ఇప్పుడు తలచుకుంటున్నారా?..."

"అంటే?" కొడుకు చెప్పదలచుకున్నదేమిటో ఆయనకు అర్థం కాలేదు.

"నాన్నా! ఏ వ్యక్తికయినా తను నీతినిజాయితీగా బతకాలని మనసులో ఉండొచ్చు. అయితే నీతినిజాయితీలు తమకు చేసే మేలు ఏమీలేదని తెలుసుకున్నవారు మాత్రం ఆ పదాలజోలికిపోరు... మీరు ఆదర్శంగా తీసుకున్న లాల్ బహుదూర్ శాస్త్రిగారు నీతిపరులే! కాదనను. కాని ఆయన నీతి ఆయన కుటుంబానికి చేసిన మేలు ఏమిటి? ఆయన గొప్పతనం ఆయనను జనం మనస్సులో తిష్టవేసేలా చేసిందా? మీరు గుండెలమీద చేయివేసుకుని చెప్పండి. ఈరోజు ఈ జనాలు ఎంతమంది ఆ మహానుభావుని గురించి తలచుకుంటున్నారు. కనీసం... కనీసం ఒక్క క్షణమయినా ఆయన మంచితనాన్ని గురించి ఆలోచిస్తున్నారా? ఆలోచించి ఉంటే ఈనాడు లాల్‌బహుదూర్‌గారి పిల్లలు ఆ స్థాయిలో ఉండి ఉండేవారు కాదు. అవినీతి, అక్రమాలతో దేశాన్ని పరిపాలించిన వారి బిడ్డలు, అంతకన్నా అధికార దుర్వినియోగం చేసేవారు తిరిగి గద్దెలెక్కారు. ఆ మంచివారి బిడ్డలు మాత్రం అనామకులుగానే మిగిలిపోయారు... నాన్నా! ఈ లోకంలో నీతినిజాయితీలపట్ల మనుష్యులకున్న గౌరవం చాలా కొద్ది. అది గుర్తుంచుకోండి"

సునీల్ వాదనలో చాలావరకూ నిజం లేకపోలేదు. అంతమాత్రాన అదే పూర్తిస్థాయి నిజం కూడా కాదు. ఏదేమయినా తన మనసును మభ్యపెట్టుకోవటం... ఎందుకో అతడికి ఇష్టంలేకపోయింది. అందుకే మరోవైపు నుండి ఈ సమస్యను పరిష్కరించాలనుకున్నాడు. సమస్యకు మరోకోణం నుండి విశదీకరించబోయాడు.

"అయినా సునీల్! నీకీరోజు కనీసం పాతిక లక్షల రూపాయల ఆస్తి ఉంది. ఇంకా నీకు డబ్బుమీద వ్యామోహం ఎందుకు? ఇంకా..



ఇంకా సంపాదించాలనే కోరిక ఎందుకు? దాని కోసం నాలాంటివారి మనసును కష్టపెట్టడం ఎందుకు?''

సునీల్ తండ్రివంక ఆప్యాయంగా చూశాడు. తర్వాత చిరునవ్వు నవ్వాడు.

''మనిషి మిగతా విషయాలలో దేనిలోనయినా తృప్తిపడతాడేమోగాని, డబ్బు - అధికారం విషయంలో మాత్రం ఎవ్వరూ సంతృప్తి పడలేరు. సంపాదించేకొద్దీ మరింత సంపాదించాలని ఉంటుంది. అలాగే అధికారంలో అత్యున్నతస్థాయికి వెళ్ళినా, అంతకన్నా మరో గొప్ప పదవి ఉందేమోనని వెతుకులాట జరుగుతూ ఉంటుంది''

''అది అంత మంచిది కాదు''

''మంచీ-చెడు అన్నది కాదు నేను చెప్పేది. జస్ట్ మానవనైజం గురించి''

''ఏన్నయినా చెప్పు... నేను అధికార దుర్వినియోగం మాత్రం చేయలేను'' ఆ మాటతో సునీల్ ముఖం ముడుచుకుని వెళ్ళిపోయాడు.

సునీల్ అవసరాన్ని ఇలా తిరస్కరించిన విషయం భార్యకు, కోడలుకు తెలిసింది. ప్రసూన ముభావంగా మసలుకోవడం గమనించాడు సత్యనారాయణ.

కొడుకు కోడలు మనసు కష్టపెట్టుకోవడం చూసి భరించలేని కామేశ్వరి ఇక ఉండబట్టలేక భర్తను అడిగేసింది. ''ఏమండీ... సునీల్ ఏదో చిన్న పని అడిగితే కాదన్నారట''

తన బెడ్‌రూమ్‌లో గాజు అద్దాల కిటికీ దగ్గర నిలబడి సంధ్యాసమయంలోని అందాలు గమనిస్తున్న అతడు తల తిప్పకుండానే బదులిచ్చాడు -

''అవును''

''అలా ఎందుకన్నారు, చిన్న పనే కదా!''

''చిన్నదే, కాని ఆ చిన్న పనే నా మనసును పెద్దగా దెబ్బతీస్తుంది''

''కొడుకుకు చిన్నపని చేసేందుకు మనసుకు సంబంధం ఏమిటి?''

''వాడు సహాయం కోరింది నా వ్యక్తిగతంగా కాదు. నాకు కొత్తగావచ్చిన హోదా తరఫున''.

''తనవారికి, తనను నమ్ముకున్నవారికి సహాయం చేయలేనప్పుడు ఆ హోదా ఉండీ లాభం ఏమిటి?

అతడి నైతిక విలువల మీద మొదటిసారిగా మాటలతో దెబ్బకొట్టగలిగింది కామేశ్వరి.

''చూడండి! మీరు ఆ చిన్నపని చేయలేదని అమ్మాయి, అబ్బాయి మనసులో కష్టం పెట్టుకున్నారు. ఒక కుటుంబంలోని మనుష్యుల మధ్య కలతలు రావడం అంత మంచిది కాదు. ఈ కలతతో కష్టంతో - తన తండ్రి సహాయం చేయగలిగిఉండీ, చేయలేదన్న కోపంతో వారేదైనా అనుకొని నిర్ణయం తీసుకుంటే... ఆ తర్వాత బాధపడవలసినవారం మనమే కదా!''

''అంటే?'' ఆమె అన్నదేమిటో అర్థంకాక అడిగాడు సత్యనారాయణ.

''ఈ కోపంతో వారు ఒకవేళ వేరుకాపురం పెడతానంటే'' చప్పున తలతిప్పి ఆమెవంక చూశాడతడు. ''కేవలం... కేవలం తన మాట కాదన్నందుకే కొడుకు, తండ్రి నుండి విడిపోతాడా?... నో!... నోనో!... అయినా పాతికేళ్ళుగా పెంచిన కొడుకు చిన్నపనిగురించి విడిపోవటం సంభవమా?... ఆ క్షణం ఆ కొడుకుకు తనను పెంచేందుకు తనతండ్రి ఎంతగా శ్రమపడ్డాడో, తనకో భవిష్యత్ నిర్మించి ఇచ్చేందుకు ఎంతగా వ్యధపడ్డాడో ఇవన్నీ గుర్తుకురావా?..''.

''ఎట్టిపరిస్థితులలోనూ గుర్తుకురావు. అలా గుర్తుకు వచ్చేట్టుగా ఉంటే ఈ లోకంలో తల్లి తండ్రుల నుండి విడిపోయే కొడుకులే ఉండరు... సాధారణంగా ఈ కాలంలో ఇరవై- ఇరవై ఐదేళ్ళు రాకమునుపే పిల్లలు తండ్రితో తమ ఆస్తి పంచి ఇచ్చేయమంటున్నారు. ఇప్పుడు ఆస్తికిచ్చిన ప్రాధాన్యత ఆప్యాయతలకు ఇవ్వడంలేదు. బిడ్డలదృష్టి ఎక్కువగా డబ్బుమీదే కేంద్రీకృతమవుతోంది...''

''... మరి తండ్రి మానసిక సంఘర్షణను అర్థంచేసుకోకుండానే కేవలం డబ్బు సంపాదన కోసం తండ్రి సహకరించలేదన్న కసితో తండ్రి నుండి విడిపోయే కొడుకు కోసం- ఆ తండ్రి తన ఆదర్శాన్ని వదులుకోవాలా?..''

ఆవిడ మాట్లాడలేదు. అతనూ ఇంకేం మాటా





డలేకపోయాడు. సెంటిమెంట్‌కి- ఆదర్శానికి మధ్య సంఘర్షణ!

రక్తసంబంధం ఆదర్శాన్ని ఎప్పుడూ డామినేట్ చేస్తూనే ఉంటుంది. ఒక్కసారి ఆ సెంటిమెంట్‌కు లొంగిపోతే చాలు, మనిషి పతనం మొదలవుతుంది. చరిత్రలో సముచిత స్థానం సంపాదించినవారంతా రక్తసంబంధానికి లొంగని అతీతులే.

ఒక భగత్‌సింగ్, ఒక అల్లూరి సీతారామ రాజు, గాంధీజీ, లాల్‌బహదూర్‌శాస్త్రి- వీరెవరూ తమ రక్తసంబంధీకుల గురించి ఆలోచించలేదు. తన కుటుంబంలోని తర్వాతితరంవారు ఎలా బ్రతకగలరు అనీ ఆలోచించిఉండలేదు. కాబట్టే వారు మహానుభావులు- మహనీయులు కాగలిగారు.

సత్యనారాయణలో అంతటి మానసికధైర్యం లేదు. తన ఆదర్శాన్ని నిలుపుకోవడం కోసం దేనినైనా త్యాగం చేయగలిగిన శక్తి అతడిలో లేదు.

అతడు తన కన్నకొడుకు వేరుకాపురం పెడుతాడేమోనన్న భయంతో మొదటిసారిగా తన మాటల్లోనే "అధికారదుర్వినియోగం" చేశాడు.

ఫోన్ తీసుకుని ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుకు రింగ్ చేశాడు. ఆ అధికారిని కదిలించి తన కొడుకుకు అడ్వాన్స్ బిల్లు ఇచ్చేలా చేశాడు.

అలా మొదటిసారిగా తన ఆదర్శాల ఆరాటానికి ఎదురుదెబ్బ తగిలింది. గాంధీకాదు గానీ కనీసం ఓ లాల్‌బహదూర్‌శాస్త్రి కావాలనుకున్న తను ఆఫ్టరాల్ సత్యనారాయణమూర్తి అనబడే ఓ ఎమ్.ఎల్.ఎ.ననీ, అందరు ఎమ్.ఎల్.ఎలవలే అధికార దుర్వినియోగం చేసేవాడినే అనీ తెలుసుకుని క్రుంగిపోయాడు.

అతడి కలలు మెల్లగా కరిగిపోసాగాయి. అసంతృప్తి జ్వాల తిరిగి రాజుకోసాగింది.

★ ★ ★

సత్యనారాయణమూర్తి తొలిసారిగా శాసన సభా సమావేశాలకు హైదరాబాదు బయలుదేరాడు.

అంతకుమునుపు ఎమ్మెల్యేగా గెలిచినరోజున పార్టీనాయకుని ఎన్నికకోసం ఒకసారి హైదరాబాదు వచ్చాడు అతడు.

ఆరోజు అతడికిప్పటికీ బాగా జ్ఞాపకం ఉంది.

తను ప్రజాప్రతినిధి అయినరోజు. ఆ హెూదాలో హైదరాబాదు రావడం చాలా థ్రిల్లింగ్‌గా అనిపించింది.

ఎమ్మెల్యే క్వార్టర్స్ గెలిచిన ఎమ్మెల్యేలతో చాలా కోలాహలంగా ఉంది. పరస్పర పరిచయాలు జరుగుతూ ఉంటే, తన జిల్లాకే చెందిన భావనారాయణ అనే సొంత ఎం.ఎల్.ఎ. తనను పక్కన పెట్టుకుని అందరికీ పరిచయం చేశాడు.

ఆ తర్వాత పార్టీనాయకుని కలుసుకోవడం, ఆయననే చీఫ్ మినిస్టర్‌గా ఏకగ్రీవంగా ఎన్నుకోవటం వగైరా జరిగిపోయాయి.

ముఖ్యమంత్రి ఎన్నిక జరిగాక మరో రెండు రోజులలో మంత్రివర్గం ఎన్నిక జరగబోతోంది.

ఆ రెండురోజులలో సాటి ఎమ్మెల్యేలు మంత్రిపదవులు సంపాదించేందుకు పడినపాట్లు తలచుకుంటే సత్యనారాయణకు ఎప్పటికీ ఆశ్చర్యమే కలుగుతుంది.

పార్టీ నాయకుని ఇంటిచుట్టూ తిరగడం, నమస్కారాలు, భజనలు పాదాభివందనాలు చేయటం, మధ్యవర్తుల ద్వారా లంచాలు ఇవ్వటం, ...ఛట్! రాజకీయాలు ఏ స్థాయికి దిగజారాయి అని బాధపడేవాడు అతడు. అసలు వీరేనా ప్రజాప్రతినిధులు, ఇలాంటి నీచులనేనా జనాలు ఎన్నుకున్నది అని విస్మయపడేవాడు.

క్వార్టర్స్‌లో కూర్చుని రాత్రివేళ బాతాఖానీ కొట్టేప్పుడు, తన జిల్లా ఎమ్మెల్యేలు ఒకరిద్దరు తనతో "సత్యనారాయణమూర్తిగారూ! మీరూ మంత్రిపదవికోసం ట్రై చేయకూడదూ?" అంటే మాట్లాడకుండా నవ్వేసేవాడు అతడు. 'వద్దండీ! మంత్రిపదవి కోసం నానాగడ్డీ కరవటం నాకు చేతకాదు' అని చెప్పాలనిపించేది. కాని అలా చెపితే అహా! మహా సత్యవంతుడండీ. ఆ నానా గడ్డీ కరవకుండానే ఎమ్మెల్యే ఎలా అయాడు ఈయనగారు ఎమ్మెల్యే అయ్యేప్పుడు జనాలను ఓట్లకోసం అడుక్కోలేదు కాబోలు. డబ్బు వెదజల్లి, సారాను

ఏరులా పారించలేదు కాబోలు. అవన్నీ తప్పుడుపనులు కాదా! రాజకీయాలలో తప్పుదారి తొక్కకుండా ఎవరూ పైకిరాలేరు. అసలు రాజకీయమంటే... గడ్డితినడం,తినిపించడం గదా అనుకున్నారు. కొందరైతే పైకి అనేశారు.

వాస్తవంలో సత్యనారాయణకు రాజకీయాలంటే అంతగా గౌరవం లేదు. ఇప్పుడైతే అసహ్యామే వేస్తోంది. 'రంకు , బొంకులతో నిండిన నీచజనాల' మధ్య తనూ ఒకడయినందుకు బాధ కలుగుతుంది. కాని తనేం చేయగలడు. కొడుకు, కోడలు, వియ్యంకుడు, స్నేహితుడు, అందరూ కలసి తననీ మురికి కూపంలోనికి నెట్టారు.

ఇందులో కూడా వారి స్వార్థమే తనకు కనిపిస్తోంది . తమ కుటుంబ సభ్యుడు గొప్ప స్థాయిలో ఉన్నాడంటే వారికెంతో హోదా. ఆ హోదాతో వారు తమకు కావలసిన పనులు కొన్ని చక్కబెట్టుకోగలరు. తద్వారా మరింత డబ్బు సులభంగా సంపాదించుకోగలరు... ప్రస్తుతం సునీల్ చేస్తున్నది అదే కదా! వేశ్యాగృహంలో ఉంటూ కూడా ఒకింత నీతిగా బ్రతకాలనుకున్న తనను, రక్త సంబంధం అన్న సెంటిమెంట్‌తో కొడుకే దెబ్బతీశాడు. తన అందమైన కలను పాడుచేశాడు...

ఎమ్మెల్యే క్వార్టర్స్‌లో కారు దిగిన సత్యనారాయణను చాలామంది ఎమ్మెల్యేలు పలకరించారు. అంతకు మునుపే నగరం చేరిన భావనారాయణ అతడిని గుండెలకు హత్తుకుని లోపలికి తీసుకుపోయాడు.

ఆ మరునటిరోజు నుండి శాసనసభా సమావేశాలు మొదలయ్యాయి.

మొదట ఆ సమావేశాల గురించి ఎంతో గొప్పగా ఊహించాడుగాని, రెండు రోజులు గడిచేసరికి ఆ సమావేశాలను చూస్తుంటే అతడికి నవ్వొరాసాగింది. తనెక్కడో చదివాడు. శాసన సభా సమావేశాలకు ప్రతి గంటకూ కొన్ని లక్షల రూపాయల చొప్పున ఖర్చవుతూ ఉంటుందిట.

ఇంత ఖర్చుచేసినా ఈ రాజకీయ నాయకులు ఆ సమావేశాలలో ఊడబొడిచేది ఏమీ ఉండదు. అక్కడ ప్రజాసమస్యల చర్చకన్నా పార్టీ ప్రయోజనాల దృష్ట్యా వాదించడం ఎక్కువ.

పోనీ అంటే అది కూడా ఒక హద్దులో ఉండదు. ఏ మంత్రయినా పొరపాటున ఒక మంచి కార్యక్రమం, ప్రజోపకరమైనది చేద్దామని ప్రకటిస్తే - ఆ మంచిపనుల ద్వారా ఆ పార్టీ ప్రజల అభిమానానికి దగ్గరవుతుందేమోనని మరో పార్టీవారు ఆ కార్యక్రమానికి అడ్డు చెపుతారు. ఆ కార్యక్రమంలోని అతి చిన్న లోపాలను వెలికితీసి మసిపూసి మారేడుకాయ చేసి జనాలకు భూతద్దంలో చూపిస్తారు. అప్పటికీ అవతల పార్టీవారు ఆ కార్యక్రమాన్ని ఆపడానికి ఇష్టపడకపోతే సభనుండి వాకౌట్ చేయడం. ప్రజల సొత్తు వాళ్ళబ్బ సొత్తులా భావించి మైకులు విరగ్గొట్టడం చేస్తుంటారు.

ఈ రాజకీయాలలో ప్రజాప్రతినిధిగా ఉండి ప్రజాసేవ చేస్తాననడం వట్టి బోగస్. ఆ రాజకీయ నాయకుల బ్రతుకులు బోగస్ బ్రతుకులు, వీరు జనాలకు చేసే సేవంటూ ఏమీ లేదు. అంతా హిపోక్రసీ.

ఆ సమావేశాలు ముగిసేసరికి అతడికి శాసనసభల మీద ఒక ఖచ్చితమైన అభిప్రాయం ఏర్పడిపోయింది.

'శాసనసభలు ఈ దేశంలో అతిగొప్ప బాతాఖానీ క్లబ్బులు!' అని ఎవరోగానీ చాలాకాలం క్రితమే అనేసిన సంగతి గుర్తుకొచ్చింది.

అతడు హైదరాబాదు నుండి తిరుగు ప్రయాణం అయ్యాడు.

శాసనసభల ద్వారా తన నియోజకవర్గ ప్రజలకు ఏదయినా సాధించుకోవడం తన పగటి కల అని తెలిసిపోవడంతో రాజకీయాలమీద అతడికి మొదటిసారిగా విరక్తి కలిగింది.

ఆ విరక్తి తన రాజకీయ భవిష్యత్తును ఏమి చేయబోతుందో అతను ఊహించలేదు.

* * *

డబ్బు రుచి తెలిసిన మనిషి - మనిషి రక్తం మరిగిన పులి ఒకటే! నిరంతరం వాటికోసమే ప్రాకులాట. సునీల్ స్వతహాగా మంచివాడయినా చిన్నతనంలో ఏర్పడిన డబ్బుమీద కసి అతడినిప్పుడు డబ్బుకోసం తాపత్రయపడేలా చేసింది.





కొడుకు డబ్బు సంపాదనకోసం ఇటీవలికా లంలో అడ్డదార్లు తొక్కాడని సత్యనారాయణకు తెలుసు. కాని కొడుకును వారించలేని స్థితికి జారిపోయాడతను. సునీల్ అతడి అధికారాన్ని అవసరార్థం ఉపయోగించుకోవడం మొదలు పెట్టాడు. కాంట్రాక్టులు తక్కువ పర్సంటేజ్ 'లెస్'లతో తనకు వచ్చేలా చేసుకునేవాడు. తండ్రి పేరు చెప్పి రకరకాల ఏజన్సీలు సంపాదించేశాడు. అలాగే వారికీ - వీరికి పనులు చేసిపెడతానని డబ్బు అందుకోవడం మొదలుపెట్టాడు. ఆ పనులను అధికారుల చేత చేయించేందుకు తండ్రిని ఫోన్ చేయమనేవాడు.

తప్పు అన్నది ఒక్కసారి చేసినా పదిమార్లు చేసినా ఒకటే. తొలిసారి తప్పు చేసేందుకే మానసిక సంఘర్షణ. ఆ తర్వాత అంతా ఆటోమేటిగ్గా జరిగిపోతూ ఉంటుంది. అతడిప్పుడు కొడుకు కోసం అధికార దుర్వినియోగం తరచుగా చేస్తూనే ఉన్నాడు.

ఇప్పుడు ఒక్క కొడుకే కాదు. తన బంధుమిత్రులు, అనుచరవర్గం, స్నేహితులు అందరూ ఏదో పనిమీద తన దగ్గరకువచ్చి, రికమండేషన్ చేయమనేవారే. రికమండేషన్ అంటేనే అధికార దుర్వినియోగం. అర్హతలు లేనివారికి ఉద్యోగం ఇప్పించటం, అన్యాయం చేసినవారిని శిక్ష నుండి తప్పించడం, సక్రమ బదిలీలు ఆపుచేయించటం, అధికారుల చేత బలవంతంగా పనులు చేయించడం... ఇవన్నీ జనం కోసం చేసేవి కావు. తన వారికోసం చేసుకునేవి.

'ఇలాంటి తప్పుడు పనులు చేయను' అని ఖచ్చితంగా చెప్పేందుకు వీలులేని స్థితి.

ఒకరోజు రాజేశ్వరి వచ్చింది. తన రెండో కొడుక్కు ఏదో కంపెనీలో ఉద్యోగం కోసం ఇంటర్వ్యూ వచ్చిందని, అతడు ఒక్కసారి ఫోన్ చేస్తే ఆ ఉద్యోగం కొడుక్కే వస్తుందని బ్రతిమలాడింది.

కాదనే ధైర్యం తనకు లేకపోయింది. ఒక వేళ కాదంటే - 'అవునులే! నీ కొడుకు కోసమయితే ఏమయినా చేయగలవు. సొంత చెల్లెలు కూడా ప్రస్తుతం నీకు పరాయిది అయిపోయింది.' అంటూ నిష్ఠూరాలాడుతుందని భయం వేసింది. అవును మరి, ఓసారి తప్పు చేసినవాడు అందరికీ భయపడటం సహజమే!

అలా బంధువుల పనులు చేసి పెట్టడం ఆరంభమయింది.

ఆ తర్వాత అనుచరవర్గం-

'ఏమండీ! మేము మిమ్మల్నే నమ్ముకున్నాం. ఆ రోజు మీ గెలుపుకోసం అహర్నిశలూ శ్రమపడ్డాం. ఈరోజు మాకు చిన్నపని పడింది మీతో. ఆ పని మీరు తప్ప మరెవ్వరూ చేయలేరు... మాకు మీరే శరణ్యం' అనేవారు.

తనను నమ్ముకున్న వారికి సహాయం చేయకపోవడం ఎలా? ఒక వ్యక్తి మరొక వ్యక్తికి సహకారం అందించాడంటే, ఆ మొదటి వ్యక్తికి రెండో వ్యక్తి ఎప్పుడయినా ఏదయినా ప్రత్యుపకారం చేయక తప్పదు. అసలు అలాంటి ప్రత్యుపకారం ఆశించే ఎవరయినా సహకారం అందిస్తారు... మరి అవసరానికి ఏ సహాయం చేయని వాడికి ఎవరయినా ఎలా సహాయం అందించగలరు?!

తనకు ఆ అనుచరవర్గం అలాగే ఉండాలంటే, తను వారి పనులు చేసిపెట్టక తప్పదు.

మరి తన ఇంట్లోనివారికి, బంధువులకు, అనుచరవర్గానికి పనులు చేయడంలోనే తన కాలం గడిచిపోతూ ఉంటే, ఇక ప్రజాసేవ చేసే తీరికెక్కడిది తనకు!

అతడు డబ్బు లేని స్థితిలో చాలా కష్టాలు అనుభవించాడు. అవమానాలను భరించాడు. తన కష్టాలకు అవమానాలకు డబ్బే ముఖ్య కారణమని అతడికి తెలుసు. అయినా అతడెప్పుడూ డబ్బు మీద కసి- వ్యామోహం పెంచుకోలేదు. ఒక విధమైన నిర్లిప్తత అలవాటు చేసుకున్నాడు. బహుశా అదే కర్మసిద్ధాంతం కాబోలు.

అలాగే తనకు రాజకీయాలలోనికి రావాలన్న కోరిక లేదు. పెద్ద పదవులు సంపాదించాలన్న కాంక్ష లేదు. కాని కొన్ని బలీయమైన కారణాలవలన తను రాజకీయాలలోనికి లాగబడ్డాడు. మురికికూపమని తెలిసీ అందులో కాలుపెట్టాడు. అయినా తన మనసు పవిత్రంగానే ఉంది. శరీరాన్ని అంటిన మురికి

మనసును అంటలేదు.

హఠాత్తుగా వచ్చిన డబ్బు తనకు ఆనందా న్ని ఇవ్వలేకపోయినట్టే, అనుకోకుండా వచ్చిన పదవి కూడా తనకు అసంతృప్తినే మిగిల్చింది.

అతడిలో 'అసంతృప్తి' అనే బీజం మొలకె త్తి రోజురోజుకూ మహావృక్షం కాసాగింది. ఆ విషయాన్ని అతడు గుర్తిస్తూనే ఉన్నాడు. కాని మనిషిలోని అసంతృప్తిని దూరంచేయడం ఎలాగో అతడికి తెలయటంలేదు.

అందుకే ఈ మధ్య అతడు అమిత బిజీగా ఉండి కూడా అప్పుడప్పుడూ భగవద్గీత చద వడం మొదలుపెట్టాడు. అది చదువుతుంటే ఏదో తృప్తి. అందులో రాసిన విధంగానే తను తెలిసో, తెలియకో చేస్తున్న తప్పులలో తన ప్రమేయం కొద్ది మాత్రమేనని, ఒకవిధంగా తను నిమిత్తమాత్రుడినని తప్పు చే యించినా, ఒప్పు చేయించినా అంతా ఆ భగవంతునిదేనని నచ్చచెప్పుకోసాగాడు.

తప్పుచేసేవారు మొదటగా చేసుకునేది 'ఆ త్మవంచన'. అతడు కొద్దిగా భక్తుడయితే తను చేసే తప్పులన్నీ దేవుడి మీదికి నెట్టేస్తాడు. శివుడాజ్ఞ లేనిదే చీమయినా కుట్టదు కాబట్టి, తను చేసే తప్పులన్నీ ఆ దేవుడే చేయిస్తున్నా డనుకుంటాడు. తన పాపపరిహారంకోసం దేవు డిని ఎక్కువగా పూజిస్తాడు. కానుకలు సమర్పి స్తాడు.

సాధారణంగా ధనవంతులంతా దేవుడి భక్తులయి ఉంటారు. కారణం మరేంలేదు. ధనవంతులకు ఏదోరూపంలో తప్పుచేయడం తప్పనిసరి. అది టాక్స్ ఎగవేత కావచ్చు లేదా తనకు వ్యాపారంలో అడ్డువచ్చినవాడిని అణగ దొక్కే ప్రయత్నం కావచ్చు. ఏదేమయినా ఒక మనిషి స్థాయి పెరిగేకొద్దీ ఎత్తులు జిత్తులతోపా టు రకరకాల కుట్రలు కుతంత్రాలు నేర్చు కుంటాడు.

అయితే ప్రతి మనిషికీ మనసనేది ఉంటుంది. ఆ మనసు అన్నివేళలా ఏ అడు గుపొరలలో నిక్షిప్తమయినా, మరే బలహీనక్ష ణమో పైకి లేచి మనిషికి పరలోకం గురించి భయపడేలా చేస్తుంది. దాంతో మనిషిలో పాప భీతి మొదలవుతుంది.

ఆ పాపభీతే మనిషి దేవుడిని నమ్మేలా చేస్తుంది. దేవుడిని నమ్మిన వ్యక్తి ఆయనకు మనస్ఫూర్తిగా, నిస్వార్థంగా పూజించడు. కే వలం తనను తన పాపాలు నుండి రక్షించ మనే ప్రార్థిస్తాడు. తన సంపాదనతో కొంతశాతం దేవుడికి లంచం ఇస్తాడు. ఈ లోకంలో పాపుల సంఖ్య ఎక్కువ కాబట్టి చాలా దేవాలయాల లోని హుండీలు ధనరాసులతో నిండిపోతు న్నాయి.

ఎమ్మెల్యే అయినాక సత్యనారాయణ రెండు సార్లు తిరుపతి వెంకటేశ్వరస్వామిని దర్శించు కున్నాడు. ఆయనకు ఖరీదైన కానుకలు సమ ర్పించాడు. అలాగే ఈ మధ్య తరచుగా ఆధ్యా త్మిక ఉపన్యాసాలు వింటున్నాడు. రకరకాల స్వాములను దర్శించుకుంటున్నాడు.

ఈ చర్యలన్నీ మనిషిలోని అసంతృప్తికి ప్రతీకలు మాత్రమే!

వాస్తవంలో సత్యనారాయణ తప్పుచేయా లని అనుకోవడం లేదు. కాని పరిస్థితులు తప్పుచేయకుండా ఉండలేని స్థితి కలిపిస్తు న్నాయి.

రాజకీయాలలో కొత్తరకం అనుభూతుల మధ్య తనలోని అసంతృప్తిని అంతగా పసిగట్ట లేకపోయాడుగాని, రోజులు గడిచేకొద్దీ తనలోని అసంతృప్తి తనకే అర్థంకాసాగింది. మనసులో ఏదో తెలియని వేదన మొదలయింది. ఈ అంతర్గత సంఘర్షణకుతోడు, ఇతరత్రా పను లు వత్తిడులు ఎక్కువయ్యాయి. ఆలోచనలు పెరిగాయి. నిద్ర తక్కువయింది.

వీటన్నింటి మూలానా అతడి ఆరోగ్యం దెబ్బతినసాగింది.

★ ★ ★

ఆరోజు ఉదయమే సోఫాలో కూర్చుని పే పర్ తిరగేస్తున్న సత్యనారాయణకు మొదట గుండెలలో సన్నగా నొప్పిలా అనిపించింది.

క్షణాలలో ఆ నొప్పి పెద్దదయి వెనక్కు విరుచుకుపడిపోయాడు.

మొదటగా కామేశ్వరమ్మ అతడిని చూ సింది. క్షణాలలో జనం మూగారు. ఇంట్లో ఏడుపులు, పెడబొబ్బలతో కంగారు మొదల యింది.





సునీల్ హాస్పిటల్‌కు ఫోన్‌చేశాడు. పది నిముషాలలో అంబులెన్స్ వచ్చి ఆ ఇంటి ముందు ఆగింది. ఇద్దరు డాక్టర్లు, ఇద్దరు నర్సులు పరిగెత్తుకుంటూ ఇంటి లోపలికి వచ్చారు. పేషెంట్‌ను హాస్పిటల్‌కు తరలించారు.

టౌన్‌లోకెల్లా అత్యంతాధునికమైన ఎక్విప్‌మెంట్ ఉండే హాస్పిటల్‌లో సత్యనారాయణ అడ్మిట్ అయ్యాడు. ప్రముఖులైన నలుగురు డాక్టర్లు ఆయనను పరీక్ష చేసారు.

అది హార్ట్‌ఎటాక్!

ఫస్ట్‌టైమ్ కాబట్టి ఏమీకాదని తేల్చిచెప్పి, వారంరోజులపాటు హాస్పిటల్‌లోనే బెడ్‌రెస్ట్ తీసుకోమన్నారు.

జీవితంలో అంతవరకూ ఏనాడూ హాస్పిటల్ ముఖం చూసి ఎరుగడు సత్యనారాయణ! డబ్బు కొత్త-కొత్త, ఖరీదైన జబ్బులను కొని తెస్తుందని అర్థమయింది అతడికి.

పేదవాడికి ఎవరికైనా హార్ట్‌ఎటాక్ రావడం అరుదు. హార్ట్‌ఎటాక్‌లు, అర్థంకాని జబ్బులు వచ్చేది కేవలం ఖరీదైన మనుష్యులకు మాత్రమే!

అప్పుడే అతడికి మరో అనుమానం కూడా కలిగింది. 'ఒకవేళ నేను పేదవాడిగా ఉన్నప్పుడే నాకో ఖరీదైన జబ్బు వచ్చి ఉండే ఏమయి ఉండేది?'

ఈనాడు కొన్ని భయంకరమైన జబ్బులతో బాధపడే పేదవారు ఎంతోమంది మన కళ్ళ ముందు ఉన్నారు. సరయిన వైద్యసౌకర్యం ఉంటే వారు ఆ జబ్బుల నుండి బయటపడగలరు. కాని వారికి దక్కేది?

అంటే ఒక్కొక్కసారి డబ్బు ప్రాధాన్యత ఎంతో గొప్పగా కనిపిస్తుంటుంది. నిజమే కొన్ని అవసరాలకు డబ్బు చాలా అవసరం అనుకున్నాడు తను. అయితే, డబ్బు మనుష్యుల మమతలు డామినేట్ చేయడం మాత్రం ఏనాడూ ఒప్పుకోతగింది మాత్రం కాదు...

సత్యనారాయణ హాస్పిటల్‌లో జాయిన్ అయిన విషయం దినపత్రికలలో చదివినవారు అతడిని పరామర్శించేందుకు హాస్పిటల్‌కు వచ్చారు. వారంతా ఆప్యాయత కనపరుస్తూ మాట్లాడారు.

''సత్యనారాయణమూర్తిగారూ! మీరు హాస్పిటల్‌లో జాయిన్ అయ్యారని తెలియగానే మాకు చాలా బాధ కలిగింది. మీ గురించి చాలా కంగారుపడ్డాం. ఇక ఆగలేక అలాగే పరుగెత్తుకొచ్చాం''

ఇంచుమించుగా తనను కలిసిన ప్రతి ఒక్కరూ అలాగే మాట్లాడారు. అలా మాట్లాడిన వారిలో బంధువులు, మిత్రులు, పరిచయస్థులున్నారు.

ఎందుకో సత్యనారాయణకు వారి మాటలు అంత సంతృప్తికరంగా అనిపించలేదు. ఆ మాటలలో ఏదో హిపోక్రసీ కనుపించింది.

''తన వయసు సుమారుగా యాభై ఏళ్ళు గత కొద్దికాలం మినహా జీవితంలో చాలాకాలం తను బాధలు, వేదనల మధ్య బ్రతికాడు.

అయితే ఈ హార్ట్ ఎటాక్ అన్నది తన శరీరానికి సంబంధించిన చిన్న దెబ్బ. ఈ పరిస్థితి పట్ల తను మానసికంగా ఏమాత్రం బాధపడటంలేదు... ఈ జనమంతా తన శరీరానికి కలిగిన చిన్న బాధకే ఎంతోబాధ నటిస్తున్నారు. అదే జనం ఓ నాలుగేళ్ళ క్రింత వరకూ ఎంతో మానసిక వ్యథ అనుభవించిన తన పట్ల ఏమాత్రం జాలి కురిపించలేదు. సహాయం చేయతగినవారు తప్పుకు తిరిగారు చేయగలిగినవారు లేదు పొమ్మన్నారు. కాని ఆనాడు తనను చిన్నచూపు చూసిన వారంతా నేడు తన చుట్టూ ఉన్నారు. కొత్త కొత్త వ్యక్తులు తన దగ్గరకు చేరారు... అసలు వీరంతా ఎవరు? తన దగ్గరకు ఎందుకు చేరారు?...''

అందుకు జవాబుగా అతడికి తోచిన జవాబు స్వప్రయోజనం! అవును. కేవలం స్వార్థంతో స్వప్రయోజనాలకు ఉపయోగపెట్టుకునేందుకే వీరు తన చుట్టూ చేరారు.

మనుష్యులు వ్యక్తిని 'వ్యక్తి'గా కాక అతడి స్థితినే గౌరవిస్తారు కాబోలు!

వీటన్నింటినీ చూస్తుంటే అతడికి తన ఉన్నత స్థితి మీద గర్వంగా అనిపించలేదు సరికదా అంతర్ సంఘర్షణ మొదలయింది.



ఇప్పుడు వ్యక్తిగా తనకు ఎలాంటి గౌరవం లేదన్నది తెలిసిపోయింది! మొన్న అదృష్టవశాత్తు తను అందలం ఎక్కాడు. రేపు దురదృష్టవశాత్తు ఆ అందలం మీద నుంచి కిందపడిపోతే ఇప్పుడు తన చుట్టూ ఉన్న జనమంతా పారిపోతారన్నది నగ్నసత్యం!

అతడిలోని అంతర్ సంఘర్షణ మరింత పెరిగింది.

ఎవరు నేను? ఎందుకు పుట్టాను? నా పుట్టుకకు పరమార్థం ఏమిటి? జీవితంలో నేను సాధించిందేమిటి? సాధించదలచుకున్నది ఏమిటి? ... నాకు ఎంతో సుఖకరమైన పరిస్థితులున్నాయి ఇప్పుడు. అయితే ఆ సుఖానికి తగినట్టుగా మనసు సంతృప్తితో నిండిలేదు. ఎందుకని?... ఈ దేశంలో నేను సాధించినది పరలోకంలో నాకెంత వరకూ ఉపయోగపడగలదు? నీతి-నిజాయితీలు తప్పిన నేను స్వర్గానికి వెళ్తానా లేక నరకానికి వెళ్తానా?...

వృద్ధాప్యం స్వర్గనరకాల గురించి కూడా ఆలోచించేట్టు చేస్తుంది. ఈలోకం నుండి వెళ్ళవలసిన కాలం దగ్గరపడిందని తెలిసినప్పుడు మరోలోకం ఉందని నమ్మినప్పుడు, వెళ్ళబోయే ఆ లోకం గురించి ఆలోచించడం సహజం!

దాంతో అతడిలో తపన మొదలయ్యింది. తన ఉనికికి అర్థం తెలుసుకోవాలన్న కోరిక ప్రబలంగా కలగసాగింది అతడు విపరీతంగా ఆలోచించడం మొదలుపెట్టాడు. పరధ్యాన కూడా ఎక్కువయింది. ఒక్కొక్కసారి ఉన్నట్టుండి ఆలోచనలలో మునిగిపోయేవాడు. ఆ సమయంలో ఎవరు, ఎంతలా పలకరించినా పలికేవాడు కాదు.

ఇక్కడ ఒక అనుమానం రావచ్చు-ఒకానొక స్టేజ్‌లో మనిషికి ఇలాంటి ఆలోచనలు కలుగుతాయా అంటే, ప్రతి మనిషికీ ఇలాంటి ఆలోచనలు కలుగుతాయని ఎట్టి పరిస్థితిలోనూ చెప్పలేం. మనిషి ఆలోచనలు అతడి మానసిక స్థాయి మీద ఆధారపడి ఉంటాయి. ఏ కొందరో మాత్రమే ఒకానొక స్టేజ్‌లో "ఆత్మపరిశీలన" చేసుకోవడం మొదలెడతారు. తమ పుట్టుకకు అర్థం తెలుసుకోవాలని ఆరాటపడతారు. అలాంటివారు నూటికో కోటికో ఒక్కరుంటారు.

ఇందుకు ఒక ఉదాహరణ-మనకు ఎందరో రాజుల చరిత్ర తెలుసు. వారంతా స్వలాభాపేక్షతో యుద్ధాలు చేసి చచ్చినవారే. వారిలో ఎవ్వరు కూడా మానసిక సంఘర్షణ పడినట్టుగాగాని, ఒకవేళ ఆ స్థితి అనుభవించినా అందులో పరిపూర్ణ స్థాయిని అందుకున్నట్టుగా గాని మనకు తెలియదు. అయితే ఆ రాజులందరిలోకీ ప్రత్యేకత కలిగిన ఒక రాజు ఉన్నాడు. అతడే సిద్ధార్థుడు. అతడు మహారాజు. ఎన్నో సుఖాలు, సౌఖ్యాలు అనుభవించినవాడు. అయితే చాలా చిన్న వయసులోనే ఒకానొక పరిస్థితిలో అతడిలో తపన బయలుదేరింది. ఆత్మపరిశీలన మొదలయింది. ఆయన తన పుట్టుక ఎందుకు? తన ఉనికికి అర్థం ఏమిటి? అని ప్రశ్నించుకున్నాడు. కష్టాలు చూడడం వలననే ఆయనలో అసంతృప్తి రేకెత్తింది. ఫలితంగా నిజమైన సుఖం వెతుక్కుంటూ సర్వసంగపరిత్యాగియై అన్వేషణ సాగించాడు. చివరికి బోధిచెట్టు కింద ఆయనకు జ్ఞానోదయం అయ్యింది. అతడు బుద్ధుడయ్యాడు.

మనిషిలో అలాంటి సంఘర్షణ ప్రారంభమంటూ కాకుండానే ఉండాలి. అయితే మాత్రం అందుకు ఒక అంతు అంటూ ఉండదు. నిరంతరం అది మనసులో జ్వలిస్తూనే ఉంటుంది.

మరి సత్యనారాయణ మనసులో జనించిన ఆ సంఘర్షణకు అంతం అన్నది ఎప్పుడో?!



వారం రోజుల బెడ్‌రెస్ట్ తర్వాత సత్యనారాయణను డిశ్చార్జి చేశారు. అతన్ని కారులో ఇంటికి తీసుకువచ్చారు. ఆరోగ్యం కుదుటపడే వరకూ అవసరమని ఇంట్లో ఒక నర్సును





తోడుగా ఉంచాడు సునీల్. నర్స్‌తోపాటు కామేశ్వరి, ప్రసూనలు కూడా అతడిని కంటికి రెప్పలా చూసుకోసాగారు. పరాత్పరరావు ఎక్కువ సమయం మిత్రుడి పక్కనే ఉంటున్నాడు. తనతోపాటే తనవారందరూ ఉన్నా తన మనసుకు దగ్గరయినవారు ఎవరూ లేరన్న ఫీలింగ్ ఒకటి మనసును తొలచడం మొదలుపెట్టింది. వారు తననెంతో అభిమానంతో చూసుకుంటున్నా ఆ అభిమానంలో ఏదో కృత్రిమత్వం కనపడసాగింది. ఇలా ఎందుకు జరుగుతోంది. తన ఆలోచనలు సక్రమ మార్గంలో పయనిస్తున్నాయా లేక వక్ర మార్గం పట్టాయా?-తనలో తానే ప్రశ్నించుకునేవాడు అతడు. వెంటనే జవాబు కూడా దొరికేది. ఆధ్యాత్మికపరంగా అయితే తన భావాలు సరయినవే! నేటి వ్యవస్థాపరంగా మాత్రం ఇలాంటి ఆలోచనలు సరయినవికావు.

మరి ఇప్పుడు తనకు కావలసింది ఏది?-రక్తసంబంధం, బంధుమిత్రులతో కూడిన వ్యవస్థా లేక భక్తి, మోక్ష మార్గాలతో కూడిన వేదాంతమా? ఏది?

ఆ ఆలోచనల మధ్య అతడికి అప్పుడప్పుడూ వసుంధర గుర్తుకు వచ్చేది. వింత వింత ఆలోచనలు కలిగేవి. ఆమె ఒకప్పుడు తన దగ్గర డబ్బు లేదని దూరం అయింది. కాని ఇప్పుడు తన దగ్గర ఎంతో డబ్బు ఉంది. ఆమె డబ్బు కోరికలు తీర్చగలిగిన సామర్థ్యం ఉంది. మరిప్పుడు ఆమె తనను తిరిగి చేరవచ్చు కదా!... తనకు అన్నీ సమకూర్చగలుగుతున్న డబ్బు తను కోల్పోయిన ప్రేమను మాత్రం ఎందుకు తిరిగి సంపాయించి ఇవ్వలేకపోతుంది... ఓ హో! తమకు వయసు పైబడింది కాబట్టి ఆవేశపూరితాలయిన ప్రేమలు వద్దనా?! మరి తనకు డబ్బు ఉంది కదా! ఆ డబ్బు తనకు తిరిగి ఆ యవ్వనాన్ని సంపాదించి ఇవ్వలేదా?... ఇవ్వలేదు!... అంటే ఈ లోకంలో డబ్బు చేయలేని పనులు కూడా కొన్ని ఉన్నాయన్నమాట. సో! భగవంతుడు సృష్టించిన ప్రకృతిముందు, మానవుని సృష్టి అయిన డబ్బు వెలవెలబోయింది...

సత్యనారాయణ తనలో కలిగే ఆలోచనలకు తనను తానే నిందించుకునేవాడు. తన ఆలోచనలు డబ్బు చుట్టే ఎందుకు పరిభ్రమిస్తున్నాయో అర్థమయ్యేదికాదు.

ఆ క్షణాన అతడికి బాల్యం గుర్తుకు వచ్చేది. ఏ ఆలోచనలూ లేని బాల్యం అది. చీకూ చింత తెలియక, మనిషిని పీడించే ఆలోచనలు ఎరుగక ఆనందంగా గడపగలిగిన ఆ బాల్యం ఎంత గొప్పది! ఒక్కసారి , మరొక్కసారి ఆ బాల్యంలోనికి తిరిగి వెళ్ళగలిగితే బాగుండుననిపించేది.

బాల్యం గుర్తుకు వస్తే తనను కనిపెంచిన తల్లితండ్రులు కనులముందు కదలాడేవారు. అమ్మ తననెంతో ఆప్యాయంగా, ప్రేమతో పెంచింది. తను కూడా తల్లి ఋణం సక్రమంగానే తీర్చుకున్నాడు. వృద్ధాప్యంతో ఆమెను పువ్వులలో పెట్టి పూజించినట్టుగా ఆమె జీవితాన్ని సుఖంగా గడిచేలా చేశాడు. తల్లితండ్రుల తరుపున చెల్లెలి పెళ్ళి బాధ్యత కూడా తనే తీసుకుని రాజేశ్వరి పెళ్ళి తనే జరిపించాడు.

రాజేశ్వరి తలపుకు రాగానే మరికొన్ని ఆలోచనలు జనించేవి. రాజేశ్వరి, తను సమాన వయస్కులు కావడంతో చిన్న వయసులో కలసి ఆడుకునేవారు. తామిద్దరూ ఒకరిమీద మరొకరు ఎంతో ప్రేమ కలిగి ఉండేవారు. తన పెళ్ళి జరిగే వరకూ రాజేశ్వరి 'అన్నయ్యా, అన్నయ్యా' అంటూ ఎప్పుడూ వెంటనే ఉండేది. పెళ్ళయ్యాకే ఆమెలో మార్పు వచ్చింది. 'తన కుటుంబం, తన బిడ్డలు' అనే స్వార్థం ప్రవేశించింది. ఆ కారణానే నీరజను చేసుకోమని తాము వెళ్ళినప్పుడు ఆమె అడ్డుకోగలిగింది.

అతడికెప్పుడూ విస్మయం కలిగించేదేమిటంటే , ఈ మనుష్యులకు 'డబ్బు' అనే పదార్థం కోసం, ఆప్యాయతలు - అభిమానాలు బలిపెట్టడం ఎలా సాధ్యం అన్నది! ఇరవై ఏళ్ళపాటు అభిమానం పంచుకుని గడిపిన అన్నా చెల్లెలి అనురాగం, తర్వాత కేవలం 'డబ్బు' అనే పదార్థం దగ్గర బెడిసిపోతుంది. వాటే వండర్ ఇటీజ్. దీనినే 'డబ్బు మహత్యం' అనవచ్చునేమో!

ఒకరోజు అనుకోకుండా 'వసుంధర' ఆ

ఇంటికి వచ్చింది. ఆ సమయంలో సత్యనారాయణ, పరాత్పరరావుతో కలసి ఇంటి ముందున్న లాన్‌లో కూర్చుని ఏవో రాజకీయాలు మాట్లాడుతున్నాడు. అప్పటివరకూ ఆ నియోజకవర్గ ప్రజలు కొందరు అతడి దగ్గరకు వచ్చి, తమ సమస్యలేవో చర్చించి అప్పుడే బయటకు వెళ్ళారు.

సత్యనారాయణకు తన నియెజకవర్గ ప్రజల సమస్యలు వినడం మాత్రమే చేయగలుగుతున్నాడు తప్ప ఆ సమస్యల పరిష్కారం కోసం పోరాడడం మాత్రం చేయలేకపోతున్నాడు. అందుకు కారణం మరేమీ కాదు, జస్ట్ తనవారి పనులు చూడడంతోనే అతడి టైము సరిపోతుంది.

వచ్చిన నియోజకవర్గ ప్రజలు గేటు దాటుతున్నప్పుడే ఇంటిముందు టాక్సీ ఆగింది.

అతడు, పరాత్పరరావు తలతిప్పి ఆవంక చూశారు. ఒక చేత్తో కళ్ళద్దాలు తొలగిస్తూ, మరోచేత్తో బేక్‌డోర్ తీసి కిందికి దిగింది వసుంధర. ఆ వంక చూస్తున్న ఇద్దరి కళ్ళు విస్ఫారితాలయ్యాయి.

వెంకటగిరి జరీ చేనేత చీర కట్టి ఉందామె. ఎర్రరంగు ఆ చీరకు మ్యాచింగ్ బ్లౌజ్ వేసి ఉంది. సాయంత్రం వేళ వీచే చల్లగాలికి ఆమె కురులు మెల్లగా కదలాడుతున్నాయి. సంధ్యా సమయంలో ప్రత్యక్షమయిన ఉషాకాంతలా ఉందామె.

ఆమె నుందాగా గేటు తీసుకుని నడుచుకుంటూ వారి దగ్గరగా వచ్చింది.

వసుంధరను చూడడంతోనే అతడి కళ్ళు మిలమిల మెరిసాయి. ఆనందం చెలియలికట్ట దాటింది.

"రండి... రండి... కూర్చోండి" ఎదురు కుర్చీ చూపించాడు అతడు. స్నేహితుని ముందు అతి చనువు ప్రదర్శించడం ఇష్టంలేక బహువచనంలోనే మాట్లాడాడు.

"ఫర్వాలేదు. ముందు మీరు కూర్చోండి... మీకసలే అనారోగ్యం" ఆమె కూడా బహువచన ప్రయోగమే చేసింది.

ఇద్దరూ కుర్చీలో కూర్చున్నారు.

నీరజ పెళ్ళి తర్వాత ఆమెను కలుసుకోవడం తిరిగి ఇప్పుడే. కారణాంతరాల వలన సునీల్ పెళ్ళికి కూడా ఆమెకు ఆహ్వానం పంపలేదు. బహుశా కులాంతర వివాహం కదా అన్న ఇన్‌ఫీరియారిటీ కారణం కావచ్చు. అలాగే ఎలక్షన్స్‌లో గెలిచి ఎమ్మెల్యే అయినపుడు, తన విజయం ఆమెకు తెలియపరచాలని, ఆమె అభినందనా పూర్వకంగా చూస్తే ఆనందించాలని అనిపించినా, ఎందుకనో ఆ పని చేయిలేకపోయాడు. కనీసం పేపర్ ద్వారా నయినా తన విజయం తెలిసి ఉంటుందన్న నమ్మకం అతడికి సంతృప్తినిచ్చింది.

ఇప్పుడు తనకు అనారోగ్యం!

తను హార్ట్ ఎటాక్‌తో హాస్పిటల్‌లో చేరిన విషయం పేపర్‌లలో చదివి, పరామర్శించేందుకు ఇంతదూరం వచ్చినట్లుందామె. ఆ విషయంపట్ల అతడికి చాలా సంతోషం వేసింది.

"ఎప్పుడొచ్చారు?"

"ఈ ఉదయమే" జవాబిచ్చిందామె.

"ఏదయినా పనిమీద ఈ ఊరు వచ్చారా?"

"లేదు. మీరు హాస్పిటల్‌లో జాయిన్ అయ్యారని తెలిసి కంగారుపడ్డాను. కోలుకున్నట్టు పేపర్‌లో వచ్చిన వార్తతో కాస్త సంతోషించాను. మిమ్మల్ని ఒకసారి చూసి వెళ్తే బాగుండుననిపించింది. అందుకే పనిగట్టుకుని వచ్చాను. ఉదయం అమ్మగారింట్లో దిగి, ఇప్పుడు తీరిక చేసుకుని ఇలా వస్తున్నాను." నవ్వుతూ అందామె. ఆమె నవ్వు చూస్తే సంధ్యావేళ మంచు కురిసినట్టుగా అనిపించింది అతడికి.

"మీవారు, పిల్లలు బాగున్నారా?"

బాగున్నట్టు తలూపింది వసుంధర.

"మరి మీ ఆవిడను పరిచయం చేయరా?" అడిగింది ఆమె.

అతడు అదోలా నవ్వి "ప్రస్తుతం ఆవిడ కూతురును చూసి వచ్చేందుకు గూడూరు వెళ్ళింది... పోతే కోడలు ఇంట్లో ఉంది. ఆమెను పరిచయం చేస్తాను." అంటూ ప్రసూనను పిలిపించాడు పనిమనిషి ద్వారా.

ప్రసూన వారి మధ్యకు వచ్చింది. అతడు వారిద్దరికీ పరిచయం చేశాడు. వసుంధరను

పరిచయం చేస్తూ "ఈమె నా క్లాస్‌మేట్" అని చెప్పాడు ప్రసూనకు.

వసుంధర ప్రసూనతో కొద్ది నిముషాలసేపు మాట్లాడింది. కాసేపు తర్వాత ప్రసూన ఏదో పని ఉందంటూ ఇంటి లోపలికి వెళ్ళింది.

ఆమె 'చక్కని కోడల్ని సంపాదించుకున్నారు' అంటూ అతడితో వేళాకోళమాడింది. కులాంతర వివాహం జరిపించిన అతడి ధైర్యాన్ని మెచ్చుకుంది. సునీల్‌ని కలుసుకుంటే బాగుండునని ఆమె అభిలాష వ్యక్తం చేస్తే, "మరొకసారి వచ్చినప్పుడు కలిసే ఏర్పాటు చేస్తానన్నాడు" అతడు

ఆ లాన్‌లో వారు ముగ్గురే ఉన్నారు. ముగ్గురూ చిన్ననాటి స్నేహితులు. వయసునంతా అనుభవించేసి వృద్ధాప్యంకు చేరువగా వెళ్ళి ఉన్నవారు. కాని కొన్ని భావాలు వయసుకు అతీతం. వారు వృద్ధాప్యంకు దగ్గరగా వెళ్ళి ఉండొచ్చుగానీ, స్మృతులు మాత్రం ఏనాటికీ వార్ధక్యం కొని తెచ్చుకోవు. జ్ఞాపకాలకు మునలితనం లేదు.

వారు తమ బాల్యస్మృతులను గుర్తుకు తెచ్చుకోసాగారు. ఆనాటి ఆనందకరమైన రోజులు తలచుకుంటుంటే వారు తిరిగి ఆ రోజులలో జీవిస్తున్నట్టుగానే అనిపించసాగింది. ఆ జ్ఞాపకాల చర్చల మధ్య కాలమెంతయిందో ఎవరూ గుర్తించలేదు.

ప్రసూన లోపలి నుండి ఫలహారాలు తీసుకొచ్చి వారి ముందుంచింది. ఆమె రాకతో వారు ఆ తీపిజ్ఞాపకాల నుండి బయటపడ్డారు.

వసుంధర ప్రసూనను **కూడా** తమతోపాటే ఫలహారం తీసుకోమంటే, మామయ్యగారి ముందు కూర్చునేందుకు భయపడి "వద్దులేండి" అంది ఆమె.

అతడు "ఫర్వాలేదు లేమ్మా! ఆమె చెపుతోంది కదా నువ్వూ ఒక ప్లేట్ తెచ్చుకో" అంటే, ఇక తప్పనిసరయి తనూ ఒక ప్లేట్ తెచ్చుకుంది ప్రసూన.

వసుంధర ప్రసూనతో మాటలు కలిపి "అవునూ! ఇంతకీ ఏమయినా ప్రోగ్రెస్ ఉందా" అంది ఆమె పొట్టవంక చూస్తూ.

ఆ మాటలోని అర్థం తెలుసుకున్న ప్రసూన సిగ్గుపడి "అలాంటిదేమీ లేదండీ" అంది తలదించేసుకుంటూ.

ఆమె సిగ్గుకు వసుంధర నవ్వుకుంది "సిగ్గుపడకమ్మాయ్!... ఆ సిగ్గులన్నీ వదిలేసి ముందు నాకో మనుమడిని ఇచ్చే ప్రయత్నం చూడు" అంది.

ఆ మాటకు ప్రసూన సిగ్గుతో మరింత కుదించుకుపోతే, మిత్రులిద్దరూ గుంభనంగా నవ్వుకున్నారు.

మాటల మధ్యనే చాలా పొద్దుపోయింది.

ఆమె పైకి లేచి "చాలా పొద్దుపోయింది. వీలయితే రేపు మరోసారి వచ్చి చూసి తర్వాత మద్రాను వెళ్ళిపోతాను" చెప్పింది.

అతడు అన్నాడు "మరికాసేపు ఉండకూడదూ?"

"రేపు మళ్ళీ వస్తానుగా" అదోలా నవ్వింది వసుంధర. ఆమె నవ్వితే తన అనారోగ్యం పూర్తిగా తగ్గిపోయినట్టు అనిపించిందతడికి.

సత్యనారాయణ కారుడ్రైవర్‌ను పిలిచి కారు తీసుకురమ్మన్నాడు. కారు వచ్చి వారి ముందు ఆగింది.

అతడు కారు బేక్‌డోర్ తెరచి పట్టుకుని, ఆమెను కారు ఎక్కమని సైగచేశాడు.

"ఎందుకండీ! టాక్సీలో వెళ్ళిపోతాగా" మొహమాటపడింది వసుంధర.

"ఫర్వాలేదు. రండి" అన్నాడు అతడు.

ఇక బదులు చెప్పకుండా ఆమె కారెక్కి కూర్చుంది. అతడు డోర్ వేసి, వంగి విండోలో నుండి ఆమెతో అన్నాడు "రేపు తప్పక రండి".

"అలాగే" అంది వసుంధర.

కారు ముందుకు కదిలింది.

ఆమె ఎక్కిన కారు గేటు దాటే క్షణంలోనే, పురుషోత్తమరావు గేటు ముందు కారాపి లోపలికి వస్తున్నాడు. మిత్రులిద్దరూ కలసి ఒక స్త్రీని కారెక్కించడం చూశాడు. అతడు కారులోని ఆమెవంక అదోలా చూస్తూ వారి దగ్గరకు వచ్చాడు.

"ఎవరామె?"... ఎమ్.ఎల్.ఏ గారు లేచి వెళ్ళి కారు ఎక్కిస్తున్నారంటే ఏ చీఫ్ మినిస్టర్ గారి సతీమణో అయి ఉంటుంది. యామై





రైట్?''

''అలా ఏం కాదు. ఆమె నా క్లాస్‌మేట్''

''క్లాస్‌మేటా?'' అని ఆశ్చర్యపోయి ''అబ్బో! అప్పటి క్లాస్‌మేట్‌కి ఇప్పటివరకూ గుర్తుండిపో యారంటే... ఊఁ! బావగారు ఒకప్పుడు మంచి గ్రంథసాంగులేనన్న మాట'' పకపకా నవ్వాడు పురుషోత్తమరావు.

అతడికి నవ్వాలనిపించలేదు. పైగా చిరా కుగా కూడా అనిపించింది.

''అవునూ! ఇంతకీ ఆమె ఎందుకొ చ్చిందీ? పిల్లల ఉద్యోగాల కోసం రికమండే షన్ చేయమని వచ్చిందా?''

సత్యనారాయణకు అసహ్యంగా అని పించాయి ఆ మాటలు. ''లోకంలోని జన మంతా డబ్బు, అధికారాల చుట్టే తిరుగు తుంటారనుకోవడం పొరపాటు. మనసులోని అభిమానాలు, ఆప్యాయతలు కూడా మనిషిని ఇలా తీసుకువస్తుంటాయ్'' సీరియస్‌గా జవా బిచ్చాడు అతడు.

దాంతో గతుక్కుమన్నాడు పురుషోత్తమ రావు. కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయి తర్వాత టాపిక్ మార్చి మాట్లాడటం మొదలు పెట్టాడు.

ముగ్గురూ వెళ్ళి లాన్‌లో కూర్చున్నారు.

''బావగారూ! రాష్ట్ర మంత్రివర్గం పెంచే యోచన ఉందని ముఖ్యమంత్రిగారి ప్రకటన. తెలును కదా!''

''తెలును. అయితే?''

''ఏం లేదు. ఈసారి మంత్రివర్గంలోనయినా మీరొకస్థానం సంపాదించగలిగితే బాగుండు నని నా అభిప్రాయం. కేవలం వట్టి ఎమ్మెల్యేగా ఉండిపోతే పెద్దగా ప్రయోజనం ఏమీ ఉండ దు. కనీసం సహాయమంత్రి పదవి ఉన్నా అదొక గొప్పతనం.''

''వద్దులెండి మరీ అంత గొప్ప ఆశలు మనకొద్దు.''

''ఇందులో ఆశలేమున్నాయి. ఎమ్మెల్యే అయినవాడు మంత్రి కావాలని కోరుకోవడంలో తప్పేముంది.''

''తప్పు ఉందని కాదు. కాని అలాంటి ప్రయత్నాలు నాకిష్టం లేదు.''

పురుషోత్తమరావు దీర్ఘంగా నిట్టూర్చారు.

''లాభం లేదండీ బావగారు మీరు! అసలు రాజకీయాలలో ఎలా ఉండాలో తెలుసా మీకు! రాకెట్‌లా ముందుకు దూసుకుపోగ లిగి ఉండాలి. అవసరపడితే పక్కవాడిని తొక్కే యాలి. మనకు ఉపయోగపడే వ్యక్తిని క్షణాలలో ఆకట్టుకోగలిగి ఉండాలి... ఎంత తప్పుచేసినా పర్వాలేదు. మనం మరో మెట్టుపైకి ఎక్కడం మాత్రమే కావలసింది.''

...నరే! ఈ పనులు మీరు ఎలాగూ చేయలే రు. పోనీ మీ తరపున ఆ ప్రయత్నాలేవో మేము చేస్తాం. మీరు ఊఁ అనండి చాలు...''

సత్యనారాయణ తల అడ్డంగా ఆడించాడు. ''వద్దండి... ఇప్పటికే ఎలక్షన్స్‌లో గెలిచేందుకు ఎన్నో తప్పులు చేశామని నా మనసులో అదో రకమైన గిల్టీ ఫీలింగ్ ఉంది. ఎన్నికలప్పుడు జనాలకు సారా పోయించాం, డబ్బుతో ఓట్లు కొన్నాం. అంతేకాదు- వారిని మభ్యపెట్టేందుకు ఎన్నో వాగ్దానాలు చేశాం... మరి ఎమ్మెల్యే అయ్యాక ఆ వాగ్దానాలను ఎంతవరకూ నిలబె ట్టుకోగలిగాను. కనీసం... కనీసం ఒక్క వాగ్దాన మయినా తీర్చగలిగానా? జనాలకు ఏమీ చేయ లేని నా ఎమ్మెల్యే పదవి ఉన్నందుకే నాకు బాధగా ఉంది. అలాంటి నాకు మంత్రి పదవి కూడానా!... వద్దు... వద్దు''

''రాజకీయాలలో దిగి తప్పు చేశామేమోనని ఆలోచించేవారిని నేనింతవరకూ చూడలేదు. మొదటిసారిగా మిమ్మల్నే చూస్తున్నాను. జనా లకు వాగ్దానాలు చేయడం రాజకీయ నాయ కుని ప్రధాన కర్తవ్యం. అవి తిరిగి తీర్చకపోవట మన్నది వారి సహజ లక్షణం. ఇందులో తప్పేంఉంది. రాజకీయాలలో ఇది సర్వసాధా రణం. రాజకీయాలలో పైకి, పైపైకి పొదలుచు కున్నవాడెవడూ ఇలాంటి చిన్నచిన్న విష యాల గురించి అసలు పట్టించుకోడు... అలా గే ఎలక్షన్స్‌లో సారా ప్లస్ డబ్బు ఉపయో గించడం కూడా రాజకీయాల సహజ లక్షణం. ఈ ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎన్నికలలో పోటీచే సే ఏ వ్యక్తి అయినా ఆ రెండూ ఉపయోగించ నిదే గెలవడం అసాధ్యమని నేను ఖచ్చితంగా చెప్పగలను...''



"మరి అలాంటి తప్పుడు పనులు చేయడం తప్పు కాదంటారా?"

"రాజకీయాలలో గెలవడం, పై పదవులను అందుకోవడం కోసం చేసే ఏ పనీ తప్పుకాదని నా ఉద్దేశం."

"అలా అయితే తప్పుడు పనుల ద్వారా తప్ప, మరే ఇతర న్యాయమార్గానా లభించని ఆ పదవులు నాకొద్దు. ఈ రాజకీయాలు నాకొద్దు... నన్ను నన్నుగా బ్రతకనివ్వండి. నేను నచ్ఛీలతతో మిగిలి ఉన్నానన్న ఆత్మతృప్తిని నాకు మిగలనివ్వండి... ప్లీజ్! ... ప్లీజ్ నన్ను చెడగొట్టకండి" అతడి కంఠం రుద్ధమయింది.

మిత్రుడి గుండెలలోనుండి దూసుకువచ్చిన ఆ మాటలకు పరాత్పరరావు కదిలిపోయాడు. తాము బలవంతంమీద అతడిచేత ఇష్టంలేని పనులు చేయిస్తున్నట్లుగా తోచింది. గతంలో అతడిని ఎమ్మెల్యేగా పోటీ చేయమని తను బలవంతపెట్టడం గుర్తొచ్చి, తనను తాను నిందించుకున్నాడు.

పురుషోత్తమరావు కదిలిపోలేదుగానీ, ఎదుటి వ్యక్తిని అనవసరంగా ఇబ్బంది పెడుతున్నట్టుగా తోచింది. అతడు వియ్యంకుడి వంక అదోలా చూసి "మీరు రాజకీయాలకు పనికిరారు బావగారూ" అని లేచి వెళ్ళిపోయాడు.

"నేను రాజకీయాలలోని నీచ నికృష్టాలు చేయలేనని నాకెప్పుడో తెలుసు. కాని మీరే నన్ను బలవంతపెట్టి ఈ మురికిలోనికి దించారు. ఇందులో నా తప్పేంలేదు" మనసులోనే అనుకున్నాడు అతడు. దాంతో మనసులో తెలియని సంఘర్షణ బయలుదేరింది.

ఆకాశం కాటుక పూసుకుని, చీకటిని వర్షిస్తుంటే ఆ మిత్రులిద్దరూ లాన్‌లో నిశ్శబ్దంగా చాలాసేపు కూర్చున్నారు.

చివరికి పరాత్పరరావు తేరుకుని సత్యనారాయణ భుజంమీద చెయ్యేస్తూ "బాధపడకు" అన్నాడు లాలనగా.

దాంతో అతడు కొద్దిగా బరస్ట్ అయ్యాడు "అదికాదురా పరాత్పరం, వీరు, నేను, మరింత పైకి వెళ్ళేందుకు ప్రయత్నించడంలేదనీ, గొప్ప పదవులు సంపాదించలేకపోతున్న అసమర్థుణ్ణనీ అనుకుంటున్నారేగానీ నా మానసిక సంఘర్షణ ఏమిటో వీరికేమయినా అర్థమవుతోందా? నీచమైన పనులు చేయడం నాకు రాదు. అబద్ధాలు చెప్పడం అసలు తెలియదు. మాట ఇచ్చి తప్పడం అలవాటు లేదు. కానీ నావాళ్ళు నన్ను ఆ పనులు చేయమనే ప్రోత్సహిస్తున్నారు. తప్పుడు పనులు చేయమని ముందుకు నెడుతున్నారు. వారు ఇలా ఎందుకు చేస్తున్నారో నాకర్థంకావడంలేదు. నేను గొప్ప స్థితి కావాలని కోరుకోవడంలేదు. మరి అలాంటప్పుడు నాకు లేని తాపత్రయం వారికి మాత్రం ఎందుకు?... ఇదే... ఇదే నాకర్థంకావట్లేదు."

సత్యనారాయణ భార్యాబిడ్డలు, బంధుమిత్రులు అతడిని తప్పు చేయమని ఎందుకు ప్రోత్సహిస్తున్నారో పరాత్పరరావుకు బాగా తెలును. పదవి ఏ దారిన వచ్చిందన్నది ఇక్కడ అనవసరం. కేవలం ఆ పదవి ద్వారా తాము పొందబోయే లాభాలే వారికి కావలసింది. ఈ స్థితిలో అవతలివ్యక్తి మానసిక సంఘర్షణను పట్టించుకోవడం కూడా జరగదు.

అన్నీ అర్థం చేసుకోగలిగిన పరాత్పరరావు మిత్రుడిని ఊరడిస్తూ చెప్పాడు. "రేయ్ సత్యం! మనచుట్టూ ఉన్నవారంతా మానసిక సంఘర్షణ తెలియని స్వార్థపరులు. వారి దృష్టిలో నువ్వు ఉపయోగపడే ఒక యంత్రానివి మాత్రమే. ఒక యంత్రాన్ని మరింత మోడ్రనైజ్ చేసినట్టు, నిన్ను మరింత గొప్ప పదవిలోనికి నెడితే తద్వారా వారికి కలిగే లాభాలు జాస్తి... అందుకే వారు ఆ విధంగా తాపత్రయపడుతుంటారు."

మిత్రుడు చెప్పిన నిజం అతడి మనసులో సూటిగా నాటుకుంది. నిజమే! తన వారందరి దృష్టిలో తనొక ఉపయోగపడే యంత్రం. ఈ యంత్రం ఉపయోగపడినంత కాలం వారు ఎన్నో రకాలుగా ఉపయోగించుకోవాలని చూస్తారు. మరి ఆ యంత్రం ఇష్టంలేని పనులు చేయకూడదనుకుంటే ఏం చేయాలి....

అతడి మనసులో మొదటిసారిగా ఒక చిన్న ఆలోచన బయలుదేరింది. ఆ ఆలోచన క్రమక్రమంగా ఓ నిర్ణయంగా రూపుదిద్దుకోసాగింది.




ఉదయాన్నే వసుంధర ఇంటిముందు టాక్సీ దిగింది.

ఆమె వస్తుందని ముందుగా తెలిసినవాడు కాబట్టి హాలులోనే కూర్చుని పేపర్ తిరగే యటం సాగిస్తూ ఉన్నాడు. అప్పుడప్పుడు వీధి గేటు వంక చూపులు సారించేవాడు.

టాక్సీ ఆగడంతోనే అతడు ఉలిక్కిపడి పైకిలేచి వాకిట్లోకి వెళ్ళాడు. గేటు తీసుకుని వస్తున్న వసుంధర కనుపించటంతో ఆమెకు ఎదురుగా వెళ్లాడు.

"ఏమిటీ నాకోసమే ఎదురుచూస్తున్న ట్టుంది" ఆశ్చర్యంగా అడిగిందామె.

"ఒకవిధంగా అంతే"

"అయ్యబాబోయ్! ఎప్పుడూ బిజీగా ఉండ వలసిన ఎమ్మెల్యేగారు ఏ పనీ లేకుండా నాకోసం ఎదురుచూస్తూ కూర్చోవడం ఆశ్చ ర్యంగా ఉంది" నవ్వుతూ గుండెలమీద చెయ్యి వేసుకుని ఆశ్చర్యం అభినయించింది.

ఆ క్షణం అతడికి తన మనసులోని నిర్ణయం చెప్పేయాలనిపించింది. డబ్బు సంపాదన కోసం తనవారు తనను ఉపయో గించుకుంటుంటే, అందుకు "కుక్కకాటుకు చెప్పుదెబ్బ'లా తనెలాంటి నిర్ణయం తీసుకోవా లనుకుంటున్నదీ ఆమెతో చర్చించాలని పించింది. అయినా అన్ని విసుగులూ పక్కన పెట్టి ఆమెతో కొద్ది గంటలపాటు ఆనందంగా, గత స్మృతులను గుర్తుకు తెచ్చుకుంటూ గడ పాలన్న ఆలోచన ఉండిఉండటంతో ఆ ఆనందాన్ని పాడుచేస్తూ ఈ వెధవ చర్చ ఎందుకులే అనిపించింది. అందుకే అతడు మనసులోని మాట బయటపెట్టలేదు.

ఇద్దరూ ఇంటి లోపలికి వెళ్ళారు. హాలులోని సోఫాలో కూర్చున్న తరువాత ప్రసూన కాఫీ తీసుకువచ్చి వారికి అందించింది.

వసుంధర, ప్రసూన కొద్దిసేపు మాట్లాడుకు న్నారు.

కాఫీ తాగడం పూర్తయ్యాక ప్రసూన కప్పు లు తీసుకుని వెళ్ళిపోయింది.

అతడు పైకిలేస్తూ ఆమెతో "అలా కాసేపు తిరిగివద్దాం పద వసుంధరా!" అన్నాడు.

"ఎక్కడికీ" ఆమె ప్రశ్నించింది.

అతడు ఆమె ముఖంలోకి సూటిగా చూస్తూ చెప్పాడు "ఎందుకో ఈరోజు నీతో కలిసి, కాలేజీ రోజులలో తిరిగినట్టు ఈ టౌన్ అంతా

ఒక్కసారి తిరగాలని అనిపిస్తోంది.''

ఆ ఆలోచన తనకూ వచ్చినట్టుగా ఆమె ముఖం విప్పారింది.

ఇద్దరూ బయటకు నడిచారు.

డ్రైవర్ కారు తీసుకువచ్చి వారి ముందు ఆపాడు.

అతడు కారు డ్రైవర్‌ని దిగిపొమ్మని చెప్పి, తనే డ్రైవింగ్‌సీట్లో కూర్చున్నాడు. ఆమెను ఫ్రంట్‌సీట్లో కూర్చోమన్నాడు.

ఆమె డోర్ తీసుకుని సీట్లో కూర్చుంటూ అడిగింది- ''నువ్వెప్పుడు డ్రైవింగ్ నేర్చుకున్నావు సత్యం''

''ఈమధ్యే'' బదులు పలికాడు అతడు.

కారు గేటు దాటుతుంటే అతడు ఆమె వంక చిలిపిగా చూస్తూ అన్నాడు- ''చిన్న సవరణ''

''ఏమిటి?''

''ఒకప్పుడు మనం ఈ టౌన్‌లో కలసి కాలినడకనో లేదా టౌన్ బస్సుల్లోనో తిరిగేవారం. ఇప్పుడు కారులో తిరుగుతున్నాం ఇదే తేడా''

ఆమె నవ్వి ఊరుకుంది.

వారి ఇల్లు ఉండేది లక్ష్మీపురం అనే ఏరియాలో. కారు ఆ ఏరియాదాటి మెయిన్ రోడ్ ఎక్కింది. చాలా బిజీ అయిన రోడ్డు అది.

ఆ రోడ్డు దాటితే వచ్చేది బస్టాండ్. ఆ బస్టాండ్ దగ్గర టౌన్‌బస్సుల స్టాపింగ్ దగ్గర కారు స్లో చేశాడు అతడు. వారిలో పాత జ్ఞాపకాలు ప్రారంభమయ్యాయి. ఆ స్టాపింగ్ దగ్గరే తాము బస్సుల కోసం వెయిట్ చేసేవారు. అప్పట్లో ఇన్ని టౌన్‌బస్‌లు లేవు. ఉండేవి చాలా కొద్ది. జనం చాలా ఎక్కువ. మరి కాలేజ్ టైమ్ అయితే జనం ఎంతో ఎక్కువగా ఉండేవారు. ఒకరినొకరు తోసుకుంటూ లోపలికెక్కేవారు.

లక్ష్మీపురం నుండి అక్కడి వరకూ నడిచి వచ్చిన తాము అక్కడే బస్సు ఎక్కేవారు. బస్సులోకెక్కాక వీలయినంతవరకూ పక్కపక్కనే నిలబడేవారు. టిక్కెట్ పావలానో ఇరవై పైసలో ఉండేది. సాధారణంగా టిక్కెట్ తానే తీసుకునేవాడు...

ఆలోచన మధ్యనే కారు కనకమహల్ దాటి గాంధీబొమ్మ మీదుగా వి.ఆర్.కాలేజీ సమీపించింది. టవర్‌క్లాక్ పక్కనే కారు ఆపి వారిద్దరూ తాము చదివిన ఆ కాలేజి వంక చూసారు. అతడు కారు దిగలేదు. కారు దిగితే ఎమ్మెల్యేగా అతడిని గుర్తు పడితే, ఇక పరామర్శలు అవీ ఇవీ మొదలవుతాయి. ఆనందంగా గడవదలచుకున్న సమయం అలా వృధా కావడం అతడికిష్టంలేదు.

తామిద్దరూ చదివిన కాలేజీవంక ఆప్యాయంగా చూసుకుంటుంటే అతడు అన్నాడు- ''వసుంధరా! అదిగో మన మధురస్మృతులకు పుట్టిల్లు''

నిజమే! కాలేజి ఎవరికైనా ఒక మధుర స్మృతి. అందులోనూ కాలేజీ జీవితంలో ఒక అపోజిట్ సెక్స్‌కు చెందిన ఫ్రెండ్ ఉంటే.... అది మధురాతి మధురమైన అనుభూతి! ఆ మధురాతిమధురమైన అనుభూతిని మరొక్కసారి నెమరువేసుకున్నారు వారు.

కారు ముందుకు కదిలింది. ఆర్.టి.సి.స్టాండ్, సర్వోదయా కాలేజీ, డి.కె.ఉమెన్స్ కాలేజీ....

ఉమెన్స్ కాలేజీ గేటు సమీపించిన తర్వాత అతడు మెల్లగా నవ్వుకోవటం ఆమె గమనించింది.

''ఎందుకు నవ్వుతున్నావు?'' అడిగిందామె.

''ఈ కాలేజీకి సంబంధించిన ఒక చిన్న విషయం గుర్తుకు వచ్చింది''

''ఏమిటో చెప్పకూడదా?''

''ఎందుకు చెప్పకూడదూ?.... ఈ కాలేజీ లోపలే హాస్టల్ ఉందికదా! అలాగే రకరకాల చెట్లూ ఉన్నాయి. ఒకసారి నా మిత్రుడొకడు హాస్టల్‌లోని తన కూతురును చూడబోయేసరికి ఆ అమ్మాయి చింతచెట్టుకింద చేరి చింతకాయలు కోసుకుతింటూ ఉందట. అది చూసిన నా మిత్రుడికి అనుమానం వచ్చేసింది. అలా పులుపు తినడం వెనుక మరేదైనా విశేషం ఉందేమోనని ఆ అమ్మాయిని బెదిరించి అడిగాడు. ఆ అమ్మాయి 'జస్ట్! తినాలని తింటున్నాను తప్ప తినాలనిపించి' తినటంలేదు' అని చెప్పింది. అయినా వాడికి నమ్మకం





కుదరలేదు. ఒకవేళ భయపడి దాచిపెడు తుందేమోనని, అనుమానంతో డాక్టర్ల పరీక్షలూ అవీ ఇవీ చేయించాడు. అఫ్‌కోర్స్! అలాంటివే మీ లేవని తెలిసిందనుకో....."

ఆ నిజం విని ఆమె పకాపకా నవ్వింది. ఆ నవ్వు వంక ఆప్యాయంగా చూస్తూ అతడు అన్నాడు-

"....అప్పుడే నవ్వేయకు. చెప్పాల్సిన విషయం ఇంకా ఉంది.... ఆ తర్వాత సంవత్స రానికి వారు అనుమానపడిన విషయాన్ని ఆ అమ్మాయి నిజంచేసి కూర్చుంది. ఈసారి తన మీద ఎలాంటి అనుమానం లేకపోవటం తీరా సమస్య విషమించేవరకూ ఆమె తన గర్భం విషయం ఇంట్లో చెప్పలేదు... ఆ తర్వాత ఇక తప్పనిసరి పరిస్థితుల్లో అమ్మాయి తల్లితండ్రు లు, అబ్బాయి కాళ్ళుపట్టుకుని పెళ్ళి జరి పించడంలాంటిది జరిగిపోయిందనుకో...."

విషయం తమాషాగా అనిపించింది.

మాటల మధ్యనే కారు హెడ్‌క్వార్టర్స్ హాస్పి టల్ దాటి రాజేశ్వరిగుడిముందు ఆగింది. ఆ గుడి అంతకుమునుపు వారు ప్రశాంతంగా మాట్లాడుకునేందుకు ఉపయోగించేస్థలం.

ఇద్దరూ కారు దిగి గుడి లోపలికి నడిచారు. అమ్మవారిని దర్శించుకున్నారు.

తనకు అక్కడ కూర్చుని ఆమెతో కబుర్లు చెప్పాలనిపించినా, పబ్లిక్ దృష్ట్యా అది మంచి దికాదు కాబట్టి వెంటనే వెనుతిరిగారు వారు.

మధురానుభూతులను మరొకసారి నెమరు వేసుకుంటూ వారు మధ్యాహ్నం వరకూ టౌన్ మొత్తం కలసి తిరిగారు.

మధ్యాహ్నం ఇంటికి వచ్చాక భోంచేయ మంటే మొదట మొహమాటపడింది ఆమె. తర్వాత బలవంతపెట్టడంతో తినక తప్పింది కాదు.

లంచ్ పూర్తయిన తర్వాత ఆమె ఇంటికి బయలుదేరింది.

ఆమె వెంట గేటు వరకూ వచ్చాడు అత డు. గేటు దగ్గర నిలబడి ఆమెతో చిన్నగా చెప్పాడు. "వసుంధరా! మరి కొద్ది రోజులలో నువ్వు నా గురించిన ఒక ప్రత్యేక వార్త పేపర్‌లో చూస్తావు"

"ఏమిటా వార్త" . క్యూరియాసిటీతో అడి గిందామె. విషయం తెలియదు కాబట్టి, అది శుభవార్తగానే భావించుకోవటంతో ఆమె ఆందో ళన పడలేదు.

"కొద్దిరోజులవరకూ సస్పెన్స్. ఎందుకంటే ఆ వార్త విడుదల గురించిన పూర్తి వివరాలు ఇంకా నాకే తెలియదు. నేనింకా దాని గురించి ఒక నిశ్చితాభిప్రాయానికి రాలేదు. నో!... ఇప్పు డు అందు గురించి నేనేమీ చెప్పలేను"

బహుశా ఏ మంత్రి పదవో తనను వరించ బోతుందన్న ఊహ కలిగిందో ఏమో ఆమె తన దగ్గరగా వచ్చి "విష్ యూ బెస్టాఫ్ లక్" అంది.

జరగబోతున్నది కూడా తనకు లక్కే కాబట్టి ఆ అభినందనను మనస్ఫూర్తిగా స్వీకరించాడ తను.

మరో నిమిషం తర్వాత వసుంధర సత్యనా రాయణ కారులో ఇంటికి కదిలి వెళ్ళిపో యింది. తనలోని సగం శరీరం దూరమయిన ట్టు ఫీలయ్యాడతడు.

అతడు నీరసంగా ఇంటి లోపలికి వచ్చా డు.

ఆరాత్రి , మరో నిద్రలేని రాత్రే అయింది సత్యనారాయణకు. వసుంధర జ్ఞాపకాలు తన ను చాలా బలంగా కుదిపివేశాయి. ఆ ఆలోచ నలకు ఒక ప్రత్యేక రూపం అంటూ లేదు. కాని అవి మనిషిని కదిలించగలవు. కదిలేలా చే యగలవు.



అతడి ఆరోగ్యం పూర్తిగా కుదుటపడింది. అయితే డాక్టర్లు కొన్ని జాగ్రత్తలు మాత్రం

చెప్పారు. అతడు తిరిగి రాజకీయాల కార్యకలాపాలలో పాల్గొనవలసి వచ్చింది.

అయితే అప్పటి వరకూ మనసు మూలలలో మిణుకు మిణుకుమంటున్న అసంతృప్తి అతడిలో ఇప్పుడు ప్రజ్వలమయింది. అందుకు కారణాలు అనేకం. తను ఏదో సంపాదించాలని- మరేదో సాధించాలని రాజకీయాలలోనికి రాలేదు. ఒక విధంగా బలవంతంగా రాజకీయాలలోనికి లాగబడ్డాడు. కాని రాజకీయాలలోనికి వచ్చినా, తన మనసు చాలా వరకూ నిర్మలంగానే ఉంది. సంపాదించే ఉద్దేశ్యంలేదు కాబట్టి మనస్ఫూర్తిగానే ప్రజలకు సేవ చేయాలనుకున్నాడు. తనకు హఠాత్‌గా వచ్చిన డబ్బు వలన ఏర్పడిన అసంతృప్తిని ప్రజలసేవతో కప్పెట్టాలని చూశాడు. తన బ్రతుకుకు అలా అయినా ఒక పరమార్థకం వెతుక్కోవాలనుకున్నాడు. అయితే తన ఆశ నిరాశగానే మిగిలిపోయింది. అది ఫలించని కలగానే ఉండిపోయింది.

పదవిలో ఉన్నవాడికి ప్రజాసేవ చేసే అవకాశం ఎంతవరకూ ఉందంటే చాలా కొద్ది శాతం మాత్రమే. ఎప్పుడూ అనుచరవర్గం, బంధుమిత్ర సపరివారం తనలాంటి వారి సహాయం కోసం కాసుక్కూచుని ఉంటారు. ప్రజలకన్నా ముందు తనవారి పనులు చేసిపెట్టాలి. అలా చేసిపెట్టకపోతే పైనుంచి రకరకాల వత్తిడులు, నిరసనలు. అందుకే రాజకీయనాయకులు చేయగలిగిన ప్రజాసేవ ఏమీ ఉండదు. ఉన్నా అది పరిమితం. వాస్తవంలో అదంతా 'తనవారి సేవ' మాత్రమే.

తనకు అయినవాడికి ఉద్యోగాలిప్పించడం, ప్రమోషన్‌ల కోసం ఫోన్‌లు చేయడం, కాంట్రాక్టులు ఏజెన్సీల లైసెన్సులు ఇప్పించటం, పోలీసు కేసులలో ఇరుకున్నవారిని తప్పించటం తను చేయగలిగిన ప్రజాసేవ ఇదే అయింది.

దాంతో మనసులోని అసంతృప్తి మరింత పెరిగింది. పెరుగుతున్న తన కీర్తిగాని, డబ్బుగాని, చేతిలోని అధికారంగాని అతడికి తృప్తినివ్వలేదు.

తన బ్రతుకు ఇలాంటి పనులు చేయడంకోసమేనా! అని తనలో తాను ప్రశ్నించుకోసాగాడు అతడు.

రాత్రుళ్ళు నిద్రపట్టడం తగ్గింది. దీర్ఘాలోచనలు మొదలయ్యాయి. తను రాజకీయాలలో అడ్జస్ట్ కాలేననుకున్నాడు. మరి ఇప్పుడు తన కర్తవ్యం ఏమిటి అని తనలో తాను ప్రశ్నించుకున్నాడు.

ఈ బరువులు, బాధ్యతలు అన్నింటి నుండీ దూరంగా పారిపోవాలనిపించేది మహాప్రస్థానమా?

ఏదో తర్జన భర్జన మధ్య ఆ రాత్రి పూర్తిగా అతడు నిద్రపోలేదు. నిద్రపట్టక బెడ్ మీద నుండి లేచి గాజు అద్దాల కిటికీ వద్దకు నడిచాడు.

నైట్‌క్వీన్ మొక్క ఒకటి గాలికి మెల్లగా ఊగుతోంది. చుక్కల మధ్య చంద్రుడు తెల్లగా మెరిసిపోతున్నాడు. ప్రకృతి మొత్తం తెల్లని వెన్నెల పరుచుకుని ఉంది. చల్లటిగాలి ఉండుండి మెల్లగా వీస్తోంది.

"ఎంత అందమైన ప్రకృతి! మనసులోనే అనుకున్నాడతడు. 'మనిషి ఈ అందమైన ప్రకృతిలో కలసిపోయి పరవశించక, ఈ ఉరుకుల పరుగుల జీవితాన్ని ఎందుకు ఎన్నుకున్నాడు. ఏం సాధిద్దామని నిరంతరపోరాటం మొదలుపెట్టాడు. తన వెంట ఏమి ఎత్తుకుపోగలనని రాత్రింబవళ్ళు కష్టపడుతున్నాడు. ఈ ఆధునిక సమాజంలో మనిషి పొందుతున్న సంతృప్తి సరయినదేనా? డబ్బు వెనుక పరుగెట్టడంలో అర్థం ఉందా?

అసలు 'సంతృప్తి'కి అర్థం ఏమిటి?- అని ఎవరయినా ఎదురు ప్రశ్నిస్తే!

తను తప్పకుండా జవాబు చెప్పగలడు. "ఏ మనిషయితే నాకే బాధలూలేవు, ఎలాంటి భయాలూ లేవు. నేను జీవితంలో అన్నీ అనుభవించాను. అనుభవించకపోయినా తృప్తిని పొందాను. ఇప్పుడు ఈ లోకంలో నేను పొందవలసింది ఏదీ లేదు..." అలా అనుకోగలగడమే తృప్తి.

మరి ఇలా ఎవరైనా అనుకోగలరా?.... నిట్టూర్చాడు అతడు.

ఆ క్షణం అతడికి తన 'నిర్ణయం' గుర్తుకు వచ్చింది. అతడు ఆ ఆలోచనకు అన్ని వై





పులా ఆలోచించాడు. తనకిప్పుడు మానసిక సుఖం ముఖ్యమనుకున్నాడు. అందుకే ఆ నిర్ణయాన్ని గట్టిగా సమర్థించుకున్నాడు.

జీవితంలోని కొన్ని ముఖ్య బాధ్యతలు స్వయంగా వదిలించుకోనంతకాలం మనిషికి మానసిక సుఖం ఉండదన్నది అతడికి తెలిసివచ్చింది. బాధ్యతలకు- మానసిక సుఖానికి చుక్కెదురు. మానసిక ఆనందం లేకుంటే మనిషికి తృప్తిరాదు.

తను తీసుకున్న నిర్ణయం మరింత గట్టిపడింది.

అయితే తన నిర్ణయాన్ని అమలు పరచటం అప్పుడే కాదు. అసంతృప్తి అనే అగ్నిపర్వతం బ్రద్దలయ్యేందుకు తీవ్ర సంఘటన ఏదయినా జరగాలి. అప్పుడు తనలో ఆవేశం కలిగి, ఆ ఆవేశంలో అసంతృప్తి అనే అగ్నిపర్వతం బద్ధలు అయితే అందులో పేరుకున్న లావా బయటకు వెళ్ళిపోతుంది. అప్పుడు మనిషి స్థిరచిత్తుడు అవుతాడు. స్థిరచిత్తుడయిన మనిషి ఏ నిర్ణయాన్నయినా దృఢసంకల్పంతో నిర్వహించగలడు. తను కోరుకున్నమార్గంలో మానసికానందం కోసం, సంతృప్తి కోసం అన్వేషించగలడు. అటువంటి వాడిని ఈ లోకంలోని ఏ బంధాలూ ఆపలేవు. ఏ సంబంధాలు అడ్డుకోలేవు.

ఆ స్థితి కోసమే ఎదురు చూడసాగాడు సత్యానారాయణ.

ఈ మధ్యకాలంలో అతడు మరోసారి శాసన సభా సమావేశాలకు హైదరాబాదు వెళ్ళిరావడం జరిగింది.

ఆ శాసనసభా నిర్మాణ కార్యక్రమాలు చాలా పిచ్చితనంగా అనిపించాయి అతడికి. కానీ ఏమీ చేయలేని అశక్తుడు తను. ఈ జనం కోసం తను ఏదో చేయాలని అనిపిస్తూ ఉంటుంది అతడికి. కానీ ఏమీ చేయలేని నిస్సహాయత అతడిని బాధిస్తూ ఉంటుంది. దాంతో అతడికి ఈ వ్యవస్థమీద, ఈ వ్యవస్థ పునాదులమీద మహాకోపం వస్తుంటుంది. కసి పుడుతుంది.

అలాంటి కసి జనించినవారు చేయతగ్గ పనులు రెండే— ఒకటి తిరుగుబాటు. రెండోది సన్యాసం.

తిరుగుబాటు చేసే వయసు కాదు అతడిది. అందుకే రెండవదాన్ని ఆశ్రయించటాన్ని గురించి ఆలోచించసాగాడతను.

ఇలా ఆలోచిస్తున్న సమయంలోనే అతడు ఒక ప్రారంభోత్సవానికి హాజరు కావలసి వచ్చింది.

టౌన్‌కు పదిమైళ్ళ దూరంలో ఉన్న పల్లిపాడు గ్రామంలో కొత్తగా కట్టిన స్కూలు భవన సముదాయానికి ప్రారంభోత్సవం చేశాడు సత్యనారాయణ.

ఆ గ్రామంలో తన క్లాస్‌మేట్ అయిన ఒక రచయిత మిత్రుడు ఉండడంతో ఆరోజు అతడితో గడిపేందుకు అక్కడే ఉండిపోయాడు సత్యనారాయణ. భోజన కార్యక్రమాలు వారింట్లోనే జరిగాయి.

భోజన సమయంలో ఆ మిత్రుడు- "ఏమోయ్ సత్యం! మా ఊరి గాంధీ ఆశ్రమం ఎప్పుడయినా చూశావా?" అన్నాడు.

"చూడలేదు... ఏమిటందులోని స్పెషాలిటీ?" అడిగాడు తను.

"అందులో స్పెషాలిటీ అంటూ ఏమీలేదు. అది కేవలం ఒక పురాతన కట్టడం మాత్రమే... ఎప్పుడో గాంధీగారు ఆంధ్రాను పర్యటిస్తూ ఈ గ్రామం ఒకసారి వచ్చారట. ఆ స్మృతి చిహ్నంగా కొందరు పెద్దలు ఆయన కూర్చుండినచోట ఒక పెద్ద భవనం కట్టి దానికి 'గాంధీ ఆశ్రమం' అని పేరు పెట్టారు. పెన్నానదికి ఒడ్డునే ఉందా బిల్డింగ్. ఆ వాతావరణం చాలా అద్భుతంగా ఉంటుంది".

"పోవోయ్! మీ రచయితలు ప్రతిదీ అద్భుతం, అమోఘం అంటూ పొగిడేస్తుంటారు" మిత్రుని తమాషాగా ఉడికించాడు.

"లేదురా సత్యం! అంతగా నామాట అబద్ధమనుకుంటే, నువ్వు ఒకసారి వచ్చి చూడు చాలా చక్కని వాతావరణం... నాకేమనిపిస్తుందో తెలుసా. ఊళ్ళో ఈ ఇల్లు వదిలేసి ఆ చోట చిన్న పర్ణశాలలాంటిది కట్టుకుని తృప్తిగా బతుకాలనిపిస్తుంటుంది.

'తృప్తి' అన్న పదం వినిపించడం అతడిలో ఉత్సుకత కలిగించింది. ఆ ప్రదేశాన్ని ఒకసారి చూడాలనిపించింది.



మధ్యాహ్నం భోజనాలయ్యాక మిత్రుడితో కలసి 'గాంధీఆశ్రమం'కు వెళ్ళాడు అతడు.

పక్కనే పారే పెన్నేరు. ఒడ్డునే రకరకాల చెట్లు. ఆ చెట్ల మధ్య ఒక పురాతన కట్టడం... వార్ధాలోని గాంధీ ఆశ్రమంను గుర్తుకు తెస్తుందది.

గాలి చల్లగా వస్తుంది. ఆ చల్లగాలి మధ్య ప్రశాంతమైన ప్రకృతి!

అతడి తలపులలో గాంధీ మెదిలాడు. మహాత్మాగాంధీకి డబ్బులేదు. రాజకీయ అధికారం చేతిలో లేదు. ఏమీ లేకుండానే ఆయన సంతృప్తికరమైన జీవితం గడిపినట్టు దాఖలాలున్నాయి. అసలు మనిషికి ఏ కట్టడీ లేనప్పుడే సరయిన సంతృప్తి లభిస్తుంది.

ఈ సంతృప్తి విషయంలో గాంధీ పరిపూర్ణత సాధించాడని చెప్పవచ్చు. ఆయన ఏ కోరికా కోరలేదు. కోరిన కోరికల్లా ఒక్కటే. స్వాతంత్ర్యం సంపాదించుకోవడం. ఆ ఒక్కకోరికా తీర్చుకుని ఆయన సకలవిధాల సంతృప్తిని పొందిన ధన్యజీవి అయ్యాడు.

ఆధునిక యుగంలో మనకు తెలిసిన మహానీయులందరిలో అత్యంత సంతృప్తికరమైన జీవితం గడిపిన వ్యక్తిగా 'గాంధీ' ఒక్కడే మన దృష్టికి కనుపించడంలో తప్పులేదు.

ఇంతకీ గాంధీగారు సన్యాసికాదు. అలా అని పూర్తిగా సంసారీకాదు. కస్తూరిబాతో ఉంటూనే, చాలా సుఖాలను పరిత్యజించాడు.

ఆయన జీవితం తనకు ఎందుకు ఆదర్శం కాకూడదు?

అప్పటివరకూ తనలో కొట్టుమిట్టాడుతున్న ఒకే ఒక సందిగ్ధావస్థ తొలగిపోయింది. తను భవిష్యత్‌లో ఎలా నడుచుకోవలసింది కనుల ముందు కదలాడింది.

అతడు తన మిత్రుడికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. ఊహించకనే అయినా తన ఒకానొక సమస్యకు పరిష్కారం లభింపచేసినందుకు మిత్రుడిని మనసులోనే మెచ్చుకున్నాడు.

ఆ ఆనందంతో ఆ సాయంత్రం వరకూ మిత్రుని ఇంటిలోనే గడిపాడు. ఆ ఇంటిలోని పిల్లలతో తనూ ఒక పిల్లవాడిలా కలసిపోయి ఆడుకున్నాడు. ఆ సాయంత్రం తిరిగి కారులో టౌన్‌కి వచ్చేసాడు.

★ ★ ★

"నాన్నా! మీరు మన యస్.పి.కి ఒకఫోన్ చేయాలి"

"ఎందుకురా?"

"మన 'గంగరాజు' లేడూ, వాడు హొటల్‌లో పేకాడుతుంటే వాటిని పోలీసులు అరెస్ట్ చేశారట"

"వాడు చేసింది తప్పు. తప్పుచేసినవాడికి శిక్షపడటం న్యాయమే".

సునీల్ తండ్రివంక అదోలా చూశాడు. ఆమధ్య ఎప్పుడో ఎమ్మెల్యే అయిన కొత్తల్లో ఆయన ఇలా నీతినియమాల గురించి మాట్లాడేవాడు గాని, తర్వాత తమ కుటుంబంలోని వ్యక్తులందరూ వత్తిడిచేయటంతో, ఆ తర్వాత మరెప్పుడూ నీతినిజాయితీల చర్చ తీసుకురాలేదు. చేయమన్నపని చేసేవాడు. వద్దంటే ఊరుకునేవాడు. తిరిగి మళ్ళీ ఇప్పుడు ఆ పాతధోరణే మొదలుపెట్టాడంటే ఆయనను మరోసారి వత్తిడిపెట్టక తప్పదనిపించింది.

"అదికాదు నాన్నా! గంగరాజు మన అనుచరుడు. అటువంటివాడిని రక్షించుకోలేకపోతే రేపు మనవెంట ఎవ్వరూ ఉండరు".

"నా వెంట ఎవరూ నడవకపోయినా ఫర్వాలేదు. నీతి తప్పిన మనుష్యులను చట్టం నుండి తప్పించటం నావల్లకాదు. ఆ వ్యక్తి నావాడయినా పరాయివాడయినా చట్టం దృష్ట్యా నేరస్తుడు కాబట్టి శిక్ష అనుభవించి తీరాల్సిందే!"

దాంతో సునీల్‌కు కోపం వచ్చింది. తండ్రికి చాలారకాలుగా చెప్పిచూశాడు అప్పటికీ. అయినా ఆయనలో మార్పేమీలేదు. జవాబుచెప్పకుండా నిశ్చలంగా ఉండిపోయాడు.

ఆ సమయంలో తండ్రి గంభీరంగా ఉండడంచూసి సునీల్ కొద్దిగా భయపడ్డాడు. ఆయన ఎప్పుడూ అంత సీరియస్‌గా ఉండి ఎరుగడు. తండ్రిని మొదటిసారి కొత్తరూపంలో చూడటంతో కంగారు కలిగింది.

సునీల్ ఇక మారుమాట్లాడకుండా వెళ్ళిపోయాడు. రెండురోజులపాటు ఇద్దరిమధ్యా





మాటలు కూడా లేవు.

కామేశ్వరికి విషయం తెలిసింది. మొదట భర్తకు సర్దిచెప్పబోయింది. "అదికాదండీ! ఆ లాకప్‌లో ఉన్నవాడు మన మనిషట కదా! అటువంటివారితో మనకు ఎప్పుడూ అవసరం ఉంటుంది. రేపు మళ్ళీ ఎలక్షన్స్‌లో నిలబడితే, అలాంటివారేకదా మనకు అండ. కాబట్టి నామాటవిని వాడిని విడిపించే ప్రయత్నం చేయండి".

అతడు తల అడ్డంగా ఆడించాడు "వీధి గూండాల అండ కోరుకుని, వారిని వెనకేసుకు వచ్చినంతకాలం ఈ దేశంలోని రాజకీయనాయకులు చేయగలిగింది ప్రజాసేవ కాదు - గూండాలసేవ. నేను ప్రజాసేవ చేయాలని రాజకీయాలలోనికి వచ్చినవాడిని. చేస్తే ప్రజాసేవ చేస్తాను. అలా చేయలేని పరిస్థితులలో పదవికి రాజీనామా చేసి ఇంట్లో కూర్చుంటాను".

ఆమె తన భర్తను అంతకుమునుపు తనకు తెలిసిన వ్యక్తిలానే భావించింది. అంతేతప్ప అతడు ఇప్పుడు మానసిక చైతన్యం కలిగి, తనలోని అసంతృప్తిని పారదోలే ప్రయత్నంలో అన్నింటినీ త్యజించేందుకు సిద్ధపడి ఉన్నాడని ఆమె ఊహించలేదు.

అందుకే సర్దిచెప్పడం దగ్గరనుండి బెదిరించేస్థాయి, సెంటిమెంట్‌ను ఉపయోగించే స్థాయికి వెళ్ళిందామె. "చూడండీ! ఒకవేళ మీరు తన మాట కాదన్నారని కోపంతో సునీల్ వేరు కాపురం..."

ఆమె మాట పూర్తికాకమునుపే అతడు అందుకున్నాడు. "...పోనివ్వు కావుడూ! ఈ లోకంలో ఎవరికి ఎవరు సొంతం. ఉన్నవన్నీ వ్యాపార బంధాలు. ఆ బంధాలన్నీ అడ్జస్ట్‌మెంట్‌లు. ఈ లోకంలో వ్యక్తికి వ్యక్తిగా విలువలేదు. రక్తసంబంధం మధ్య అసలైన ప్రేమ, ఆప్యాయతలు లేవు. ఈ లోకంలోని అన్ని బంధాలూ కలుషితమయిపోయాయి. కలుషితమైన ఆ బంధాల కోసం ప్రాకులాడేవారు నిజంగా అమాయకులు... ఈ కొడుకులు, కూతుళ్ళూ తల్లితండ్రులను అవసరకాలంలో ఉపయోగించుకునేవారే. తమ స్వార్థం కోసం వినియోగించుకునేవారే. అదే తండ్రికి ఏదయినా గొప్ప ప్రమాదం సంభవించినప్పుడు ఈ బంధాలు తనయులకు గుర్తుకురావు. ఇంత తెలిసినా పిల్లలను పెంచి పెద్దచేయటం, వారి భవిష్యత్తు కోసం అహర్నిశలూ శ్రమించడం ఎందుకంటే, కన్న మహానేరానికి అది తల్లితండ్రుల బాధ్యత. ఆ బాధ్యత నెరవేర్చుకుని పిల్లలకొక భవిష్యత్ నిర్ణయించి ఇచ్చిన తర్వాత ఇక వారి గురించి ఆలోచించాల్సిన అవసరం తల్లితండ్రులకు లేదు. వారి స్వార్థంకోసం తాము ఉపయోగపడటమంటే, అది నిజంగా అమాయకత్వం... నేనింకా ఆ అమాయకత్వంలో బతకలేను. రక్తసంబంధాల కోసం నా మనసును చంపుకోలేను... అందుకే నేనొక నిర్ణయానికి వచ్చాను..."

ఆయనలోని ఆవేశం బద్దలైంది. రోజురోజుకూ కొండలా పెరిగిపోతున్న 'అసంతృప్తి' వెలుపలికి వచ్చేసింది. కాబట్టే మాటలు సూటిగా తీక్షణంగా ఉన్నాయి.

భర్త ఇంట్లో ఏనాడూ అంత ఆవేశంగా మాట్లాడి ఉండకపోవటంతో ఆయన ప్రవర్తన పట్ల ఆమెకు భయం కలిగింది.

"ఏం నిర్ణయం తీసుకున్నారు" కంగారుగా అడిగిందామె.

అతడు చెప్పాడు "నేను నా పదవికి రాజీనామా ఇచ్చేయాలనుకుంటున్నాను"

అదిరిపడింది కామేశ్వరి. ఆయనను పిచ్చివాడిని చూసినట్టుగా చూసింది. అందులో ఆశ్చర్యపడవలసినదేమీలేదు - మహాత్ములు కాబోయేవారంతా మొదట పిచ్చివారిలానే కనపడతారు.

ఇక ఉండబట్టలేక ఆ మాట కూడా అనేసింది. "మీకేమయినా పిచ్చా? లేకపోతే బంగారంలాంటి ఎమ్మెల్యే పదవిని వదులుకుంటాననడం ఏమిటి?"

"అవును అది బంగారంలాంటి పదవనే మీరు నన్ను అందులో ఇరికించారు. నేను అందులోని మలినాన్ని భరిస్తుంటే, మీరేమో బంగారం సంపాదించటం మొదలుపెట్టారు"

"నిజంగా మీకేదో అయింది" అదుర్దాగా అందామె.

"అవునయింది. మానసిక చైతన్యం కలి



గింది. నా అనేవారు నా చుట్టూ చేరి నన్నో డబ్బు యంత్రంగా మార్చుకుని, తమ స్వార్థం కోసం ఎలా వినియోగించుకుంటున్నారో చూస్తే చాలా లేట్‌గా అయినా నాకు జ్ఞానోదయమయింది. మానసిక సంఘర్షణ అనుభవిస్తూ నావారికోసం ఉపయోగపడటమా లేక 'సంతృప్తి'గా బతికేందుకు నావారందరినీ త్యజించడమా అన్న ధర్మమీమాంసలో చివరికి రెండవదే మేలని నాకనిపించింది. అందుకే... అందుకే నేను ఈ నిర్ణయం తీసుకున్నాను''

ఆమె పూర్తిగా కంగారుపడిపోయింది. ఈ విషయం కొడుకు - కోడలుకు చెప్పింది. కొడుకు తండ్రి దగ్గరకు వచ్చి బతిమలాడటం మొదలుపెట్టాడు. "నాన్నా! నేనేదో పొరపాటున ఆ వ్యక్తిని విడిపించమని మిమ్మల్ని కోరుకున్నాను. ఇది తప్పయితే నన్ను క్షమించండి. ఆ వ్యక్తిని విడిపించటం కూడా మానేయండి. అంతేతప్ప - ఇలా రాజీనామా చేస్తానని మాత్రం అనకండి''

ఆయన అన్నంతపనీ చేస్తాడని భయం వేసింది సునీల్‌కు. అందుకే ఆయనను అలా బతిమలాడుకుంటున్నాడు.

"ఇందులో నీ తప్పేంలేదు సునీల్! లోకంలో మనుష్యుల మనస్తత్వాలన్నీ ఇంచుమించుగా అలాగే ఉన్నాయి. నేడు జనాలకు కావలసింది డబ్బు, అధికారాలు. వాటిమీద మోజులేని వ్యక్తి ఎక్కడో నూటికో, కోటికో ఒక్కరుంటారు. ఆ ఒక్కరూ ఈ అందరిలో కలవలేరు. కాబట్టి శారీరకంగా అందరిమధ్యా ఉన్నా మానసికంగా అలాంటివారు ఓ కొత్త ప్రపంచాన్ని నిర్మించుకుంటారు. తమ చుట్టూ బలమైన ఇనుపకంచె నిర్మించుకుంటారు. ఏ ఒక్కరూ అందులోనికి ప్రవేశించగలిగి ఉండకూడదు. అలాంటివారికి కేవలం మానసిక తృప్తి చాలు. అధికారం - డబ్బులకు దూరంగా ఉండాలి. తను నిర్మించుకున్న ప్రపంచంలో తనొక్కడే ఏకాంతంగా, ఋషిలా కాలం గడపాలి...''

సునీల్ ఆ స్థాయికి ఎదిగి ఉండకపోవటంతో తండ్రి మాటలు ఏమీ అర్థంకాలేదు.

అయినా తండ్రి రాజీనామాను ఆపాలన్న ప్రయత్నంలో ఎంతో బతిమలాడాడు.

కాని తండ్రి అతడి మాటలను వినిపించుకోలేదు.

ఇక తప్పనిసరి పరిస్థితులవల్ల వారు ఊరుకుండిపోయారు.

సత్యనారాయణకు తెలుసు - వారెవరూ తన నిర్ణయాన్ని హర్షించరని! పైగా రకరకాల నిష్టూరాలు, నిరసనలు ఎదురవుతాయని కూడా ఊహించాడు. అయినా తన నిర్ణయాన్ని అమలుపరచేందుకే నిశ్చయించుకున్నాడు.

ఆ మర్నాడు...

'సత్యనారాయణ తన ఎమ్మెల్యే పదవికి రాజీనామా చేసేశాడు'

పరాత్పరరావు, పురుషోత్తమరావు షాక్ తిన్నారా సంగతి విని.

దినపత్రికలలో ఈ వార్త హెడ్‌లైన్స్‌లో వచ్చింది. రాష్ట్రమంతా ఈ విషయంపట్ల ఆసక్తి కనుపరిచింది.

పార్టీ ప్రముఖులు అతడిని కలుసుకుని రాజీనామా కారణం అడిగారు.

'రాజకీయాలలోనుండి తప్పుకోవాలనుకుంటున్నాను' అని బదులిచ్చాడు వారికి.

నాయకత్వం మీద ఏదయినా అసంతృప్తి లాంటిది కలిగి ఉంటే చెప్పమనీ, తగువిధంగా తృప్తి పరుస్తామనీ ఆ నాయకులు ఆశ చూపారు.

'తనకు నాయకత్వం మీద ఎలాంటి అసంతృప్తి లేదనీ, కలిగిన అసంతృప్తి రాజకీయాల మీద, డబ్బు చుట్టూ తిరిగే ఈ ప్రపంచం మీదేనని' వారితో అంటే, వారు అతడిని ఒక పిచ్చివాడిని చూసినట్టుగా చూశారు. అయినా కార్యార్థులై వచ్చినవారు కాబట్టి 'రాజీనామాను ఉపసంహరించుకోమని' బతిమాలారు.

'అది తనకిష్టంలేని పని అనీ - తనను బలవంతం చేయొద్దనీ' నిక్కచ్చిగా వారికి చెప్పి పంపేశాడు సత్యనారాయణ.

ఆ తర్వాత ముఖ్యమంత్రి కూడా ఫోన్ చేసి అతడితో మాట్లాడాడు. రాజీనామా విషయం పునరాలోచించుకోమని మరోసారి అడిగాడు.





ఇక ఆలోచించేది ఏమీలేదని, జరగవలసింది ఆ రాజీనామాను ఆమోదించడం మాత్రమే నని అతడు అన్నాడు. ఇక విధిలేని స్థితిలో అతడి రాజీనామా ఆమోదించబడింది.

చాలా మంది బాధగా నిట్టూర్చారు.

విషయం పేపర్ ద్వారా తెలుసుకున్న వసుంధర రెండోరోజుకు తిరిగి అక్కడికి పరిగెత్తుకు వచ్చింది.

"ఇదేమిటి సత్యం! ఇలాంటి పిచ్చి పని చేశావేమిటి?" అంది ఆశ్చర్యంగా.

వసుంధర కూడా తనను అర్థం చేసుకోలేక పోయినందుకు అతడు కొద్దిగా బాధపడ్డాడు. "వసుంధర! నువ్వు కూడా నన్ను అర్థంచేసుకోలేకపోయావా?" అన్నాడు బాధగా.

"ఇందులో అర్థం చేసుకోవలసింది ఏముంది సత్యం! ఎంతో ఉన్నతస్థితికి ఎదిగి రాజకీయాలలో మంచిస్థానం సంపాదించవలసిన నువ్వు ఇలా మొదటి మెట్టు దగ్గరే పడిపోవటం ఎంతవరకూ సమంజసం చెప్పు"

"వసుంధరా! నాకిప్పుడు కావలసింది అధికారం - డబ్బు సంపాదనకాదు. ఆ రెండు నాకు 'సంతృప్తి'నివ్వలేవని తెలుసుకున్నాను నేను. నాకిప్పుడు కావలసింది మానసికశాంతి అంతే"

"అంటే ఈ రాజీనామా వలన నీకు నువ్వు కోరుకునే మానసికశాంతి లభించిందా?"

"నాకిప్పుడు మనశ్శాంతి, సంతృప్తి పూర్తిగా లభించినట్టుగా ఉంది. ఇప్పుడు నా చుట్టూ కేవలం నా హోదాను మాత్రమే గౌరవించి దగ్గర చేరిన వందిమాగధులు లేరు. అలాగే తమ స్వార్థం కోసం నన్ను పావులా వాడుకునే స్వార్థపరులు లేరు. నేనిప్పుడు ఏ తప్పుడు పనులకూ సహకరించ డంలేదు. డబ్బు అనే వ్యర్థపదార్థం కోసం ప్రాకులాడటం లేదు... నేను ఇప్పుడు 'వ్యక్తిగా' నేను ఏ ప్రత్యేక విలువలు లేని సాధారణ వ్యక్తిని. ఇప్పుడు నన్ను నన్నుగా ప్రేమించేవారే నా దగ్గరకు వస్తారు. నన్ను వ్యక్తిగా ప్రేమించే వారే దగ్గరవుతారు... నేను కోరుకునేది కృత్రిమ విలువలు లేని ఇలాంటి వ్యక్తిత్వాన్నే. నాకు కావలసింది ఇలాంటి సంతృప్తే!..."

ఆ స్థాయి ఆలోచనలు ఆమెలోనూ లేవు కాబట్టి, ఆమె కూడా అతడి నిర్ణయాన్ని మనస్ఫూర్తిగా హర్షించలేకపోయింది. ఏదేమయినా అతడు తన సంతృప్తి కోసం మాత్రమే అలా చేశాడు కాబట్టి పోనీలే అని సరిపెట్టుకుంది.

ఆ సమయంలో ఆమెకు క్రితంసారి గేటు దగ్గర అతడు అన్నమాటలు గుర్తుకు వచ్చాయి. తన గురించిన వార్త పేపర్‌లో వస్తుందంటే - తను ఏ మంత్రి పదవో రాబోతుందని కంగ్రాట్స్ చెప్పింది. కాని ఆ వార్త ఇదని తెలిశాక కాస్త బాధగానేఉంది.

"అయితే నువ్వు చెప్పిన పేపర్‌లో వస్తుందన్న గొప్ప వార్త ఇదా సత్యం"

"అవును ఇదే" నవ్వుతూ అన్నాడు.

"నేను మరోలా ఊహించుకుని పొరబడ్డాను"

"అది నాకు తెలుసు"

"అయితే ఇప్పుడు నీకు కాలక్షేపం ఏమిటి?" టాపిక్ మారుస్తూ అడిగిందామె.

"అందమైన ఈ ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ, ఆనాటి కొన్ని అనుభూతులను నెమరువేసుకుంటూ అప్పుడప్పుడు ఆధ్యాత్మిక భావనలు కలుగచేసుకుంటూ కాలం గడపాలనుకుంటున్నాను"

"నీ ఇష్టం! నీ మనసుకు తోచింది, నిన్ను సంతోషపెట్టగలిగింది అది ఏదయినా నాకు ఇష్టమే"

ఆ మధ్యాహ్నం ఆమె తిరిగి మద్రాసు వెళ్ళిపోయింది.

సత్యనారాయణ చేసిన పనిని ఎవరూ హర్షించలేదు. మరెవరూ అర్థంచేసుకోలేదు. అలా హర్షించి, అర్థం చేసుకున్న వ్యక్తి ఒకరున్నారు. అతడే పరాత్పరరావు!

సత్యనారాయణ రాజీనామా వార్తతో బంధుమిత్రులంతా విస్మయంలో మునిగారు. తేరుకుని అతడి దగ్గరకు పరుగెత్తుకు వచ్చి 'ఇలాంటి అమాయకప్పని చేయొద్దని' సలహాగా చెప్పారు. 'నేను పదవిలో ఉంటే మీలాంటి వారిని తృప్తి పరచడం తప్ప, నన్ను నేను తృప్తి పరచుకోలేకున్నాను' అని మనసులోనే అను

కుని, మృదువుగానే వారి సలహాలను తిరస్కరించాడు.

ఇక ఇంట్లో నిష్ఠూరాలు, నిరసనలు మొదలయ్యాయి.

సునీల్ అన్నాడు - "నాన్నా! నీ విజయం కోసం రాత్రింబవళ్ళు తిరిగి శ్రమ పడ్డాం ఇంటింటికీ వెళ్ళి ఓట్లు అడుక్కున్నాం డబ్బు ధారాళంగా ఖర్చుచేశాం కాని మీరేం చేశారు ఖర్చు పెట్టిన డబ్బయినా సంపాదించుకోక మునుపే తిరిగి శ్రమకు ఫలితం పొందక మునుపే రాజీనామా చేసేశారు. అయినా మీరిలాంటి పిచ్చిపని ఎందుకు చేశారు? చెప్పండి నాన్నా".

బదులు చెప్పడం ఇష్టంలేక మౌనాన్ని ఆశ్రయించాడు సత్యనారాయణ.

కామేశ్వరి, ప్రసూనలు కూడా సన్నగా సణుక్కోవడం అతడికి అర్థమవుతూనే వుంది. అయితే మానవనైజం ఔపోసన పట్టిన వ్యక్తి కావడంతో వారి ప్రవర్తన పట్ల అసహ్యించుకోలేదు. ఇది లోకసహజం అని సరిపెట్టుకోవడం మొదలెట్టాడు. ఆ భావమే అతడికి ఎంతో సంతృప్తినివ్వసాగింది. ఒకవిధమైన వేదాంత ధోరణి అలవాటయింది. ఏదో తెలియని సంతృప్తి మనసును తృప్తి పరచసాగింది.

అతడిప్పుడు తరచుగా ఆధ్యాత్మిక ఉపన్యాసాలు వినడం సాగించాడు. ఏకాంతంలో ధ్యానం చేస్తున్నాడు. మనసు ఆలోచనల నుండీ, ఆందోళన నుండీ దూరంగా ఏదో ప్రత్యేక లోకంలో విహరించసాగింది. సంపూర్ణంగా తృప్తిని పొందుతున్నాడని కాదుగాని, ఆ మార్గంలో ఒకరకమైన ఏకాగ్రత, తద్వారా ప్రశాంతత పొందగలుగుతున్నాడు. అది సంతృప్తి అనికూడా అనలేం!

అతడు ఎప్పుడైనా డాబామీద కుర్చీ వేసుకుని, సాయంత్రపు చల్లదనాన్ని ఆస్వాదిస్తూ రోడ్డు వంక చూస్తాడు.

రోడ్డు మీద జనం ఉరుకులుపరుగులతో రకరకాల వాహనాల మీద అటు ఇటు పయనిస్తుంటారు. వారిని చూసి అతడిప్పుడు జాలిగా నవ్వుకుంటుంటాడు. 'అమాయకులైన ఈ జనం ఇలా పరుగుల ద్వారా సాధించేదేమిటి? ఏదయినా సాధించినా దాని ద్వారా తమకు లభించే తృప్తి ఎంతన్నది వీరికి తెలుసా? రేపటిరోజు తాము సంతృప్తిగా జీవించగలమని వీరు అనుకుంటున్నారా'

అతడికిప్పుడు ఆవేశం వస్తుంది. తనొక ప్రవక్తనై ఈ జనాలకు మనిషికి దొరికే తృప్తి గురించి వివరించి చెప్పాలనిపించేది. అయినా ఆ సంతృప్తి అన్నది తనే ఇంకా పొందనిదే జనాలకు తృప్తి గురించి ఎలా ఉపదేశం చేయగలడు.

అతడికి ఒక్కొక్కసారి తనలోని ఈ మార్పులన్నింటికీ కారణం ఏమిటి? అన్న ప్రశ్న కలుగుతూ ఉంటుంది. దానికి సమాధానంగా బహుశా డబ్బేనేమో అనే సమాధానం ఎదురవుతుంటుంది.

డబ్బు వచ్చి ఉండకపోతే తనింకా ఈ జీవిత సమస్యలతోనే కొట్టుమిట్టాడుతుండేవాడు. సమస్యలలో మునిగి తేలేవాడికి 'సంతృప్తి' గురించి ఆలోచించేంత తీరిక ఎక్కడ ఉంటుంది.

అంత తీరిక ఎక్కడుంటుంది? డబ్బు సమస్యలను తీర్చివేస్తుంది. సమస్యలు లేని వ్యక్తికి ఏవేవో ఆలోచనలు మొదలవుతాయి. డబ్బు... డబ్బు... డబ్బు... ఈ డబ్బు చేసే వింతలు వివరించాలంటే ఎవరికీ సాధ్యంకాదు. డబ్బుకున్న వందలకొలదీ కోణాలలో ఎవరైనా చెప్పగలిగిందీ, చూపించగలిగేదీ ఏదో ఒకటీ రెండూ ముఖ్య కోణాల గురించి మాత్రమే. ఏదేమైనా ఈ లోకంలో డబ్బు అన్నది చాలా గొప్ప పదార్థం.

★ ★ ★

అర్థరాత్రివేళ చప్పున మెలుకువ వచ్చింది సత్యనారాయణకు.

చుట్టూ చీకటి...

నల్లని రాక్షసిలాంటి చీకటి... రాక్షసుల వంటి మనుషులు చీకటిలో దాచిన డబ్బు వంటి నల్లని రంగు.

"డబ్బు" ఆ పదం గుర్తుకురాగానే సత్యనారాయణలో ఒక విధమైన అసహ్యంలాంటిది కలిగింది. ఆ రెండక్షరాల పదం తనకు మానసికశాంతిని దక్కించలేదని తెలిసి విరక్తి లాంటిది కలిగింది.




అతడు కళ్ళు చికిలించి చూశాడు. అప్పుడే చీకటికి అలవాటు పడుతున్న ఆ కళ్ళకు పక్కనే బెడ్ మీద పడుకున్న భార్య ఆకారం అస్పష్టంగానే అయినా కనిపిస్తూనే వుంది.

ఆమె హుందాగా పడుకుని వుంది. నిద్రించే సమయంలో కూడా ఆమెలో ఒకరక మైన ఠీవి కనిపిస్తుంది. మెడనిండా బంగారు నగలు, సరయిన తిండితో నిగనిగలాడే వళ్ళు, డబ్బే లోకంగా భావించడంలో సంతృప్తి నిండిన కళ్ళు నిద్రలో కూడా సుఖం పొందగ లుగుతోంది. ఆమెలో డబ్బు ఇచ్చే సుఖాన్ని అనుభవించడం ఏ కొందరికి మాత్రమే సాధ్యం!

అతడు తనూ నిద్రపోవాలని బలవంతంగా కళ్ళు మూసుకున్నాడు. నిద్ర రాలేదు. అసంతృప్తితో వేగిపోయే మనిషికి నిద్రెలావడు తుంది?

పక్కమీద అటుఇటు కాసేపు పొర్లాడు. దాహంగా అనిపించింది. అతడు పక్కకు ఒంగి మంచం కింద తడిమాడు. వాటర్‌బా టిల్ తగల్లేదు. కామేశ్వరి వాటర్‌బాటిల్ తేవటం మర్చిపోయినట్లుంది. మనసులోనే అనుకున్నాడు.

పైకి లేచి స్విచాన్ చేశాడు. ఆ గది మొత్తం ఒక్కసారిగా వెలుతురుతో నిండింది. అవతలి రూమ్‌లో ఫ్రిజ్ ఉంది. అతడు ముందుకు నడిచి తలుపు గడియతీశాడు. ఆ చప్పుడుకు కామేశ్వరమ్మ కళ్ళు తెరిచి అతడిని చూసి గబుక్కున లేచింది. ''ఏమిటండీ ఏం కా వాలి?'' ప్రశ్నించింది చాలా మర్యాదగా.

''దాహమైతేనూ''

''వాటర్‌బాటిల్ పెట్టలేదా?''

''లేదు''

ఆమె చాలా నొచ్చుకుంది. ''అరెరె... మర్చి పోయినట్టున్నాను. అయినా ఆ మాత్రానికి మీ రు లేవకపోతే నన్ను తట్టిలేపితే నేను తెచ్చి ఇచ్చేదాన్నిగా... అన్నింటికీ మీరెందుకు శ్రమ పడటం. 'మీరుండండి' నేను తెస్తాను.''

అతడు ఆగిపోయాడు. ఆమె అవతలి గది లోనికి వెళ్ళి నిమిషం తరువాత వాటర్‌బాటిల్ తెచ్చి అతడికి ఇచ్చింది.

అది అందుకుంటుంటే అతడికి పాతరోజు లు గుర్తుకొచ్చాయి. ఒకప్పుడు ఇలాగే దాహమై నిద్రలేస్తే ఆమె విసుక్కుంటూ బద్ధకంగా నిద్ర పోయేది. కాని ఇప్పుడు...

అతడికి అనిపించింది ప్రతి వ్యక్తి జీవితగ మనం డబ్బుతో ముడిపడి వుంటుంది. అభి మానాలు, ఆప్యాయతలు, ఆదరణ, గౌరవం, మర్యాద, విలువలు ఇవన్నీ మనిషి దగ్గరున్న డబ్బుమీదే ఆధారపడి ఉంటాయి. బట్ అవ న్నీ కృత్రిమమైనవే.

''నువ్వు నిద్రపో'' కామేశ్వరితో అన్నాడత ను.

''మరి మీరు?'' ఆప్యాయంగా అడి గిందామె.

''నిద్ర రాలేదు. కాసేపలా డాబామీద తిరిగొ స్తాను''.

''నేనూ వచ్చేదా?''

''వద్దు... నువ్వు పడుకో''

కామేశ్వరి తలూపింది.

అతడు మెట్లెక్కి డాబా మీదికి చేరి పిట్టగోడ మీద కూర్చున్నాడు.

ఒక శరన్మేఘం అతడివంక జాలిగా చూడ సాగింది. మరో పిల్లగాలి తెమ్మెర మృదువుగా స్పృశిస్తూ సాగిపోయింది.

అతనికి మనసులో అలజడి ప్రారంభ మైంది. మనిషి జీవించేది ఎందుకు? జీవితాని కి పరమార్థం ఏమిటి? తన ఉనికి గురించి ఏమాత్రం పట్టించుకోని మానవుడు డబ్బు సంపాదనే ధ్యేయంగా, అదే అంతిమలక్ష్యంగా బతుకుతున్నాడు.

మరి అనంతమైన డబ్బు సంపాదించినా మనిషికి తృప్తి లభిస్తుందా? తృప్తి అన్నది మనిషికి ఎప్పుడు లభిస్తుంది? డబ్బు సంపాద నకి, తృప్తికి సంబంధం ఉందా?

అసలు మనిషికి సిసలైన సంతృప్తి ఎక్కడ లభిస్తుంది?

...ఆ ప్రశ్నలకు తనకూ జవాబు తెలియకపో వడంతో సిగ్గుపడిన చంద్రుడు మబ్బులచా టుకు తప్పుకున్నాడు.

మరి అతడి ప్రశ్నలకు జవాబు చెప్పగలవా రెవ్వరు?





# చతుర కతలు

## లౌక్యం

పొద్దున్నే దుకాణం తెరిచి బేరాలకోసం ఎదురుచూస్తున్నాడు సుబ్బిశెట్టి. అప్పుడు సమయం ఉదయం ఏడు గంటలు. ఇంకా ఆ వీధిలో జనసంచారం మొదలుకాలేదు. అందరికంటే దుకాణం ఓ గంట ముందు తెరిచి ఒక గంట ఆలస్యంగా మూసే సుబ్బిశెట్టి ఆ రోజు "షాపు తెరిచి అరగంటయినా ఒక్కడూ వచ్చి చావడేం" అని అనుకోసాగాడు.

అదే సమయానికి ఓ నలభై ఏళ్ల బట్టతలాయన లోనికి రావటం చూసి "ఏం కావాలండీ?" అన్నాడు ఎక్కడలేని వినయం ఒలకబోస్తూ.

అతడేదో అనబోతూ బయటకు చూశాడు. అతని మొహం ఎర్రబడింది. "వెధవ... ఇక్కడిక్కూడా తగలడ్డాడూ!" అని గొణుక్కున్నాడు.

బయట కళ్ళజోడున్న ఓ నడివయస్సాయన అంగట్లోకి రాబోతున్నాడు. అతను ఈ బట్టతలాయన్ని చూసి మొహం చిట్లించాడు.

అతను లోపలికి రాగానే "హు" అంటూ బట్టతలాయన మొహం తిప్పుకున్నాడు.

"హు!హు!" అని రెండుసార్లు అని మరోవైపు మొహం తిప్పుకున్నాడు కళ్లజోడాయన.

వీళ్లవరస అర్థంకాని సుబ్బిశెట్టి "అయ్యా! మీకేం కావాలో చెప్తే...." అంటూ నసిగాడు బట్టతలాయనతో.

"నాకంటే నీకు వాడే ఎక్కువయ్యాడా?" అన్నాడు కళ్ళజోడాయన.

సుబ్బిశెట్టి కంగారుపడి "నా ఉద్దేశం అది కాదండీ" అని ఏదో చెప్పబోతుండగా బట్టతలాయన "ఏయ్ శెట్టీ! మధ్యలో వాడేదో కూసినంతమాత్రాన నువ్వెందుకయ్యా భయపడతావు?" అన్నాడు.

కళ్లజోడాయన "ఒరేయ్! మర్యాదగా మాట్లాడు. కూయటానికి నేనేం పక్షిని కాదు. నువ్వే ఎప్పుడూ ఎద్దులాగా రంకెలేస్తుంటావు" అన్నాడు.

బట్టతలాయన కోపంగా ముందుకొచ్చాడు.

"నేను ఎద్దునా?"

"నేను పక్షినా?"

"అని ఎవరన్నారు?"

"నీ తాత!" అంతే!

బట్టతలాయన కళ్లజోడాయనని లాగిపెట్టి తన్నాడు.

అతనూ ఏం తక్కువ తినలేదు, తిరిగొచ్చి బట్టతలాయన్ని ఒక్కటిచ్చుకున్నాడు.

సుబ్బిశెట్టి ఇదంతా నిర్ఘాంతపోయిచూస్తున్నాడు. వారిద్దరూ రోడ్డుమీద అలా కొట్టుకునే సమయంలో ఇద్దరు పోలీసులు పరుగున వచ్చి వారిని పట్టుకుని తీసుకెళ్లి కోర్టులో హాజరుపరిచారు.

పోట్లాట జరిగిన సమయం తెల్లవారుఝాము కావటంతో, ఆ సంఘటనను ఎవరూ చూడలేదు. సుబ్బిశెట్టి దురదృష్టంకొద్దీ ఆ సంఘటన అతని దుకాణం ముందే జరగటంతో, అతన్ని ప్రత్యక్షసాక్షిగా కోర్టులో హాజరుపరిచారు.

జడ్జిగారు శెట్టితో "నువ్వు దీన్ని గురించి ఎక్కువ చెప్పనవసరం లేదు. ముందు ఎవరు ఎవర్ని కొట్టారో అది చెప్పు, చాలు" అన్నారు.

సుబ్బిశెట్టి గుటకలు మింగసాగాడు. తను నిజంచెబితే రెండోవారికి కోపమొస్తుంది. తన దుకాణానికొచ్చే కస్టమర్లలో ఒకరు తగ్గిపోతారు.

చివరకు సుబ్బిశెట్టి ఆలోచించి ఇలా చెప్పసాగాడు "జడ్జిగారూ... నేను దుకాణంలో ఉండగా వీరిద్దరూ వచ్చి కొంతసేపు తిట్టుకున్న తరువాత ఇద్దరూ కొట్టుకోవటానికి సిద్ధపడ్డారండీ! మొదట ఆ బట్టతలాయన జేబులో పెన్నుతీసి కిందపెట్టాడు. ఈయనా అదే పని చేశాడు. ఆయన వాచీ తీసి కిందపెట్టాడు.





ఈయనా అదే పనిచేశాడు. ఆయన చొక్కా చేతులు మడిచాడు. ఈయనా....''

శెట్టి వాగ్ధోరణి చూసి జడ్జీగారికి చిర్రెత్తుకొచ్చింది "అసలు నేనడిగింది చెప్పవయ్యా! ముందు ఎవరు ఎవర్ని కొట్టారు?" అన్నారు కోపంగా.

సుబ్బిశెట్టి వినయంగా "మరేనండీ... వీరివిధంగా సిద్ధపడి మరుక్షణంలో కొట్టుకోబోతారనగా మా వీధిలోంచి ఓ పెద్ద లారీ వేగంగా వెళ్లిపోయిందండీ! ఆ వేగానికి ఇంత దుమ్ము వచ్చి నా కళ్లల్లో పడింది. నేను కళ్లు నులుముకుని తెరిచేసరికి ఇద్దరూ అప్పటికే కొట్టుకోవటం మొదలుపెట్టేశారండీ"

జడ్జీగారు నోరెళ్ళబెట్టారు.

—పి. ఆదిలక్ష్మి

## లక్కీ ఫెలో

"హల్లో రాజా ఏమిటీ డల్‌గా వున్నావ్... నిన్న మీ ఆవిణ్ణి టి.వి.లో చూశాను. భలే పాడింది గురూ పాట... కంగ్రాట్స్..." ఆనందంగా శుభాకాంక్షలు తెలియచెప్పాడు మిత్రుడు రాజాకి గోపాల్.

రాజా ఏడవలేక నవ్వుతూ థాంక్స్ చెప్పాడు.

అది గమనించిన గోపాల్-

"ఏమిటీ నీ ముఖం వాడిపోయిఉంది" అన్నాడు.

రాజా మౌనంగా వుండిపోయాడు.

"నీ స్థానంలో నేనుంటే ఎంత ఆనందించేవాడినో... యు ఆర్ వెరీ లక్కీ ఫెలో..." గోపాల్ అన్నాడు.

రాజా విచిత్రంగా గోపాల్ వైపు చూసి- "నిజంగా..." అన్నాడు.

"యస్... ఇందులో ఆశ్చర్యపడవలసింది ఏముంది... మీ శ్రీమతి కంఠం రియల్లీ సూపర్బ్... ఆవిడకి అదృష్టం బాగుంటే సినీ ఛాన్స్ కూడా రావచ్చేమో..."





"ఆదీ సంగతి..." విచారంగా అన్నాడు రాజా.

ఈసారి పిచ్చివాడిలా రాజావైపు చూశాడు గోపాల్. "గోపాల్... నువ్వు నాకు కొత్తఫ్రెండ్‌వి. నా గురించి నీవు తెలుసుకోవాల్సిన విషాదగాథ చాలా వుంది..." అన్నాడు రాజా.

గోపాల్‌కేమీ బోధపడలేదు.

"గోపాల్... నీ శ్రీమతి మా ఆవిడ ప్రోగ్రామ్ చూసిందా?" అడిగాడు రాజా.

"చూసింది... ఏం...?" గోపాల్ ప్రశ్నించాడు.

"ఆవిడ ఫీలింగ్స్‌ని నువ్వు అర్థం చేసుకున్నావా?...?

"లేదు... ఏం..."?

"ఆదీ సంగతి... మీ ఆవిణ్ణి ఓసారి కలిసి మా ఆవిడ గురించి చెప్పమను..."

గోపాల్‌కేమీ బోధపడక అయోమయంగా తలూపాడు.

మర్నాడు-

రాజా గోపాల్‌ని అడిగాడు-

"మీ ఆవిడ మా ఆవిడ గురించి ఏం చెప్పింది?"

"నాలా మీ శ్రీమతి కంఠం గురించి పొగడలేదు గురూ..."

"మరి..." ఆతృతగా అడిగాడు [illegible]

"మీ శ్రీమతి కట్టుకున్న ఖ[illegible] నగల్నే పొగిడింది మా ఆవిడ"

అప్పుడే భోరుమన్నాడు రాజా-

"ఇంకా నీ మెదడులో దీపం వెలగలేదా మిత్రమా! మా ఆవిడది అందమైన కంఠమే... ఆమె పాడితే "చిత్ర" పాడినట్లే వుంటుంది- నిజమే... అలా అనే నేనామెను కోరి కోరి పెళ్లిచేసుకున్నాను... కానీ గురూ! ఆమె తన ప్రోగ్రామ్ ఎక్కడకెళ్ళి ఇచ్చినా, అంతకు ముందు నన్ను పట్టుచీర కొనమనీ, రకరకాల నగలు కొనమనీ వేధించుకుతింటుంది. ఒక ప్రోగ్రామ్‌కి చేసుకున్న అలంకరణ మరో ప్రోగ్రాంకి పనికిరాదంటుంది. తన పాట ఎంత బావుంటుందో అంతకంటే తన చీర, ఆభరణాలు ఘనంగా వుండాలని నన్ను వేపుకు తింటుందనుకో... ఇప్పుడు చెప్పు- నేను లక్కీ ఫెలోనా... లక్కీఫెలోనా..." గుండెలోని లావాలా మరుగుతున్న బాధను పైకి వొంపుకొని తన దురదృష్టాన్ని చాటుతున్న రాజాని చూసిన గోపాల్‌కి తన మిత్రుడు ఎంతటి లక్కీఫెలోనో అర్థమైంది.

— టి. వెంకటేష్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 52685, Visakhapatnam 52211, Tirupati 5291.

